భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ బ్రహ్మాండ పురాణం



వచనం : డా॥ జయంతి చక్రవర్తి

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ బ్రహ్మాండ పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

**మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...**

**వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



**శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ బ్రహ్మాండ పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రుజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...





Sreepeetam

# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.

Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

## ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

“వేదోపబృంహణాలు” అని పేరు. “ఉపబృంహణం” అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం ।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్।**
**పురాణ సంహితాం దధ్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**

**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**

**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**

**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**

**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**

**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**

**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽ స్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా ఉండవచ్చు.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠునికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదునికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదునికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్ద్విజతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ బ్రహ్మాండ పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో చివరిదిగా చెప్పబడింది బ్రహ్మాండపురాణం. బ్రహ్మ సృష్టికి సంబంధించిన ఎన్నో విశేషాలని ఈ పురాణం వివరిస్తుంది. 'బ్రహ్మాండ మస్థిగీయతే' అన్నమాట ప్రకారం శ్రీమహావిష్ణువు ఎముకలతో ఈ పురాణాన్ని పోల్చబడిందని తెలుస్తోంది. అలాగే 'బ్రహ్మాండం ద్వాదశైవతు" అన్న వాక్యాన్ని అనుసరించి ఈ పురాణంలో మొత్తం పన్నెండువేల శ్లోకాలున్నాయి. ఇది నాలుగు పాదాలుగా విభజించబడింది. 1.ప్రక్రియా పాదం 2.అనుషంగ పాదం 3.ఉపోద్ఘాతపాదం 4.ఉపసంహారపాదం అని.

## బ్రహ్మాండ పురాణంలోని విషయాలు

**1. ప్రక్రియా పాదం :** ఈ విభాగం నైమిశారణ్యకథనంతో ప్రారంభమవుతుంది. ఇందులో హిరణ్యగర్భుడి ఉత్పత్తి, లోకాల్ని సృష్టించటం, వాటి విశేషాలు, మహాలోకాన్ని సృష్టించటం. అందులోని విశేషాలు, వరాహావతార వర్ణన వంటి విషయాలు ప్రధానంగా వివరించబడ్డాయి.

**2. అనుషంగ పాదం :** ఇందులో మన్వంతరాలు, లోకజ్ఞానం, మానవసృష్టి విశేషాలు, మహాదేవుడి వైభవం, ప్రియవ్రతుడి వంశ చరిత్ర, భారత వర్ష వర్ణన, కింపురుషాది దేశాల వర్ణన, జంబూద్వీప వర్ణన, లక్షాదిద్వీపాల విశేషాలు, అధోలోకాల వివరాలు, ఆదిత్యవ్యూహం, ధృవమండల విశేషాలు, నక్షత్రాల సమాచారం, లింగోత్పత్తి కథనం, దారువన ప్రకాశం, భస్మధారణ విధి, ఋషిలక్షణం, చాక్షుషసర్గ వర్ణనం, మన్వంతర విశేషాలు వంటి ప్రధాన విషయాలు తెలియచేయబడ్డాయి.

**3. ఉపోద్ఘాత పాదం :** ఇందులో ఋషిసర్గ, ప్రజాపతివంశ వివరాలు, పితృకల్పం, శ్రాద్ధ కల్పం, నక్షత్ర శ్రాద్ధం, జమదగ్ని మహర్షి చరిత్ర, కార్తవీర్యార్జునుడి చరిత్ర, పరశురాముడి చరిత్ర, సగరుడి చరిత్ర, ఇక్ష్వాకువంశం, ధన్వంతరి విశేషాలు, యయాతి చరిత్ర, విష్ణుమాహాత్మ్యం వంటి విశేషాలు ప్రధానంగా ఈ పూర్వ విభాగంలో చెప్పబడ్డాయి. ఉత్తర భాగంలో శివపురవర్ణన, శ్రీలలితోపాఖ్యానం ప్రధానంగా చెప్పబడ్డాయి.

**శ్రీలలితోపాఖ్యానం :** బ్రహ్మాండ పురాణానికి తలమానికం శ్రీలలితోపాఖ్యానం. మొత్తం ఇది 44 అధ్యాయాల్లో వివరించబడింది. ఇందులో లలితాదేవి ఆవిర్భావ విశేషాలు, భండాసురుణ్ణి ఆ దేవి సంహరించటం, మణిద్వీపం విశేషాలు వంటివేకాక, శ్రీలలితాదేవి ఉపాసనావిధానం కూడా ఈ పురాణంలో ప్రముఖంగా చెప్పారు. శ్రీలలితాదేవి ఉపాసకులకు ఈ విషయాలు ఎంతగానో ఉపకరిస్తాయి.

శ్రీబ్రహ్మాండపురాణం అనే ఈ గ్రంథంలో బ్రహ్మాండమహాపురాణంలో చెప్పిన ప్రధానమైన వృత్తాంతాలను, కథనాలను ఉపాఖ్యానాలను మాత్రమే సంక్షిప్తంగా తెలియచేస్తున్నాం.

## పురాణ విశేషాలు - ప్రశంస

నమోనమఃక్షయే సృష్టౌస్థితే సత్త్వమయాయవా ।
నమోరజస్తమః సత్త్వత్రిరూపాయ స్వయంభువే ॥

జతంభగవతాతేన హరిణాలోకధారిణా ।
అజేన విశ్వరూపేణ నిర్గుణేన గుణాత్మనా ॥

బ్రహ్మాణం లోకకర్తారం సర్వజ్ఞ మపరాజితమ్ ।
ప్రభుం భూతభవిష్యస్య సాంప్రతస్యచ సత్పతిమ్ ॥ *(శ్లో॥1-3, అధ్యా-1)*

సృష్టిస్థితి లయాలను చేయగలిగిన సర్వశక్తియుతుడికి, సత్త్వస్వరూపుడికి, సత్త్వరజస్తమోగుణరూపుడైన స్వయంభువుడికి నమస్కారం. భగవంతుడు, అన్ని లోకాల్నీ భరించేవాడు, పుట్టుకే లేనివాడు, విశ్వస్వరూపుడు, సగుణుడు నిర్గుణుడూ అయిన శ్రీహరికి జయమగుగాక! సకలలోక సృష్టికర్త, సర్వజ్ఞుడు,

అపరాజితుడు, భూత భవిష్యద్వర్తమానాలకు ప్రభువు, అన్నిటికీ భర్త అయిన ఆ పరబ్రహ్మకి నమస్కారం.

పూర్వం నైమిశారణ్యంలో దీర్ఘ సత్రయాగం జరుగుతుండగా వ్యాసమహర్షి శిష్యుడైన రోమహర్షణుడు అక్కడికి వచ్చాడు. ఆయన్ని స్వాగతించి సత్కారాలు జరిపిన తరువాత అక్కడున్న ఋషులందరూ ఆయనకి నమస్కరించి చిత్రవిచిత్రమైన ఈ సృష్టి ఏ విధంగా ప్రారంభమయ్యింది? ఏఏ వంశాలవారు పృథివిని పాలించారు? అనే విశేషాలు చెప్పమని కోరారు. వారికోరిక మన్నించిన రోమహర్షణుడు ఇలా వారికి చెప్పటం ప్రారంభించాడు.

మహర్షులారా! నా గురుదేవులు భగవాన్ వ్యాసమహర్షి నాకేది చెప్పారో దానినే మీకు చెబుతాను. పురాణం అనేది ప్రధానంగా 1.సర్గ 2.ప్రతిసర్గ 3.వంశం 4.మన్వంతరం, 5.వంశానుచరితం అని అయిదు లక్షణాలతో వుంటుంది. ఈ బ్రహ్మాండ పురాణంలో మొదటిది ప్రక్రియా పాదం. ఇందులో ఈ పురాణంలో చెప్పబడ్డ కథాభాగం సంక్షిప్తంగా చెప్పబడుతుంది. అలాగే పూర్తి విశేషాలు సవివరంగా అనుషంగం, ఉపోద్ఘాతం, ఉపసంహారం అనే పాదాలలో క్రమంగా చెప్పబడ్డాయి.

మొట్టమొదట సకల శాస్త్రాలకు పురాణాన్ని (చరిత్రని) ఆదిపురుషుడి ద్వారా బ్రహ్మ విన్నాడు. తరువాత ఆ చతుర్ముఖ బ్రహ్మ నుంచి వేదాలు, వేదాంగాలు, ధర్మశాస్త్రాలు, వ్రతాలు తదితర విషయాలన్నీ వెలువడ్డాయి. తరువాత అవ్యక్తం నుంచి మహతత్త్వం వరకూ అన్నిటినీ సృష్టించాలి అని బ్రహ్మ నిశ్చయించుకున్నాడు. ఆ విధంగా వాటన్నిటినీ ఆయన సృష్టించిన విధానం, నదులు, పర్వతాల పుట్టుక, సకల మన్వంతరాల విశేషాలు, బ్రహ్మ వృక్షమాహాత్మ్య బ్రహ్మ జన్మ విశేషాలు వివరించబడ్డాయి. ఆ తరువాత బ్రహ్మ చేసిన ప్రజాసృష్టి, బ్రహ్మ అవస్థలు, కల్పాల పుట్టుక, శ్రీమహావిష్ణువు నీటిలో శయనించటం, తరువాత ఆయన భూమిని ఉద్ధరించటం వర్ణించబడింది.

కల్పం నిర్వచనం, బ్రహ్మ చేసిన తొమ్మిది రకాల సృష్టి, ముల్లోకాల సృష్టి, బ్రహ్మ శరీరం నుంచి ధర్మం వంటివి ఆవిర్భవించటం చెప్పబడ్డాయి.

అలాగే బ్రహ్మ శరీరం నుంచి శతరూప అనే స్త్రీ, మరో పురుషుడు జన్మించటం, ఆ శతరూప ద్వారా బ్రహ్మకి ప్రియావర్తుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు పుత్రులు జన్మించటం చెప్పబడ్డాయి. భృగువు తదితర ఋషుల సంతానోత్పత్తి, వశిష్ఠమహర్షి వంశ గోత్రకీర్తనం, 'స్వాహా' దేవి ద్వారా మొదటి సంతానం జన్మించటం వంటి విశేషాలు చెప్పబడ్డాయి. తరువాత 'స్వధా' ద్వారా రెండు రకాలుగా ప్రకాశించిన పితృదేవతల ఉత్పత్తి కలగటం, మహేశ్వరుడు దక్షుణ్ణి శపించుట, భృగుమహర్షి ఇచ్చిన శాపం సత్యమవటం, దక్షుడు సత్యం తెలుసుకుని శివుడితో వైరాన్ని విరమించుకోవటం, ప్రజాపతి అయిన కర్ధముడి కుమార్తె శుభలక్షణాలు, ప్రియవ్రతుడి కుమారుల చరిత్ర విస్తారంగా వివరించబడింది. ఆ ప్రియవ్రతుడు తన కుమారుల్ని వేరువేరుగా వివిధ ద్వీపాలకి అధిపతులుగా నియమించటం, స్వాయంభువమనువు జననం, దేశవిభాగాలు, నదులు, వాటిభేదాలు, ద్వీపసహస్ర భేదాలు, వాటి అంతర్భాగాలైన ఏడు దీపాలలోని పర్వతాలతో సహా యోజనసంఖ్య ప్రమాణాలు కూడా చెప్పబడ్డాయి.

హిమవంతం, హేమకూటం, నిషధం, మేరువు, నీలం, శృంగి, శ్వేతం అనే ఏడు సప్తకుల పర్వతాలు కీర్తించబడ్డాయి. భారతదేశం తదితర వర్షాలు, అందులో వున్న నదులు, పర్వతాలు సప్త సముద్రాలతో ఏర్పడ్డ జంబూద్వీపం వంటి ద్వీపాలు వర్ణించబడ్డాయి. తరువాత భూమి లోకాలోకాలు వాటి విస్తీర్ణం, సూర్యచంద్రులు భూమి ప్రమాణం సంపూర్ణంగా వివరించబడతాయి. తరువాత మానససరోవరం ఉత్తర శిఖరం నుంచి పుట్టిన పుణ్యనదులు వివరించబడ్డాయి. నాలుగు దిక్కులా ఊర్ధ్వభాగంలో వున్న లోకాలు, లోకపాలురు, దక్షిణ ఉత్తర దిశల్లో వున్న పితృదేవతలు, ఇతర దేవతల మార్గాలు. సత్త్వరజో గుణాలతో వున్న గృహస్థులు, సన్న్యాసుల ప్రవృత్తి, సూర్యచంద్రుల ఆకాశస్థితి, గ్రహాల సంచారం, ప్రజల శుభాశుభాలు చక్కగా కీర్తించబడతాయి.

బ్రహ్మ స్వయంగా సూర్యమండలాన్ని నిర్మించాడు. ఆయన వల్లే పగలు క్షయం పొందుతుంది. సకలదేవతల నాయకుడైన బ్రహ్మ దేవతలతో, సూర్యులతో, ఋషులతో, గంధర్వులతో, అప్సరసలతో, సర్వరాక్షసులతో రథాన్ని అధిష్టించి

వుంటాడు. సోమలతాదుల వృద్ధి క్షయాలు, గ్రహాలు, నక్షత్రాలు, శీతోష్ణ స్థితులు, సూర్యుణ్ణి ఆశ్రయించుకుని వున్న గ్రహాల గతులు వర్ణించబడ్డాయి. పురూరవుడి మాహాత్మ్యం, పర్వాలు, పర్వాల సంధులు, స్వర్గలోకాన్ని అధోలోకాల్ని పొందినవారు అయిన రెండు రకాల పితృదేవతలు వారికి సంబంధించిన శ్రాద్ధ విధిచే కలిగే ఫలితాలు, యుగప్రమాణం, నాలుగు యుగాలలో వున్న ధర్మస్థితి, ఋషుల ప్రవర్తన, వసువులకి పట్టిన అధోగతి, స్వాయంభువ మనువు వృత్తాంతం, నాలుగు యుగాలలోని అవస్థలు కలియుగ విశేషాలు, మన్వంతరాలు వాటి విశేషాలు తదితర విషయాలు వర్ణించబడ్డాయి.

ఋషుల గోత్రాలు ప్రవరలు, సూతపుత్రుల బ్రాహ్మణుల లక్షణాలు, వేదవ్యాసుడు వేదాలను విభజించటం, మన్వంతరాల క్రమం, కాలవిజ్ఞానం వివరించబడ్డాయి. ఉత్తాన పాదుడి కుమారుడైన ధ్రువుడు, అతడి సంతానం, ప్రజాపతి వలన మారిషకి జన్మించిన పదిమంది ప్రచేతసుల వివరం వర్ణించబడ్డాయి. పద్నాలుగుమంది మనువుల సంపూర్ణ వృత్తాంతాలు, దక్షుడి జననం, దితికి మరత్తు జన్మించటం, ఆ మరుత్తులకి నలభై తొమ్మిది మంది మరుద్గణాలు ఆవిర్భవించటం, దైత్యులు, దానవులు, యక్ష, గంధర్వ, రాక్షసులు సకల భూత పిశాచాలు, యక్షులు, పక్షులు లతలు, అప్సరసల ఉత్పత్తి చాలా విస్తారంగా చెప్పబడ్డాయి. మార్తాండ మండలం, ఐరావతగజం ఉత్పత్తి, వినతాదేవి పుత్రుడైన గరుత్మంతుడి జననం, మహాత్ములైన భృగువంశీయులు, అంగిరసుడు, కశ్యపుడు, పులస్త్యుడు, అత్రి, పరాశరుల సంతానం గురించి వివరంగా వర్ణించబడింది.

ధ్రువుడి వినాశనం, ఇక్ష్వాకువంశీయుల సంక్షిప్త చరిత్ర, యయాతి, యదు, హైహయవంశీయుల చరిత్ర వర్ణించబడింది. క్రోధి, జ్యామఘుడు, దేవవృధుడు, అంధకుడు, దుష్టి, విశోధుడు, మణిరత్నుడు, శూరుడు తదితరుల చరిత్రలు, ఆ తరువాత ఋషుల సంతానం, ఒకే వంశంలో జన్మించిన కంసుడి దుర్మార్గం, దేవకీ దేవికి శ్రీకృష్ణుడు జన్మించటం, విష్ణువు భృగువు ద్వారా శపించటం,

ఈశ్వరుణ్ణి శుక్రుడు ఆరాధించటం, మహాశక్తివంతుడైన శుక్రుడు ఇంద్రుడి రూపంలో రాక్షసుల్ని మోహంలో పడవేయటం, బృహస్పతి శుక్రుణ్ణి శపించటం, విష్ణుమూర్తి మాహాత్మ్యం శంతనుడి శౌర్యం, నిత్యనైమిత్తిక, ప్రాకృత ప్రళయాలు సంభవించటం, చూడటానికి శక్యంకాని భానుడి తీవ్రప్రతాపం, సాంఖ్యయోగ లక్షణం, సప్తభువనాల వర్ణన తదితర విశేషాలు చెప్పబడ్డాయి.

పాపాత్ములకి రౌరవాదినరకాలలో శిక్షలు పడడం, జనన మరణాత్మకమైన సంసారం,జీవుల ధర్మా ధర్మాల్ని ఆశ్రయించి కలిగే ఊర్ధ్వలోకాల అథోలోకాల గతులు, బ్రహ్మకి కూడా శాశ్వతత్వం లేకపోవటం, దుర్లభమైన మోక్షాన్ని పొందే ఉపాయం, శక్తికి వశిష్ఠ మహర్షి జన్మించటం, వశిష్ఠుడికి పరాశరుడు జన్మించటం, ఆ పరాశరుడికి సత్యవతి అనే ఆమె ద్వారా వ్యాసుడు జన్మించటం, ఆ వ్యాసుడికి శుకమహర్షి పుత్రుడుగా జన్మించటం, పరాశరుడికి విశ్వామిత్రుడి మీద ద్వేషం కలగటం విశ్వామిత్రుణ్ణి వధించాలని వశిష్ఠుడు అగ్నిని ప్రయోగించటం, దైవ విధివల్ల అది తప్పటం, ఈశ్వరానుగ్రహంతో వ్యాసుడు ఒకటిగా వున్న వేదాలను నాలుగుగా విభాగించటం, అతడి శిష్య ప్రశిష్యుల ద్వారా వేదాలు వ్యాప్తి చెందటం, పూర్వం నించీ వున్న శరద్వతీ నది నాశనమైపోగా నైమిశారణ్యంలో వున్న మునులు దాన్ని పునరుత్థానం చేయటం వంటి విశేషాలు వర్ణించబడ్డాయి. ఈ విధంగా పురాణ నిర్మాణ ప్రయోజనం గురించి ఈ అధ్యాయంలో చెప్పబడింది. ఇది మొదటి పాదం.

పురాణానికి సంబంధించిన అన్ని విషయాలనూ ఈ మొదటి పాదంలో సంగ్రహంగా చెప్పటం జరిగింది. ఎవరైతే ఇంద్రియ నిగ్రహంతో ఈ అధ్యాయాన్ని అధ్యయనం చేస్తాడో అతడికి ఈ పురాణం సమగ్రంగా అర్థమవుతుంది. సాంగోపాంగంగా ఉపనిషత్ సహితంగా నాలుగు వేదాలను అధ్యయనం చేసిన విప్రుడు ఇతిహాస, పురాణ సహితంగా వేదాన్ని శిష్యులకి వివరించాలి. ఇలా కాకుండా అల్పజ్ఞానంతో వేదాల్ని వివరిస్తే ఆ వేదాలు "అయ్యో! ఇతడు నన్ను అపహరిస్తున్నాడు" అని భయపడతాయి.

స్వయంభువైన బ్రహ్మచేత చెప్పబడ్డ ఈ పురాణాన్ని అధ్యయనం చేసినవాడు ఎప్పటికీ ఆపదల్ని పొందదు. ఉత్తమలోకాల్ని చేరుకుంటాడు. ఈ పురాణం పూర్వం జరిగిందని, ఇది వేదాంతంతో సమానమైనదని తెలుసుకున్నవాడు సకల పాపాలనుంచీ విముక్తి పొందుతాడు.

## నైమి శారణ్యం

పూర్వం ధర్మచక్రం యొక్క నేమి భూలోకంలో ఒక పవిత్రప్రదేశంలో పడింది. అదే మునిజన పూజితమైన నైమిశక్షేత్రంగా మారింది. ఎంతో పవిత్రమైన ఆ నైమిశారణ్య క్షేత్రంలో, ఈ సమస్తవిశ్వాన్నీ సృష్టించాలనే తలపుతో బ్రహ్మదేవుడు గొప్పయాగాన్ని చేసాడు. ఈ దివ్యక్షేత్రంలోనే సిద్ధులచేత, చారణులచేత సేవించబడే గోమతీనది ప్రవహిస్తోంది. మహాత్ముడైన వశిష్ఠమహర్షికి అరుంధతి వల్ల శక్తి అనే పుత్రుడుదయించాడు. ఇంద్రుడి శక్తివల్ల పూర్వం కల్మాషపాదుడనే రాజుకి వైరం కలిగిన ప్రదేశంలోనే (అనగా గోమతీ తీరం) వశిష్ఠ విశ్వామిత్రులకి కూడా వైరం కలిగింది. బ్రహ్మవాదులైన మహర్షులు కొందరు నైమిశ క్షేత్రంలో ఒక పర్వతం ఉండాలని కల్పించారు. వారంతా నైమిశాన్ని తమ నివాసంగా చేసుకున్నారు. ఆనాటి నుంచీ వారు ఆ కారణంగా నైమిశేయులు అని ప్రసిద్ధిచెందారు. ఆ కాలంలో పురూరవుడు భూమిని పాలిస్తున్నాడు. అప్పుడు నైమిశేయులంతా నైమిశారణ్యంలో పన్నెండు సంవత్సరాలు దీర్ఘసత్రయాగాన్ని చేసారు. పురూరవ చక్రవర్తి అష్టాదశ సముద్రాల్లో వున్న ద్వీపాలన్నిటినీ పాలిస్తూ ఆనందంగా కాలంగడుపుతున్నాడు. ఒకనాడు దేవదూతలతో ప్రేరేపించబడ్డ ఊర్వశి ప్రేమలో పడి ఆమెతోనే సంచరించసాగాడు. నైమిశారణ్యంలో వున్న మునులు నరపతి అయిన పురూరవ చక్రవర్తితో సత్రయాగాన్ని చేయించారు.

ఒకనాడు పావకుడు (అగ్ని)వల్ల గంగ గర్భాన్ని ధరించి ప్రకాశవంతమైన కుమారుణ్ణి కన్నది. ఆమెతో సంగమించే సమయంలో కొంత వీర్యాన్ని అక్కడున్న పర్వతశిఖరం మీద ఉంచాడు. ఆ వీర్య ప్రభావంతో కొండ బంగారంగా మారిపోయింది.

తరువాత విశ్వకర్మ వచ్చి ఆ బంగారంతో మునులు యజ్ఞం చేసే యజ్ఞవాటికనంతా బంగారు మయంచేసాడు. కొన్నిరోజుల తరువాత పురూరవుడు వేట కోసం అడవికి వచ్చి తిరిగి వెళ్ళేటప్పుడు దారిలో వున్న ఆ యజ్ఞ వాటిక దగ్గరకు వచ్చాడు. దాన్ని చూసి ఎంతో ఆశ్చర్యపడ్డాడు. అంతా బంగారుమయం. పురూరవుడికి వివేకం నశించింది. లోభంతో ఆ యజ్ఞ వాటికని ధ్వంసం చేసి ఆ బంగారాన్ని తరలించబోయాడు. అది చూసి నైమిశమునులకు ఎంతో ఆగ్రహం కలిగింది. వెంటనే తమ దగ్గరున్న కుశ వజ్రాలతో పురూరవుణ్ణి కొట్టటం ప్రారంభించారు. అంత మంది మునులు ఒక్కసారిగా దాడి చేయటంతో తట్టుకోలేక పురూరవుడు మరణించాడు.

ఈ విషయం పురూరవుడికి ఊర్వశికి జన్మించిన పుత్రులకి తెలిసింది. వెంటనే వారంతా దండెత్తి యజ్ఞవాటికలో వున్న మునులతో యుద్ధం చేసారు. కొంతకాలానికి వివాదం సద్దుమణిగింది. తిరిగి బ్రహ్మ విదులైన మునులు సత్రయాగాన్ని కొనసాగించారు. యాగం నిర్విఘ్నంగా కొనసాగింది.

## హిరణ్యగర్భుడి ఉత్పత్తి

శ్రేష్ఠమైన భూతసృష్టికి దానికి కారణమైన అవ్యక్తమైనది, నిత్యమైనది, సత్, అసత్ స్వరూపంగా వుండేది ప్రకృతి. ఆ ప్రకృతికి రూపరస గంధాలు లేవు. శబ్ద, స్పర్శ ఉండదు. అదే ఈ జగత్తుకి కారణమైన మహద్యోని. దానినే పరబ్రహ్మం అంటారు. అది సనాతనమైనది. ఆ ప్రకృతి సర్వభూతాల స్వరూపమైపోయి అవ్యక్తంగా వుంది. దానికి ఆది అంతాలు లేవు. పుట్టుక అసలే లేదు. పరమ సూక్ష్మమైనది ఆ ప్రకృతి.

ప్రకృతి నుంచే సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు పుట్టాయి. అవి ఎప్పుడూ వుంటాయి. సత్ అసత్ పరమైనది బ్రహ్మం. ఆ పరబ్రహ్మ ఆత్మతోనే సమస్తమూ వ్యాపించివున్నది. ఆ పరబ్రహ్మ సృష్టిని చేయాలని తలుచుకున్నప్పుడు మొత్తం చీకటిగా ఏ మాత్రం సగుణరూపాన్ని పొంది మహత్తత్వంగా మారింది. ప్రకాశవంతమైన ఆ మహత్తత్వం నుంచి మనసు

దానినుంచి ముందుగా ఓంకారం పుట్టాయి. ఆ మహత్తత్వం నుంచే ప్రజ్ఞ, సంధి వంటివి పుట్టాయి. ఆపర బ్రహ్మ సర్వ భూతాలనీ రక్షించే వాడుగా వుంటాడు. అంతే కాదు ఇష్ట ఫలాల్ని ప్రసాదించేవాడుగా, భోక్తగా, విభక్తాత్మగా, ప్రవర్తకుడుగా, మనస్సుగా వుంటాడు. అన్నిటికీ ఆశ్రయుడై వుండటం వల్ల మహతత్త్వమే పరబ్రహ్మగా కీర్తించబడతాడు.

సకలభూతాలకూ ఆదికర్మ బ్రహ్మ. పురుషుల్లో ఆయనే మొదటివాడు. ఆయన హిరణ్యమయమైన అండం నుంచి చతుర్ముఖ బ్రహ్మగా జన్మించాడు. అందుకే ఆయన్ని హిరణ్యగర్భుడు అని అంటారు. ఆ హిరణ్యగర్భుడు. అసమానప్రజ్ఞావంతుడు అని గ్రహించాలి. సప్తలోకాలు, భూమి, సప్తద్వీపాలు, సప్తసముద్రాలు మహాపర్వతాలు, సహస్రాదిక నదులు, అథోలోకాలు, ఆకాశం, నక్షత్రాలు, గ్రహాలు, వాయువులు, సూర్యచంద్రులు వంటివి ఈ లోకంలో ఏవేవి ఉన్నాయో అవన్నీ ఆ హిరణ్మయ అండంలో వున్నాయి. అక్కడ జలం పదింతలు ఎక్కువగా ప్రకాశిస్తూ వాయువుచేత ఆ వాయువు చేత తేజస్సు దానికన్నా పదిరెట్లు ఎక్కువగా ఆకాశంచేతా ఆ ఆకాశం మొత్తం తిరిగి సర్వభూతాలతో కూడుకొనివుంది. ఏడు రకాల ప్రాకృత ఆవరణలతో ఆ హిరణ్మయ (బంగారు) అండం ఆవరించబడివుంది. అవ్యక్తం అంటే క్షేత్రం అని అర్థం. బ్రహ్మ క్షేత్రజ్ఞుడు ఈ ప్రాకృతమైన సృష్టిమొత్తం క్షేత్రవిదుడైన బ్రహ్మ చేయాల్సిన కార్యం. ఇదే హిరణ్యగర్భుడి వృత్తాంతం. ఈ వృత్తాంతం గురించి తెలుసుకున్నవాడు దీర్ఘాయువుని, కీర్తిని పొందుతాడు. మేధావి అవుతాడు.

## ప్రపంచ సృష్టి

పూర్వం భూమండలమంతా నీటితో నిండి వుండేది. అప్పుడు వాయువు చాలా ప్రశాంతంగా ఉనికి లేనట్టుగా వుంది. ఇప్పుడు కనిపించే ప్రపంచమంతా ఆనాడు నీటిలో లీనమైపోయింది. సర్వం నశించింది. ఏమీ తెలియని స్థితి. స్థావరజంగమాలు ఏవీ కనిపించటం లేదు. ఆ నిశ్శబ్ద నీరవంలో సహస్రాక్షుడు, సహస్రబాహుడు, అతీంద్రియుడు, నారాయణుడు అనే పేరుగల పరబ్రహ్మ

ఆ నీటి మీద హాయిగా నిద్రిస్తున్నాడు. క్రమంగా ఆయన ఈ సర్వం శూన్యమైపోయిందని గ్రహించాడు. నారాయణుడంటే –

ఆపోనారా ఇతిప్రోక్తా ఆపోవైవర సూనవః ।

ఆయనం తస్య తాః ప్రోక్తా స్తేన నారాయణ స్మృతః॥ *(శ్లో॥5, అధ్యా-4)*

ఆపస్సులు అనగా నీళ్ళు, నీళ్ళకి నారములు అనిపేరు. ఆ నీరములే తన నివాసంగా చేసుకున్నాడు. కాబట్టి ఆయనకు నారాయణుడు అన్నపేరు వచ్చింది.

ఒక వెయ్యి యుగాల పాటు స్వచ్ఛమైన కమల పత్రతల్పం మీద నారాయణుడు నిద్రించాడు. నీళ్ళలో అలా నిద్రపోతున్న నారాయణుడు రాత్రిపూట వెలుగుతున్న మిణుగురుపురుగులా వున్నాడు. కొంతకాలానికి ఆయనకు ఆ నీళ్ళ క్రింద భూమి ఉన్నది అని అనిపించింది. దాన్ని ఎలాగైనా పైకి ఉద్ధరించాలనుకున్నాడు. అదీ పూర్వకల్పంలో భూమి ఎలా వుండేదో అలానే పైకి తేవాలని ఆయనకు అనిపించింది. వెంటనే ఆయన తనలో "నేను ఏ రూపాన్ని ధరించి ఈ భూమిని పైకి తీసుకురావాలి" అని ఆలోచించాడు. వెంటనే ఆయనకొక రూపం స్ఫురించింది.

పదియోజనాల విస్తీర్ణం, వందయోజనాల పొడవుతో నల్లనిమేఘం లాంటిది, మేఘ గర్జనలాంటి భయంకరమైన ధ్వని చేసేది, మహా పర్వతం లాంటి శరీరం కలిగినది, తెల్లగా, తీవ్రంగా, ఉగ్రంగా తేజోవంతంగా బలిసివున్నది, గుండ్రని స్కంధాలతో, విష్ణువులా విక్రమాన్ని కలిగివున్నది, ఉన్నతమైన కటిభాగం కలిగినది, తీక్షణమైన కోరలు కలిగింది, విద్యుత్తుతో, సూర్యుడి తేజస్సుతో సమానమైనది, నీటిలో సంచరించేది అయిన ఆది వరాహరూపాన్ని నారాయణుడు స్మరించాడు. వెంటనే ఆయన వరాహ రూపాన్ని పొందాడు.

వరాహరూపాన్ని ధరించిన నారాయణుడు భూమిని ఉద్ధరించాలని రసాతలలోకంలోకి ప్రవేశించాడు. భూమి పూర్తిగా కనిపించలేదు. పైకి లేచి యజ్ఞవరాహ రూపాన్ని ధరించి తిరిగి నీటిలోకి ప్రవేశించాడు. ఆయనకి లోపల అగ్నితో ఆచ్ఛాదించబడ్డ భూమి కనిపించింది. వెంటనే సముద్రాల అడుగున

వున్న భూమిని అక్కడే వుంచి, అలాగే నదుల అడుగున ఉన్న భూమిని కూడా అదే స్థానంలో వుంచి మిగిలిన భూమిని పైకి తెచ్చాడు. తరువాత ఆ భూమిమీద పర్వతాల్ని వృద్ధిచేసాడు. తరువాత క్రమంగా సప్తద్వీపాత్మక మైన పృథివిని, భూర్భువస్సువరాది నాలుగులోకాలనూ కల్పించాడు. ఆ విధంగా అన్నిలోకాల్నీ సృష్టించిన తరువాత ప్రజాసముదాయాన్ని సృష్టించటం ప్రారంభించాడు. పూర్వకల్పాలలో భూమండలమంతా ఏ విధంగా వుందో అదే విధంగా పునఃసృష్టి చేసాడు.

## మహాదేవుడి వైభవం

చతుర్ముఖ బ్రహ్మ కల్పం ప్రారంభంలో తనతో సమానమైన పుత్రుణ్ణి పొందాలని తీవ్రంగా ధ్యానం చేసాడు. కొద్ది సేపటికి ఆయన తొడ మీద, నీలలోహితుడైన ఒక కుమారుడు ఆవిర్భవించాడు. ఆ పిల్లవాడు సుస్వరంలో ఘోరంగా ఏడవటం ప్రారంభించాడు. ఆ బాలుడు ఎంతో దివ్యతేజస్సుతో వెలిగి పోతూ ప్రపంచాన్ని దహించేలా వున్నాడు. బ్రహ్మదేవుడు ఆ పిల్లవాడి ఏడుపు విని "కుమారా! ఎందుకు ఏడుస్తున్నావు? అని అడిగాడు. "తండ్రీ! ముందు నాకు ఒక పేరు పెట్టు. తరువాత ఎందుకు ఏడుస్తున్నానో చెప్తాను అన్నాడా బాలుడు. "కుమారా! నీకు 'రుద్రుడు' అనేపేరు పెట్టాను' అన్నాడు బ్రహ్మ. అది విని తిరిగి ఏడవటం ప్రారంభించాడు బాలుడు.'నాయనా! ఎందుకు నీవు మళ్ళీ ఏడుస్తున్నావు' అన్నాడు బ్రహ్మ. తండ్రీ నాకు ఇంకో పేరుపెట్టు అన్నాడు బాలుడు. సరే నీపేరు 'భవుడు' అని పేరు పెడుతున్నా అన్నాడు. తిరిగి మూడో సారి ఏడుపు మొదలెట్టాడు బాలుడు.

బ్రహ్మ అనునయంగా పుత్రా! ఎందుకయ్యా రోదిస్తున్నావు అన్నాడు. నాన్నా! నాకు మూడో పేరు పెట్టు అన్నాడు బాలుడు. సరే సరే! నీకు 'శర్వుడు' అనే పేరు పెడుతున్నా ఏడవకు అని సముదాయించాడు బ్రహ్మ. అలా 'ఆ బాలుడు ఏడుస్తూ ఇంకా కొత్త పేర్లని పెట్టమని అడగసాగాడు. బ్రహ్మదేవుడు ఏ మాత్రం విసుగు చెందకుండా తన పుత్రుడైన నీలలోహితుడికి – 1.రుద్రుడు 2.భవుడు 3.శర్వుడు అనే పేర్లతోపాటు వరుసగా 4.ఈశానుడు 5.పశుపతి

6.భీముడు 7.ఉగ్రుడు 8.మహాదేవుడు అనే పేర్లు పెట్టాడు. ఇలా ఎనిమిది పేర్లు పెట్టిన తరువాత ఆ బాలుడు ఏడుపు ఆపేశాడు.

ఎనిమిది పేర్లు పొందిన ఆ నీలలోహితుడు బ్రహ్మతో " తండ్రీ నాకు పెట్టిన పేర్లకి తగిన స్థానాల్ని నిర్దేశించు" అని కోరాడు. అప్పుడు బ్రహ్మదేవుడు 1.సూర్యుడు 2.జలం 3.భూమి 4.వాయువు 5.అగ్ని 6.ఆకాశం 7.విప్రుడు 8.చంద్రుడు అనే ఎనిమిది రకాల శరీరాలని స్థానాలుగా నిర్దేశించాడు.

**1. రుద్రుడు-సూర్యుడు :** బ్రహ్మ తిరిగి తన కుమారుడితో పుత్రా! నీకు మొదట రుద్రుడు అనే పేరు పెట్టాను కనుక నీ రుద్రనామానికి సూర్యుడు మొదటి శరీరం అని చెప్పాడు. వెంటనే రుద్రుడి శరీరం నుంచి ఒక కాంతిపుంజం ప్రకాశవంతమైన దివ్య నేత్రంగా మారింది. ఆ నేత్రం సరాసరి వెళ్ళి సూర్యుడిలో చేరింది. అందుకే సూర్యుణ్ణి రుద్రాంశస్వరూపుడు అని అంటారు. ఎవ్వరూ కూడా ఉదయిస్తున్న, అస్తమిస్తున్న సూర్యుణ్ణి తదేకంగా చూడకూడదు. ఎందుకంటే ఆయన తరుచుగా ఉదయిస్తాడు. అలాగే తరుచుగా అస్తమిస్తాడు. కనుక దీర్ఘాయువు కావాలనుకునేవాడు సూర్యుణ్ణి ఆ సమయంలో చూడరాదు. నిజం చెప్పాలంటే సూర్యుడికి ఉదయం అస్తమయం రెండూ లేవు. మహాభారతంలో కూడా సూర్యుడు ఉదయిస్తున్నప్పుడు, అస్తమిస్తున్నప్పుడు చూడకూడదని వుంది. సూర్యుడికి (రుద్రాంశ స్వరూపుడు కాబట్టి) ఎదురుగా మలమూత్ర విసర్జన ఎప్పుడూ చేయకూడదు. ఇలా ధర్మాన్ని ఆచరించిన వాడిని రుద్రుడు ఎప్పుడూ హింసించడు.

**2. భవుడు-జలం :** తరువాత బ్రహ్మదేవుడు నీలలోహితుడితో కుమారా! నీకు 'భవుడు' అని రెండో పేరు పెట్టాను. కనుక నీకు ఈ పేరుతో వున్నప్పుడు జలం శరీరంగా వుంటుంది అన్నాడు. అలా అన్న వెంటనే జలప్రకృతి అతడి శరీరంలోకి ప్రవేశించింది. భవుడిలో జలం ప్రవేశించటంతో ఆనాటినుంచి జలం భవస్వరూపంగా గుర్తించబడింది. సర్వ భూతాలూ అతడి వల్లనే పుట్టటం వల్ల, ఆ భూతాల చేతనే అతడు భావించబడటం వల్ల ఆయన 'భవుడు' అని పిలవబడ్డాడు.

జలం రుద్రాంశ స్వరూపం కాబట్టి ఎవడూ నీటిలో మల మూత్ర విసర్జన చేయకూడదు. నీళ్ళలో ఉమ్ము వేయకూడదు. వస్త్రాలు లేకుండా స్నానం చేయకూడదు. నీళ్ళలో మైథునం చేయకూడదు. ప్రవహించని, ఒకచోట నిలువ వుండని నీటని పరిరక్షించకూడదు. నీళ్ళని నిందించకూడదు. జలశరీరాన్ని మునులు పవిత్రమైనది, అపవిత్రమైనది అని రెండు విధాలుగా పేర్కొన్నారు. రుచిలేని నీళ్ళని, చెడ్డవాసన వస్తున్న నీటిని, రంగుతో వున్న నీళ్ళని అన్ని అవసరాలలో విడిచిపెట్టాలి. నీటికి జన్మస్థానం సముద్రం. అందుకే భూమిమీద ప్రవహించే నీరంతా సముద్రాన్ని చేరుతుంది. అలా సముద్రాన్ని చేరే నీళ్ళు పవిత్రాలు అవుతాయి. అందుకే ప్రవహించేనీటికి ఎవరూ అడ్డుకట్ట వేయకూడదు. ఈ విధంగా ఎవరు నీటిని గౌరవించి, ఆదరిస్తారో వారిని 'భవుడు' హింసించడు.

**3. శర్వుడు–భూమి :** తరువాత బ్రహ్మ తన పుత్రుడితో నాయనా! నీలలోహితా! నీకు 'శర్వుడు' అని మూడో పేరుపెట్టాను.అందువల్ల నీకు భూమి భౌతిక శరీరం అవుతుంది అన్నాడు. అలా అన్న వెంటనే శర్వుడి (నీలలోహితుడి) శరీరం నుంచి స్థిరమైన ఎముక ఒకటి వచ్చి భూమిలో ప్రవేశించింది. అందుకే ఆనాటి నుంచి భూమికి 'శర్వము' అనే పేరు వచ్చింది. భూమి కూడా శర్వాంశతో నిండింది కాబట్టి దున్నిన నేలలో ఎవడూ మలమూత్ర విసర్జన చేయరాదు. అంతేకాదు నడిచేదారిలో, చెట్ల నీడల్లో, తన నీడ పడేచోట మూత్రవిసర్జన చేయకూడదు. నేలమీద గడ్డి పరిచి తన తలని గుడ్డతో చుట్టుకుని మలవిసర్జన చేయాలి. భూమిని ఈ విధంగా శివస్వరూపంగా భావించి గౌరవించేవాడిని శర్వుడు ఎప్పుడూ బాధించాడు.

**4. ఈశానుడు–వాయువు :** బ్రహ్మ నీలలోహితుడితో కుమారా! ఏడుస్తున్న నీకు ఈశానుడు అని నాలుగో పేరు పెట్టాను. నీ నాలుగో నామానికి వాయువు శరీరంగా వుంటాడు అని అన్నాడు. వెంటనే నీలలోహితుడి శరీరంలో ఐదు విధాలుగా వున్న ప్రాణం అనేది వాయువులో ప్రవేశించింది. ఆనాటి నుంచి వాయువు ఈశానుడుగా కీర్తించబడ్డాడు. వాయువుకూడా ఈశానాంశతో నిండినవాడు కనుక ఆయన్ని నిందించకూడదు. గాలికి ఎదురు తిరగరాదు.

వాయువు ప్రబలంగా వీచే గుణం కలిగినవాడు కనుక వాయువుని గౌరవించి, వాయువు ఎడల సవ్యంగా ప్రవర్తించి, యజ్ఞాలు ఆచరించే వాడిని ఈశానుడు ఎప్పుడూ బాధపెట్టడు.

**5. పశుపతి–అగ్ని :** బ్రహ్మదేవుడు నీలలోహితుడి దగ్గరకు వచ్చి నాయనా! నీలలోహితా నీ కోరిక ప్రకారం నీకు 'పశుపతి' అని అయిదో పేరు పెట్టాను. పశుపతివైన నీకు అగ్ని అయిదో శరీరంగా వుంటాడు అని పలికాడు. వెంటనే శరీరంలో వుండే అగ్నిలా ప్రజ్వరిల్లు తేజస్సు 'ఉష్ణం' (వేడి) అనే పేరుతో పశుపతి (నీలలోహితుడి) శరీరంలోకి ప్రవేశించింది. అగ్నిని పశువు అంటారు. ఆ పశువు భరించేవాడు కనుక పశుపతి అయ్యాడు. పశుపతి శరీరం అగ్ని ప్రవేశించటంతో అగ్నిమయమైంది. అగ్ని కూడా పశుపతి రూపమే కనుక అమేధ్యమైన (మలాదులు) పదార్థాలను అగ్నితో దహించకూడదు. ఎవ్వరూ అగ్నితో అరికాళ్ళను కాచుకోరాదు. అగ్నిని నేలమీద ఉంచకూడదు. అగ్నిని దాటకూడదు. ఈ విధంగా అగ్నిని గౌరవించినవాడిని పశుపతి భాదలు పెట్టడు.

**6. భీముడు–ఆకాశం :** నీలలోహితుడితో బ్రహ్మదేవుడు సుపుత్రా! నీకు ఆరో పేరుగా 'భీముడు' అని నామకరణ చేసాను. భీముడిగా వున్న నీకు ఆకాశం శరీరాన్ని ఇచ్చాను అని అన్నాడు. వెంటనే ఆకాశం నీలలోహితుడి (భీముడి) శరీరంలోకి ప్రవేశించింది. అందుకే ఆనాటినుంచి శివుడు (భీముడు) ఆకాశంలో ఉంటాడు అని స్మరిస్తున్నారు. ఆకాశంలో శివుడుంటాడు కాబట్టి పైన ఆచ్ఛాదన లేకుండా మల మూత్రాలను బైట పారవేయకూడదు. పైన ఆచ్ఛాదన లేకుండా అన్నం తినకూడదు. నీరు త్రాగకూడదు. మైథునం చేయకూడదు. ఎంగిలిని కూడా ఆచ్ఛాదన లేకుండా బైట పారవేయకూడదు. ఈ విధంగా ఆకాశాన్ని శివస్వరూపంగా భావించి గౌరవించేవాడిని భీముడు (ఈశ్వరుడు)హింసించడు.

**7. ఉగ్రుడు–బ్రాహ్మణుడు :** చతుర్ముఖ బ్రహ్మ నీలలోహితుడితో నాయనా! నీవు ఏడుస్తున్నప్పుడు నీ కోరిక తీర్చి నీతో ఏడుపు ఆపించాలని, నీకు 'ఉగ్రుడు' అని ఏడో పేరు పెట్టాను. ఉగ్రుడివైన నీకు దీక్షితుడైన బ్రాహ్మణుడు శరీరంగా వుంటాడు అని పలికాడు. వెంటనే నీలలోహితుడి (ఉగ్రుడు) శరీరంలో

వున్న దివ్యచైతన్యం దీక్షితుడైన (యజ్ఞయాగాలుచేసే) బ్రాహ్మణుడి శరీరంలోకి ప్రవేశించింది. శివుడి అంశ (ఉగ్రుడి) దీక్షితుడైన బ్రాహ్మణుడి శరీరంలో ప్రవేశించటంతో ఆ విప్రుడు ఉగ్రుడితో (శివుడితో) సమానుడు. కనుక అతన్ని ఎవరూ నిందించకూడదు. ఎదురు తిరగకూడదు. దూషించకూడదు. ఎవరైతే దీక్షితుణ్ణి నిందిస్తారో వారు పాపాన్ని పొందుతారు. విప్రుణ్ణి శివస్వరూపంగా భావించి గౌరవించిన వాడిని ఉగ్రుడైన శివుడు ఎప్పటికీ బాధలు పెట్టడు.

**8. మహాదేవుడు-చంద్రుడు :** నీలలోహితుడితో చతుర్ముఖ బ్రహ్మ ఇలా అన్నాడు "కుమారా! నీవు ఏడుపు ఎంతకీ ఆపటంలేదు. కారణం అడిగితే ఎనిమిదో పేరుపెట్టమన్నావు. అందుకే నీకు 'మహాదేవుడు' అని పేరు పెట్టాను. ఈ పేరుతో వున్న నీకు చంద్రుడు భౌతికమైన శరీరం అవుతాడు" అని చెప్పాడు. వెంటనే సంకల్పధ్యానంతో వున్న నీలలోహితుడి మనసు చంద్రుడిలో ప్రవేశించింది. ఆ కారణంగా మహాదేవుడు చంద్రుడుగా భావించబడుతున్నాడు. చంద్రుడిలో ప్రవేశించినందువల్లే మహాదేవుణ్ణి 'శశి' అని కూడా వ్యవహరిస్తారు. సోముడు (చంద్రుడు) శివాంశ స్వరూపుడు కనుక అమావాస్యరోజు బ్రహ్మణుడిని, వృక్షాన్ని, పొదని, ఓషధుల్ని, పూలచెట్లని కొట్టకూడదు. వాటిని ఛేదించకూడదు అమావాస్య, పౌర్ణమి తిథుల్లో మహాదేవుడు నివాసముండే వృక్షాల్ని, ఓషధుల్ని ఎవడు ఛేదించకుండా వుంటాడో వారిని మహాదేవుడు ఛేదించడు.

సూర్యచంద్రులు ఇద్దరూ సన్నిహితంగా ఒక్క అమావాస్యరోజున కలిసివుంటారు. సూర్యుడు పగటిపూట ప్రజల్ని రక్షిస్తే చంద్రుడు రాత్రిపూట ప్రజల్ని రక్షిస్తాడు. అమావాస్య రాత్రి ఎంతో ప్రశస్తమైనది. ఆ రాత్రిలో యోగక్రియాచరణ చేయాలి. ఈ దృశ్యమానప్రపంచం అంతా రుద్రుడు వ్యాపించి వుంటాడు. ఒంటరిగా సంచరించే సూర్యుణ్ణి రుద్రుడు అంటారు. సూర్యుడు ప్రకాశిస్తేనే ప్రజలు తమ కళ్ళతో వస్తువుల్ని చూడగలరు. సూర్యుడు తన కిరణాలతో నీటిని త్రాగుతాడు. ఈ శరీరం అన్నం తినాలనే కోరికతో అన్నం తింటోంది. నీరు త్రాగాలనే కోరికతో నీళ్ళు తాగుతోంది. నీరు ఈ శరీరాన్ని పోషించి వృద్ధి చేస్తోంది.

భూమిగా వున్న పరమేశ్వరుడి శరీరం కూడా పంటల ద్వారా ప్రజల్ని పోషిస్తోంది. అందుకే అదీ పవిత్రమైనదే. స్థిరమైన తేజస్సుతో శివుడు ప్రజల్ని భరిస్తున్నాడు. పార్థివమైన ఈశానుడి శరీరం అనగా వాయువు సకల భూతాలకీ ప్రాణాధారం. ఆ విధంగా శివుడి పార్థివశరీరం అన్ని భూతాల్నీ జీవింపచేస్తోంది. పశుపతి శరీరం అనగా అగ్ని. మానవుడు తిన్న ఆహారాన్ని, త్రాగిన పానీయాల్ని కడుపులో ఉండి, పచనం చేస్తోంది, జీర్ణం చేస్తుంది.

## నీలలోహితుడి శరీర నియమం - భార్య - సంతానం

**1. రౌద్రి :** బ్రహ్మదేవుడికి ప్రియపుత్రుడుగా జన్మించిన రుద్రుడి ప్రథమ శరీరం 'రౌద్రి' అనే పేరుతో ప్రసిద్ధమయ్యింది. ఆ రౌద్రికి భార్య సువర్చల. ఆమె కుమారుడు శనైశ్చరుడు.

**2. ఆపః :** భవుడి రెండో శరీరం 'నీరు' అని వ్యవహరించబడుతుంది. ఆ నీటికి (ఆపః) భార్య ధాత్రి. ఆమె కుమారుడు ఉశనుడు అనగా శుక్రుడు.

**3. భూమి :** శర్వుడి మూడో శరీరం పేరు భూమి. ఆ భూమికి 'వికేశి' అనే ఆమె భార్య. ఆమె పుత్రుడే అంగారకుడు (కుజుడు).

**4. వాతం :** ఈనానుడి నాలుగో శరీరం పేరు వాతం అనగా వాయువు. అతని భార్య పేరు 'శివా', ఆమెకి 1.మనోజవుడు 2.అవిజ్ఞాతగతి అని ఇద్దరు కుమారులు. మనోజవుడు అంటే! మనసుతో సమానమైన వేగంతో వెళ్ళేవాడు. అవిజ్ఞాతగతి అంటే! తెలియని గమనం కలవాడు అని అర్థం.

**5. అగ్ని :** పశుపతి అయిదో శరీరం పేరు అగ్ని. ఆ అగ్నికి స్వాహాదేవి భార్య. ఆమెకి సందుడు అనే కుమారుడు జన్మించాడు.

**6. ఆకాశం :** భీముడికి ఆరో శరీరం పేరు ఆకాశం. దిక్కులు ఆకాశానికి భార్య. ఆమెకి కుమారుడు స్వర్గం.

**7. దీక్షిత బ్రాహ్మణుడు :** ఉగ్రుడికి ఏడో శరీరం దీక్షితుడైన బ్రాహ్మణుడు. ఆ బ్రాహ్మణుడికి భార్య దీక్ష. ఆమెకి సంతానుడు అనేవాడు పుత్రుడు.

**8. చంద్రుడు :** మహాదేవుడి ఎనిమిదో శరీరం పేరు చంద్రుడు. ఆ చంద్రుడికి భార్య రోహిణి. ఆమె పుత్రుడు బుధుడు.

ఈ విధంగా నీలలోహితుడి ఎనిమిది శరీరాలు ఎనిమిది నామాలతో విఖ్యాతి చెందాయి. ఈశ్వరుడు ఆయా శరీరాలతో ఆయానామాలతో నమస్కరించబడాలి. సూర్యుడిలోని దేవతలు, జలం, భూమి, వాయువు, అగ్ని, ఆకాశం, యజమాని(దీక్షితుడు) తమ తమ పేర్లతో ఈశ్వరుడికి నమస్కరించాలి. ఆయన్ని భక్తిగా సేవించాలి. ఎవరు పరమేశ్వరుడి ఎనిమిది నామాలని వాటి విశేషాలని, ఆయన శరీరాలని గురించి తెలుసుకుంటాడో అతడు శివుడి సాయుజ్యాన్ని పొందుతాడు.

## అగ్నివంశం

అగ్నిదేవుడికి స్వాహాదేవి భార్య. ఆమె ద్వారా అగ్నికి ముగ్గురు పుత్రులు జన్మించారు. 1.పవమానుడు (గార్హపత్యాగ్ని) 2.పావకుడు 3.శుచి అనేవారు. వీటిలో పవమానం అనే అగ్ని ఆరణిని మథించటం వల్ల ఆవిర్భవించింది. రెండోదైన పావకాగ్ని విద్యుత్తు నుంచి ఉత్పన్నమైంది. మూడోదైన శుచి సూర్యుడి నుంచి వచ్చిన అగ్ని. ఈ అగ్ననే సౌరాగ్ని అంటారు. వీటన్నిటికీ 'అగ్నిచయనం' అని పేరు. వీరిలో పవమానుడి కుమారుడు అవ్యవాహనుడు. పావకుడి కుమారుడు సహరక్షుడు. 'శుచి' కుమారుడు హవ్యవాహనుడు. వీరిలో హవ్యవాహనుడు 'దేవతాగ్ని' కాగా, పవమానుడి కుమారుడైన అవ్యవాహనుడు పితృదేవతలకి సంబంధించిన అగ్నిగా ఖ్యాతి పొందాడు. ఇక పావకుడి కుమారుడైన సహరక్షకుడు అసురుల అగ్నిగా ప్రసిద్ధిచెందాడు. ఈ ముగ్గురి కుమారులు, మనుమలు అందరూ కలిసి మొత్తం నలభై తొమ్మిదిమంది ఉన్నారు.

బ్రహ్మకి మొదటిపుత్రుడు లౌకికాగ్ని. బ్రహ్మదత్తాగ్నికి పుత్రుడు వైశ్వానరుడు. ఆ వైశ్వానరుడు వందసంవత్సరాల పాటు హవ్యాన్ని (అగ్నిని) వహించాడు. బ్రహ్మపుత్రుడైన లౌకికాగ్ననే అధర్వణాగ్ని అనికూడా అంటారు. అధర్వణాగ్నికి ఒక కుమారుడున్నాడు. అతడి పేరు దర్భహుడు. అధ్వర్యుడి వల్ల భృగుడు అనేవాడు ఉదయించాడు. ఇంకా ఈ అగ్నివంశంలో శంస్యుడు,

శుకుడు అపసవ్యుడు, సవ్యుడు, విభుడు, ప్రవహణుడు అగ్నీధ్రుడు వంటి ధిష్ణులు (ఆహితాగ్నులు) వంటివారు జన్మించారు.

బ్రాహ్మణులు ఎనిమిది రకాల అగ్నుల్ని పూజిస్తారు. 1.సమ్రాడగ్ని 2.కృశానుడు 3.పరిషత్వవమార అగ్ని 4.ప్రతల్కాగ్ని (నభోగ్ని) 5. ఋతుధామాగ్ని 6. అజైకపాదాగ్ని 7.అహిర్బుధ్న్యాగ్ని 8.విహరణీయాగ్ని–అనేవారు అష్ట అగ్నులుగా విఖ్యాతి చెందారు. ఈ విధంగా అగ్ని వంశంలో వంశపరంపరగా వివిధరకాల అగ్నులు ఉదయించారు.

## కాలసద్భావ వర్ణన

స్వాయంభువ మన్వంతరకాలంలో బ్రహ్మ సృష్టి చేస్తుండగా, ఆయన శరీరం నుంచి ఇంద్రియాలు, ఇంద్రియాల నుంచీ మానవులు, దేవతలు, అసురులు ఉద్భవించారు. పితృదేవతలు కూడా ఆయన్నించే ఆవిర్భవించారు. పితృ దేవతలు కూడా ఆయన్నుంచే ఆవిర్భవించారు. బ్రహ్మ తన శరీరం నుంచి ఆవిర్భవించిన దేవతల్ని, మనుషుల్ని, అసురుల్ని చూసి ఎంతో గర్వించాడు. వీరినే కాక మరోక విధమైన సృష్టిని కూడా చేయాలని ఆయన తలచాడు. వెంటనే పక్క భాగం నుంచి పితృదేవతలు ఉదయించారు. మరోప్రక్కనుంచి వసంతం మొదలైన ఆరు ఋతువులు కూడా ఆవిర్భవించాయి. ఈ ఋతువుల్ని పితరులు అంటారు. 'ఋతవఃపితరో దేవాః' అని వేదసూక్తం చెబుతుంది. గడిచిన మన్వంతరాలలో, రాబోయే మన్వంతరాలలో కూడా ఇదే విధానం పునరావృతమైంది. స్వాయంభువ మన్వంతరంలో పితరులు 1.అగ్నిష్వాత్తులు, బర్హిషదులు అనే పేర్లతో స్మరించబడ్డారు. వారిలో గృహస్థులు కానివారు యజ్ఞయాగాలు ఆచరించనివారు అగ్నిష్వాత్తులకి సంబంధించిన పితరులుగా చెప్పబడ్డారు. నిత్యం నియమ పూర్వకంగా అగ్నిహోత్రాన్ని ఆచరించినవారు బర్హిషదులుగా పరిగణించబడ్డారు. ఇదే విషయం వేదాల్లో ఋతువులు–పితరులు–దేవతలు అని స్పష్టంగా చెప్పబడింది.

మాసాలలో చైత్రవైశాఖ మాసాలను 'మధు–మాధవ' మాసాలంటారు. వీటిని రసములు అని గ్రహించాలి. జ్యేష్ఠ ఆషాఢమాసాలను 'శుచి–శుక్ర'

మాసాలంటారు. వీటిని శుష్మినులుగా భావించాలి. శ్రావణ భాద్రపదమాసాలను 'నభ–నభస్యలు' అంటారు. వీటిని జీములు అని గ్రహించాలి. అలాగే ఆశ్వయుజకార్తీకమాసాలను ఇష–ఊర్జమాసాలంటారు. వీటిని 'స్వధావంతాలు' అని భావించాలి. మార్గశిర పుష్యమాసాలను సహ–సహస్యమాసాలంటారు. వీటిని 'ఘోరములు' అని గ్రహించాలి. మాఘ ఫాల్గుణ మాసాలను తపస్–తపస్య మాసాలంటారు. వీటిని మనుష్యమంతాలు అని అంటారు.

ఈ విధంగా కాలగణన సూచకాలైన మాసాలు ఋతువుల్లో భాగాలుగా చెప్పబడ్డాయి. ఈ ఋతువులు కూడా బ్రహ్మకి పుత్రులు. ఇవి చేతనాచేతనమైన వస్తువులతో తాదాత్మ్యం చెందుతుంటాయని గ్రహించాలి. పగలు, రాత్రి, మాసాలు, ఋతువులు, ఆయనాలు, సంవత్సరాలు ఇవన్నీ స్థానాలు. తిథులు, సంధ్యలు, పక్షాలు. రెండు అర్ధమాసాలు. ఒకమాసం. రెండు మాసాలు ఒక ఋతువు. మూడు ఋతువులు ఒక ఆయనం. రెండు ఆయనాలు ఒక సంవత్సరం అవుతుంది. ఇవన్నీ కాలగణనలో భాగాలు.

కాలానికి సూర్యుడు జన్మస్థానం. అనగా కాలం సూర్యుడి నుంచి పుట్టింది అని అర్థం. కాలం అనేది కనురెప్పపాటు వ్యవధిలో పుట్టింది. కాలానికి ఎన్నో కళ్ళున్నాయి. అందుకే అతన్ని సంఖ్యా చక్షువు అంటారు. రాత్రి పగలు అనేవి కాలానికి శరీరం, ఆకారం. నిముషాలు అతడి అవయవాలు, సంవత్సరం అతని తత్త్వం. ఆయన పేరు కళాత్మకుడు. ఆత్మ అతడి సంఖ్యాస్థానం. కాలమే ప్రజాపతి. భూత భవిష్యత్ వర్తమాన కాలాలు అతడి ప్రజలు. ఈ కాలం అవస్థ అయిదు విభాగాలుగా చెప్పబడింది.

కాలంలో రోజు, అర్ధమాసం (పక్షం), మాసం, ఋతువు ఆయనం – మొదటి సంవత్సరం. ఇవే విభాగాలతో కూడుకున్నది. రెండోది పరివత్సరం, మూడోది ఇద్వత్సరం, నాలుగోది అనువత్సరం, ఐదోది వత్సరం. ఈ అయిదు కాలాలు ఒక్కొక్కటి ఐదేసి సంవత్సరాలలో వ్యవధితో వుంటాయి. కాలానికే యుగం అని పేరు. ఇక్కడ చెప్పిన అయిదురకాల కాలాలు అనగా 1.సంవత్సరం

అనేది అగ్ని యుగంగా, 2.పరివత్సరం అనేది సూర్య యుగంగా 3.ఇద్వత్సరం అనేది చంద్ర దేవయుగంగా 4. అనువత్సరం అనేది వాయుదేవయుగంగా 5.వత్సరం అనేది రుద్ర దేవ యుగంగా చెప్పబడతాయి.

వీరితత్త్వాలు ఏ విధంగా వుంటాయంటే వీటిలో మొదటిదైన క్రతువు లేక అగ్నిగా చెప్పబడిందే సంవత్సరంగా పరిగణించబడింది. తరువాత సూర్యుడు కాలాగ్ని కలిసి పరివత్సరంగా ఏర్పడ్డాయి. నీటి సారమైన చంద్రుడు ఇడావత్సరంగా పరిగణించబడతాడు. ఈ చంద్రుడే 49 శరీరాలతో లోకాలన్నిటినీ పవిత్రంగా చేస్తాడు. లోకానికి అనుకూలంగా వీచే వాయువే అనువత్సరంగా వ్యవహరించబడుతోంది. తరువాత బ్రహ్మదేవుడి అహంకారం నుంచి పుట్టిన రుద్రుడు 'వత్సరం' అనే పేరుతో పిలవబడతాడు.

**1. సంవత్సరం-కాలాత్ముడు :** అగ్నిరూపుడైన కాలాత్ముడిని సంవత్సరం స్వరూపుడుగా గ్రహించాలి. ఎందుకంటే! ఆయనే కాలానికి ప్రభువు ఋక్, యజుర్, సామవేదాలకి జన్మస్థానం. ఆయనే దివసం, అర్ధమాసాది పంచ విభాగాలకూ అధిపతి. అతడే అగ్ని, యమ, కాల సంభూతి. అతడే ప్రజాపతి, అతడే సర్వయోని. అందుకే కాలాత్ముడిని సంవత్సరం అని పిలుస్తారు.

**2. పరివత్సరం-సూర్యుడు :** సూర్యుణ్ణి పరివత్సరంగా గ్రహించాలి. అతడే కాల విభాగమైన మాసాలకు, ఋతువులకు, ఉత్తర దక్షిణాయానాలకు, గ్రహాలకు, నక్షత్రాలకు, శీతోష్ణాలకు వర్షానికి, జన్మస్థానం. అంతేకాదు సూర్యుడు ప్రసన్నాత్ముడు, బ్రహ్మపుత్రుడు, ప్రజాపతి అతడు రోజు, మాసం. ఋతువులే కాదు పితామహుడు కూడా. ఆయనే ఆదిత్యుడు, సవిత, భానువు, జీవనుడు, అందరికీ ప్రభువు. అవ్యయుడు, భాస్కరుడు, అతన్నే పరివత్సరుడిగా భావించాలి.

**3. ఇడావత్సరం-చంద్రుడు :** సకల ఓషధులకు పతి అయిన చంద్రుణ్ణి ఇడావత్సరుడుగా గ్రహించాలి. చంద్రుడు సర్వ జీవులకూ జీవనాధారుడు. ఆయనే ఈశ్వరుడు. అప్రాప్తమైన వాటిని ప్రాప్తించేలా చేయటం ప్రాప్తించిన వాటిని రక్షించటం చేసేవాడు. ఆయన ఎప్పుడూ ఈ సమస్త విశ్వాన్నీ పర్యవేక్షిస్తూ

తన కిరణాలతో రక్షించి భరిస్తుంటాడు. చంద్రుడు, తిథులకు, పర్వాలకు, పర్వసంధులకు, పూర్ణిమలకు, అమావాస్యలకు కారకుడు. ఆయన రాత్రిని కలిగిస్తాడు. అందుకే ఆయన్ని నిశాకరుడు అంటారు. చంద్రుడు అమృతాత్ముడు ప్రజాపతి అంతేకాదు (చంద్రుడు) పితృదేవతాత్మకుడు కూడా.

**4. అనువత్సరం-వాయువు :** ప్రపంచంలోని ప్రాణులందరి జీవనానికి కారకుడైన వాయువుని అనువత్సరుడుగా మనం పరిగణించాలి. ఎందుకంటే సకల ప్రాణుల్లో ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అనే వాయువుల ద్వారా జరిగే కర్మలకి ప్రవర్తకుడు. పంచేంద్రియాలు యమం, మనసు, బుద్ధి, స్మృతి, బలం వంటి సమానకాల క్రియల్ని ఆయనే సంపాదిస్తాడు. అనగా భౌతికశరీర కార్యకలాపాలన్నీ వాయువు ద్వారానే జరుగుతాయి. ఆయన సర్వాత్ముడు. సర్వలోకేశుడు, వాయువు లోకానికి ఉపకరించే 49 మరుత్తుల ద్వారా ప్రవర్తిస్తుంటాడు. సర్వభూతాలకూ ఆయనే విధాత. సర్వభూతాలకూ క్షేమాన్ని చేకూర్చేవాడు కూడా వాయువే. నిత్యుడు, ప్రభంజనుడు, అతడే అగ్ని, భూమి, సూర్య చంద్రులకు, ప్రభవస్థానం. ఆయనే ప్రజాపతి. లోకాత్ముడు, ప్రపితామహుడు, రాత్రి పగళ్ళను కల్పించేవాడు. అందుకే ఆయన్ని అనువత్సరుడు అంటారు.

ఈ నలుగురు అనగా కాలం. సూర్యుడు, చంద్రుడు, వాయువు వీరంతా ప్రజాపతి అయిన బ్రహ్మ పార్శ్వం నుంచి ఆవిర్భవించారు. అన్ని లోకాలకూ వారే పితరులు. అందుకే వారిని లోకాత్ములుగా కీర్తిస్తారు.

**5. వత్సరం-రుద్రుడు :** బ్రహ్మదేవుడు కుమారుడైన రుద్రుడే వత్సరం అని చెప్పబడుతున్నాడు. కాలాత్ముడైన రుద్రుడు నిత్యలయకారకుడు. భగవంతుడైన రుద్రుడు తన దివ్య తేజస్సుతోనే జగత్తులోకి ప్రవేశించాడు. సూర్యుడు, చంద్రుడు, అగ్ని, వాయువు, అందరూ యుగం అనే కాలంతో అద్వైత భావాన్ని పొందారు. రుద్రుడు సర్వభూతాత్ముడు. సర్వాత్మకుడు. ఆయన క్షీణించిన ఓషధులను తిరిగి పునరుజ్జీవింప చేస్తాడు. ఎప్పుడైన ఓషధులు శక్తిని కోల్పోతే ప్రజాపతిలో సహా దేవతలంతా వెళ్ళి రుద్రుణ్ణి ప్రార్థిస్తారు.

**రుద్రుడు-త్ర్యంబకుడు :** రుద్రుడినే త్ర్యంబకుడు అంటారు. దేవతలంతా తమ తమ కోరికలను తీర్చుకోవటానికి రుద్రుడి దగ్గరకువస్తుంటారు. వచ్చినవారు పురోడాశాన్ని ఆయన దగ్గరున్న కపాలత్రయం (మూడు కపాలాలు) లో వుంచి ఆయన్ని పూజిస్తారు. వాటినే త్ర్యంబకం అంటారు. ఆ త్ర్యంబకాన్ని ధరించేవాడు కాబట్టి ఆయన త్ర్యంబకుడయ్యాడు. వేద మంత్రాలలో ఉపయోగించే గాయత్రి, త్రిష్టుప్, జగతీ ఛందస్సులు కూడా త్ర్యంబకం అనే పేరుతో స్మరించబడతాయి.

ఈ విధంగా కాలం అయిదు విధాలుగా చెప్పబడింది. పంచ విధాలుగా చెప్పబడ్డ ఈ కాలాన్ని వసంతాది ఆరు ఋతువులుగా గ్రహించాలి. ఇది కాలం గురించిన సంక్షిప్త వివరం. ఈ కాలం అనేది అనంత కాలమానంతో ప్రకాశించి ప్రాణుల జీవితాలను అపహరిస్తూ సంహరిస్తూ ప్రవహించే నదీ జలం లాగా సాగిపోతూ వుంటుంది.

## నీలకంఠుడి నామోత్పత్తి

పూర్వం కృతయుగంలో ప్రజాపతి మానసపుత్రుడు, వేదార్థనిర్ణయ తత్పరుడు, ధర్మాత్ముడు అయిన వశిష్ఠమహర్షి ఉండేవాడు. ఆయన ఒకనాడు కార్తికేయుడి దగ్గరుకు వెళ్ళి "కుమారా! గౌరీనందనుడైన నీ తండ్రి పరమేశ్వరుడి కంఠం నల్లగా కనిపిస్తోంది కదా! దానికి కారణం ఏమిటో దయచేసి నాకు చెప్పు" అని అడిగాడు. మహాతేజస్వి అయిన స్కందుడు ఆయనతో "వక్తల్లో గొప్పవాడివైన ఓ వశిష్ఠా! నేను పూర్వం నా తల్లి దండ్రుల వద్ద కూర్చున్నప్పుడు వారిద్దరూ మాట్లాడుకున్న మాటల్ని విన్నాను. నేను ఆనాడు విన్న దానినే నీకిప్పుడు చెబుతాను విను" అని చెప్పటం ప్రారంభించాడు.

**కైలాస శిఖరవైభవం :** కైలాస శిఖరం ఎంతో రమ్యమైనది. వివిధరకాల ధాతువులతో అది నిండి వుంటుంది. ఆ శిఖరం మీద వజ్రమయం స్ఫటికమయం అయిన సోపానాలు ఉంటాయి. ఆ సోపానాలన్నీ చిత్రపాదశిలా తలాలు. ఆ పర్వతం మీద అందమైన ఫలవృక్షాలు, పుష్పలతలూ వున్నాయి. చక్రవాక పక్షులు ఎగురుతూ తుమ్మెదలు సంగీతాన్ని వినిపిస్తూ ఆ పర్వతానికి మరింత

శోభని కలిగిస్తున్నాయి. సన్నటి నోటిధారలు మంచి నాదాన్ని చేస్తున్నట్టుగా వున్నాయి. ఆ పర్వత లోయలు క్రౌంచపక్షుల, నెమళ్ళ మధురమైన నాదాలతో ప్రతిధ్వనిస్తున్నాయి.

కైలాసశిఖరం అప్సరసగణాలతో కూడుకొని వుంది. కిన్నెరలు కూడా అక్కడ సంచరిస్తున్నారు. జీవకం అనే పక్షులు, కోకిలలు అక్కడ మధురమైన ధ్వనులు చేస్తూ వుంటాయి. ఆ పర్వతం మీద సిద్ధులు, చారణులు తరచుగా సంచరిస్తుంటారు. అక్కడ కామధేనువులున్నాయి. అవి అంబా అని మృదువుగా అరుస్తున్నాయి. వాటి స్వరాలు అక్కడ స్పష్టంగా వినిపిస్తున్నాయి. మేఘాల గర్జనల ఆ పర్వత శిఖరం మీద నిత్యం ప్రతిధ్వనిస్తూ వుంటాయి. ఇంకా విద్యాధరులు మధురంగా వాయించే వీణానాదాలు కూడా అక్కడ వినవస్తాయి. అవి చెవులకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తాయి.

ఆ పర్వతం మీద హంసలు, పావురాళ్ళు కొంగలు నిర్భయంగా సంచరిస్తున్నాయి. వివిధ రకాల వ్యాయామ భంగిమలు ప్రదర్శిస్తూ విఘ్నేశ్వరుడు అక్కడ ఆడుకుంటున్నాడు. భూతపతి అయిన పరమేశ్వరుడు వివిధరకాల భూతాలతో పరివేష్ఠితుడై వున్నాడు. ఆ భూతాలలో కొన్ని సింహముఖాలు మరికొన్ని వ్యాఘ్రముఖాలు. వాటిలో కొన్ని భయంకమైన శబ్దాలు చేస్తున్నాయి. కొన్ని మేక ముఖాలతో కొన్ని ఏనుగుముఖాలతో, మరికొన్ని కౄరమైన పిల్లి, నక్క ముఖాలతో వున్నాయి. కొన్ని భూతాలు జుగుప్సాకరంగా వేలాడే పెదాలతో, వేలాడే చేతులతో, వేలాడే భారీ ఉదరంతో పెద్ద పెద్ద చెవులతో కొన్ని పెద్ద పెద్ద పాదాలతో, మరికొన్ని పెద్దవైన నేత్రాలతో ఇలా చిత్ర విచిత్రంగా వున్నాయి. ఇలా నానావిధ భూత గణాలతో పరివేష్టితుడై వున్న శివుడిని పార్వతీదేవి ఇలా అడిగింది.

స్వామీ! మహాదేవా! సర్వేశ్వరా! నీ కంఠం మీద ఏదో మచ్చనల్లని మేఘం లాగా కనిపిస్తోంది. అది ఏమిటి? ప్రభూ! నీ కంఠం అలా నీలిరంగులోకి మారిపోవటానికి కారణం ఏమిటి? అని ప్రశ్నించింది.

దేవీ! పూర్వం దేవతలు దానవులు కలిసి క్షీరసముద్రాన్ని అమృతం కోసం మథించటం ప్రారంభించారు. అయితే ముందుగా ఆ సముద్రంలోనించి భయంకరమైన అగ్ని జ్వాలలు వెదజల్లుతూ కాలకూట విషం ఆవిర్భవించింది. దేవతలు, అసురులు దాన్ని చూసారు. వారంతా ఎంతో భయపడి బ్రహ్మదేవుడి దగ్గరకి పరుగెత్తారు. ఎంతో ఆందోళనతో తన దగ్గరకు వచ్చిన దేవతల్ని చూసాడు బ్రహ్మ. "దేవతలారా! ఎందుకు మీరింత ఆందోళనగా ఉన్నారు. ఎందుకింత భయంతో వణికి పోతున్నారు. కారణం ఏమిటో చెప్పండి? అని వారిని అడిగాడు.

బ్రహ్మదేవుడి మాటలు విన్న దేవతలు, దానవులు ముక్త కంఠంతో "బ్రహ్మదేవా! మేమంతా కలిసి అమృతం కోసం క్షీరసాగరాన్ని మథిస్తున్నాము. ఆ సమయంలో భయంకరమైన కాలకూట విషం ఆవిర్భవించింది. ఆ విషం పాముల్లాగా, తుమ్మెదలాగా, నల్లని భయంకమైన కాలమేఘంలా ఉంది. అది ప్రళయకాలంలో వుండే అగ్నిలా జ్వలిస్తోంది. కాలమృత్యువులా కనిపిస్తోంది. దాని కాంతి యుగాంతంలో వుండే సూర్యుడిలా ఉంది. ప్రభూ! భయంకరమైన ఆ విష ప్రభావంతో ధవళవర్ణంతో ప్రకాశించే జనార్ధనుడు కాస్తా నల్లని రంగులోకి మారిపోయాడు. అలా మొత్తం నల్లగా మారిపోయిన జనార్ధనుణ్ణి చూసి మేమందరం ఎంతో భయపడిపోయాం. మాకువేరే దిక్కు తోచక నీ వద్దకు వచ్చి శరణువేడుకుంటున్నాం. అని చెప్పారు. ఆ విధంగా భయంతో దేవతలు, దానవులు పలికిన మాటలు విని లోకపితామహుడైన బ్రహ్మదేవుడు వారితో ఇలా సంభాషించాడు.

దేవతలారా! దానవులారా! మీరు ఇద్దరూ సముద్రాన్ని మథించినప్పుడు పుట్టిన విషాన్ని కాలకూట విషం అంటారు. అది పుట్టిన వెంటనే సకల దేవతలూ తమ తమ తేజస్సులు కోల్పోయారు. ఆ విషం తీవ్రతని భరించటానికి బ్రహ్మనైన నేనుగాని, మహావిష్ణువుగానీ, ఇతర దేవతలందరూ గానీ శక్తమంతులు కారు. కేవలం ఒక్క పరమేశ్వరుడు తప్ప అని చెప్పిన బ్రహ్మ వెంటనే మనసులో

గాఢంగా ఓంకారాన్ని స్మరించాడు. అంతటా వ్యాపించినట్టుగా ఓంకారం ఆయనకు దర్శనమిచ్చింది. ఆ దివ్య ఓంకారానికి నమస్కరించి నన్ను (పరమేశ్వరుణ్ణి) ఇలా స్తుతించటం ప్రారంభించాడు.

## బ్రహ్మచేసిన శివస్తుతి

నమస్తుభ్యం విరూపాక్ష నమస్తే దివ్యచక్షుషే ।
నమః పినాకహస్తాయ వజ్రహస్తాయ వై నమః ॥ 1

నమః త్రైలోక్యనాథాయ భూతానాం పతయే నమః ।
నమః సురారి హంత్రే చ సోమసూర్యాగ్ని చక్షుషే ॥ 2

బ్రహ్మణే చైవ రుద్రాయ విష్ణవే చైవ తే నమః ।
సాంఖ్యాయ చైవ యోగాయ భూతగ్రామాయ వై నమః ॥ 3

మన్మథాంగవినాశాయ కాలపృష్ఠాయ వై నమః ।
సరేతసేఽథ రుద్రాయ దేవదేవాయ రంహసే ॥ 4

కపర్దినే కరాలాయ శంకరాయ హరాయ చ ।
కపాలినే విరూపాయ శివాయ వరదాయ చ ॥ 5

త్రిపురఘ్న మఖఘ్నాయ మాతౄనాం పతయే నమః ।
వృద్ధాయ చైవ శుద్ధాయ ముక్తాయైవ బలాయ చ ॥ 6

లోకత్రయైక వీరాయ చంద్రాయ వరణాయ చ ।
అగ్రాయ చైవ చోగ్రాయ విప్రాయానేక చక్షుషే ॥ 7

రజసే చైవ సత్త్వాయ నమస్తేఽవ్యక్త యోనయే ।
నిత్యాయచైవా నిత్యాయ నిత్యానిత్యాయ వై నమః ॥ 8

వ్యక్తాయ చైవావ్యక్తాయ వ్యక్తావ్యక్తాయ వై నమః ।
చింత్యాయ చైవా చింత్యాయ చింత్యా చింత్యాయ వై నమః ॥ 9

జగతామార్తినాశాయ ప్రియనారాయణాయ చ ।
ఉమాప్రియాయాయ శర్వాయ నందివక్త్రాంకితాయ చ ॥ 10

పక్షమాసార్ధ మాసాయ ఋతుసంవత్సరాయ చ ।
బహురూపాయ ముండాయ దండినే చ వరూధినే ॥ 11

నమః కపాలహస్తాయ దిగ్వాసాయ శిఖండినే ।
ధన్వినే రథినే చైవ యమినే బ్రహ్మచారిణే ॥ 12

ఋగ్యజుః సామవేదాయ పురుషాయేశ్వరాయ చ ।
ఇత్యేవమాదిచరితైః స్తోత్రైః స్తుత్య నమో ఽ స్తుతే ॥ 13

*(శ్లో॥64-75 అధ్యా-25, పూ.భా)*

ఈ విధంగా బ్రహ్మదేవుడు స్తుతిచేసి, నాకు నమస్కరించి, "దేవా! పరమేశ్వరా! నా భక్తిని నాతో వచ్చిన దేవతల భక్తిని తెలుసుకో స్వామీ! నీవు ఎప్పుడూ అవ్యక్తంగానే వున్నావు. గంగాజలంతో చెదిరిన కేశాలు కలిగిన వాడవు" అని తిరిగి ప్రార్థించాడు. అప్పుడు నేను లోకకర్త అయిన బ్రహ్మతో- పితామహా! భూత భవిష్యత్ వర్తమానాలకు నీవే అధిపతివి. ఎందుకు మీరంతా ఇక్కడికి వచ్చారు? నాతో మీకు ఏంపని? నేను మీకు ఏ సాయం చేయాలి? చెప్పండి అని అడిగాను. బ్రహ్మ ఇలా చెప్పటం ప్రారంభించాడు.

సర్వానికీ కారణమైనవాడా! ఈశ్వరా! దేవతలు దానవులు అమృతం కోసం సముద్రాన్ని మథిస్తుండగా, దానిలోంచి మహాభయంకరమైన కాలకూట విషం ఆవిర్భవించింది. దాన్ని చూసి మేమందరం ఎంతో భయపడ్డాం. ఓ మహాదేవా! సర్వలోక హితంకోసం నీవా విషాన్ని స్వీకరించాలి ప్రభూ! లేకపోతే అది లోకాల్ని దహించేస్తుంది. దాన్ని త్రాగటానికి నీవొక్కడవే సమర్థుడవు. నీవు తప్ప మరెవ్వరూ ఆ కాలకూటాన్ని కనీసం తాకలేరు. అని దీనంగా ప్రార్థించాడు. బ్రహ్మ ప్రార్థన విని నా మనసు ఎంతో ద్రవించింది. లోకాలన్నిటి క్షేమంకోసం వారంతా కోరిన విధంగా ఆ కాలకూట విషాన్ని త్రాగటానికి అంగీకరించాను.

దేవీ! వెంటనే సాగరమథనం జరిగే ప్రాంతానికి వెళ్ళి మహాభయంకరంగా జ్వలిస్తూ, మృత్యువులా కనిపిస్తున్న కాలకూట విషాన్ని త్రాగటం ప్రారంభించాను.

మహాఘోరమైన ఆ విషం త్రాగగానే నా గొంతు నల్లగా మారిపోయింది. నా కంఠం, నల్లటి కలువ రేకులా కంఠాన్ని కౌగిలించుకున్న కాల సర్పంలా ఉన్నది. ఆ విధంగా విషప్రభావంతో నల్లగా మారిన నా కంఠాన్ని చూసి మహాతేజోవంతుడైన బ్రహ్మ "మహాదేవా! విష ప్రభావంతో నీ కంఠం నల్లబడటంతో నీవు నీలకంఠుడిగా ప్రకాశిస్తున్నావు" అని పలికాడు. దేవీ! ఆ విధంగా బ్రహ్మదేవుడి విన్నపాన్ని మన్నించి విషం తాగినందువల్ల నా కంఠం నీలవర్ణంలోకి మారింది. మహాభయంకరమైన విషాన్ని నా గొంతులో దాచుకోవటాన్ని చూసి, అక్కడున్న దేవదానవ రాక్షస గణాలన్నీ ఎంతో ఆశ్చర్యపోయాయి. వెంటనే అందరూ భక్తిగా నాకు నమస్కరించి.

అహోబిలం వీర్య పరాక్రమస్తే త్వహోవపు ర్యోగలబలం తవేశ ।
అహో ప్రభుత్వం తవ దేవదేవ మహాద్భుతం మన్మథదేహనాశ ॥ 1

త్వమేవ విష్ణుః చతురాననస్త్వం త్వమేవమృత్యుర్వరదస్త్వమేవ ।
త్వమేవ సూర్యోరజనీ కరశ్చ వ్యక్తిస్త్వమే వాస్య చారచరస్య ॥ 2

త్వమేవ వహ్నిః పవనస్త్వమేవ భూమిః సలిలం త్వమేవ ।
త్వమేవ సర్వస్య చరాచరస్య ధాతావిధాతా ప్రళయస్త్వమేవ ॥ 3

*(శ్లో॥93-95, అధ్యా25)*

సర్వేశా! నీ బలం ఎంత ఆశ్చర్యమైనది! నీ వీర్య పరాక్రమం ఎంత గొప్పది. నీ ప్రభుత్వం ఎంత అద్భుతమైనది. నీవే విష్ణువు. చతుర్ముఖ బ్రహ్మవు కూడా నీవే. నీవే మృత్యుదేవతవు. నీవే వరదుడవు. నీవే సూర్యుడవు, నీవే పృథివివి. నీవే నీరు. స్థావరజంగమాత్మకమైన ఈ ప్రపంచానికి నీవే సృష్టికర్తవు. పాలించేవాడవూ ప్రళయం సృష్టించేవాడవూ నీవే. అగ్నివి, వాయువువీ కూడా నీవే.

ఈ విధంగా దేవతలందరూ నన్ను ఘనంగా స్తుతించి తలవంచి నాకు నమస్కరించారు. తరువాత యథావిధిగా సాగరమథనాన్ని చేసి చివరకు అమృతం రాగా దాన్ని పంచుకున్నారు. ఆ తరువాత దేవతలందరూ దివ్య విమానాలను అధిరోహించి మేరు పర్వత శిఖరానికి చేరుకున్నారు.

"వశిష్ఠమహర్షీ! ఇలా ఎంతో రహస్యమైన ఈ కథనాన్ని నీలకంఠుడు పార్వతీదేవికి వివరించాడు. ఈ చరిత్ర ముల్లోకాల్లో విశ్రుతమైనది. సర్వపాప నాశనం చేసేది ఈ దివ్య వృత్తాంతం. పరమపావనమైన ఈ దివ్య కథని ఎవడు నిత్యం మననం చేసుకుంటాడో వాడికున్న ఘోరమైన పాపాలన్నీ నశిస్తాయి. దుఃస్వప్నాలు రావు. స్త్రీలకు మాంగల్యబలం పెరుగుతుంది. రాజులకు అధికారం సుస్థిరమవుతుంది. వివాదాల్లో విజయం లభిస్తుంది. యుద్ధాల్లో జయం కలుగుతుంది. రాజసభలో గౌరవం లభిస్తుంది. ఇంటిలో సంపదలు వృద్ధిచెందుతాయి. ఎవరైతే బ్రహ్మదేవుడు చేసిన శివస్తుతిని శ్రద్ధగా పఠిస్తాడో, పారాయణ చేస్తాడో వాడు రుద్రలోకాన్ని చేరుకుంటాడు. ఇంత కన్నా గొప్పస్తోత్రం నభూతో నభవిష్యతి" స్కందుడు వశిష్ఠుడికి నీలకంఠుడి వృత్తాంతాన్ని సవివరంగా వినిపించాడు.

## మహాలింగోత్పత్తి కథనం

పూర్వం బలిచక్రవర్తి కాలంలో దేవతలకు దానవులకూ యుద్ధం జరిగింది. మహావిష్ణువు మాయవల్ల త్రిలోకాధిపతిగా వున్న బలిచక్రవర్తి పాతాళానికి త్రొక్కబడ్డాడు. బలితో పాటు భూమిమీద మిగిలిన అసురులు కూడా దిక్కుతోచక పాతాళానికి పారిపోయారు. అప్పుడు ఇంద్రుడు ప్రహృష్టుడయ్యాడు. ఒకనాడు దేవతలందరూ కలిసి క్షీరసముద్రం మీద కొలువున్న శ్రీహరి దగ్గరకు వెళ్ళారు. కృతజ్ఞతా పూర్వకంగా ఆయన్ని ఇలా స్తుతించారు.

త్వంధాతా త్వంచకర్తాసి త్వంలోకాన్ సృజసి ప్రభో ।
త్వత్ప్రసాదాచ్చ కల్యాణం ప్రాప్తం త్రైలోక్య మవ్యయమ్ ॥

*(శ్లో॥6, అధ్యా 26)*

ప్రభూ! నీవేధాతవు, నీవేకర్తవు. నీవే ఈ లోకాలను సృష్టిస్తావు. నీ అనుగ్రహంతోనే ముల్లోకాలూ అనంతమైన శుభాలను పొందాయి. నీవు రాక్షసులందర్నీ జయించావు. నీ వల్లనే బలిచక్రవర్తి బంధించబడ్డాడు అని పరిపరి విధాలుగా ఆయన్ని స్తుతించారు.

సిద్ధులచేత, దేవతల చేత, మహర్షుల చేతా స్తుతించబడ్డ శ్రీహరి వారితో దేవతలారా! నాకు ఇంతటి శక్తి కలగటానికి ఒక కారణం ఉన్నది. దాని గురించి చెబుతాను వినండి – ఎవడు సకల భూతాలకూ మూలమో, ఎవడు యముడో, ఎవడు కాలుడో, ఎవరిచేత ఈ చరాచర ప్రపంచం, నేను, బ్రహ్మదేవుడు మాయద్వారా సృష్టించబడ్డాయో! ఆ మహానుభావుడి అనుగ్రహం వల్ల నేను సిద్ధత్వాన్ని, దివ్యశక్తుల్ని పొందగలిగాను.

పూర్వం అవ్యక్తమైన చీకటిలో ముల్లోకాలూ నా చేత ఆవరించబడి వున్నాయి. ఆ సమయంలో నేను నా పొట్టలో వున్న భూతాలతో కలిసి నిద్రిస్తున్నాను. అప్పుడు నాకు వేయి చేతులు, వేయి పాదాలు, వేయి నేత్రాలు, చేతుల్లో శంఖ, చక్ర గదలు ఉన్నాయి. నేను స్వచ్ఛమైన నీటిమీద పడుకున్నాను. నాకు కొద్ది దూరంలో దివ్యంగా కనిపిస్తున్న ఒక వెలుగుని చూసాను. ఆ వెలుగులో ఒక దివ్యమైన వ్యక్తి వందసూర్యులకాంతితో ప్రకాశిస్తున్నాడు. ఆయనకి నాలుకు ముఖాలున్నాయి. ఆయన కృష్ణాజినాన్ని, కమండలాన్ని ధరించాడు. వెంటనే నేనాయన దగ్గరకి వెళ్ళాను. చతుర్ముఖాలతో వున్న ఆ ప్రభువు నన్ను చూసి –

ఎవరు నీవు? ఎక్కడ నుంచి వచ్చావు? ఇక్కడ ఎందుకున్నావు? చెప్పు నేను ఈ లోకానికి కర్తను. స్వయంభువును. నేను సర్వతో ముఖుడను. అని నన్ను ప్రశ్నించాడు. బ్రహ్మమాటలు వినగానే నాకు చాలా కోపం వచ్చింది. నేను కూడా ఏమాత్రం చలించకుండా స్వామీ! నేనే ఈలోకాన్ని సృష్టించిన సృష్టికర్తను. అంతేకాదు అన్ని లోకాల సంహర్తను కూడా నేనే అని ప్రతిసమాధానమిచ్చాను. ఇలా మా ఇద్దరి మధ్య నేను గొప్పంటే నేను గొప్ప అన్న వాదం ప్రారంభమయ్యింది. అంతలో ఉత్తర దిశలో ఆకాశాన్నంటేంత ఎత్తులో ఒక దివ్య జ్వాల ప్రకాశిస్తూ మాకు కనిపించింది. ఆ జ్వాలను చూసి మేమిద్దరం ఆశ్చర్యపోయాం. వెంటనే మా వాదన ఆపి ఆ జ్వాల దగ్గరకి వెళ్ళి నమస్కరించాం. మహాద్భుతంగా వృద్ధి చెందుతున్న ఆ జ్యోతి ఎంతో విచిత్రంగా వుంది. అది మహా జ్వలంగా ప్రకాశిస్తూ భూమి లోపల నుంచి స్వర్గాన్ని ఛేదించి పైకి వెళుతోంది.

ఆ జ్వాల మధ్యభాగం ఎంతో ప్రభావవంతంగా వుంది. అది ఒక లింగాకారంగా కనుపిస్తోంది. అది వర్ణించలేనంతగా గొప్పగా కనిపిస్తోంది. అప్పుడు నాతో పాటు వచ్చిన బ్రహ్మ ఈ లింగం ఎంతో విచిత్రంగా వుంది. దీని ఆద్యంతాలు మనం తెలుసుకోవాలి. నీవు ఈ లింగం అథో భాగానికి వెళ్ళి ఇది ఎక్కడ మొదలవుతుందో చూడు. నేను దీనిపై భాగానికి వెళ్ళి ఎక్కడ అంతమవుతుందో చూస్తాను" అని నాతో అన్నాడు. బ్రహ్మ మాటకు అంగీకరించి నేను లింగం క్రింద భాగం చూడటానికి బయలుదేరాను. బ్రహ్మ ఊర్ధ్వభాగం చూడటంకోసం పైకి వెళ్ళాడు. కొంత కాలం గడిచాక ఇద్దరం తిరిగి అదేచోటుకి వచ్చాము. మా ఇద్దరికీ ఆలింగం ఆద్యంతాలు తెలియలేదు. అంత గొప్పలింగరూపాన్ని ధరించిన మహాత్ముడు ఎవరు? అని ఆలోచించాము. అవ్యక్తరూపంతో ఉన్న ఆ లింగస్వరూపుడిని భక్తి ప్రపత్తులతో నమస్కరించి ఇలా స్తుతించాము.

## బ్రహ్మ విష్ణుకృత శివస్తుతి

నమోఽస్తుతే లోక సురేశ దేవ నమోఽస్తుతే భూతపతే మహాత్మన్ ।
నమోఽస్తుతే శాశ్వత సిద్ధయోగినే నమోఽస్తుతే సర్వజగత్ప్రతిష్ఠిత ॥ 1

పరమేష్ఠీ పరం బ్రహ్మ త్వక్షరం పరమం పదమ్ ।
జ్యేష్ఠస్త్వం వామదేవశ్చ రుద్రః స్కందః శివః ప్రభుః ॥ 2

త్వం యజ్ఞస్త్వ వషట్కారస్త్వమోంకారః పరంతపః ।
స్వాహాకారో నమస్కారః సంస్కారః సర్వకర్మణామ్ ॥ 3

స్వధాకారశ్చ యజ్ఞశ్చ వ్రతాని నియమాస్తథా ।
వేదా లోకాశ్చ దేవాశ్చ భగవానేవ సర్వశః ॥ 4

ఆకాశస్య చ శబ్దస్త్వం భూతానాం ప్రభవాప్యయః ।
భూమౌ గంధో రసశ్చాప్సు తేజోరూపం మహేశ్వరః ॥ 5

వాయోః స్పర్శశ్చ దేవేశ వపుశ్చంద్రమసస్తథా ।
బుద్ధౌ జ్ఞానం చ దేవేశ ప్రకృతేర్బీజమేవ చ ॥ 6

సంహర్తా సర్వలోకానాం కాలో మృత్యుమయోంతకః ।
త్వం ధారయసి లోకాం స్త్రీం స్త్వమేవ సృజిసి ప్రభో ॥ 7

పూర్వేణ వదనేన త్వమిద్రత్వం ప్రకరోషి వై ।
దక్షిణేన చ వక్త్రేణ లోకాన్ సంక్షిపతే పునః ॥ 8

పశ్చిమేన తు వక్త్రేణ వరుణస్థో న సంశయః ।
ఉత్తరేణ తు వక్త్రేణ సోమస్త్వం దేవసత్తమః ॥ 9

ఏకధా బహుధా దేవ లోకానాం ప్రభవాప్యయః ।
ఆదిత్యా వసవో రుద్రా మరుతశ్చ సహాశ్వినః ॥ 10

సాధ్యా విధ్యాధరా నాగాశ్చారణాశ్చ తపోధనాః ।
వాలఖిల్యా మహాత్మానస్తపః సిద్ధాశ్చ సుప్రతాః ॥ 11

త్వత్తః ప్రసూతా దేవేశ యేచాన్యే నియతవ్రతాః ।
ఉమా సీతా సినీవాలీ కుహూర్గాయత్ర్య ఏవచ ॥ 12

లక్ష్మీః కీర్తిర్ధృతిర్మేధా లజ్జా కాంతిర్వపుః స్వధా ।
తుష్టిః పుష్టిః క్రియా చైవ వాచాం దేవీ సరస్వతీ ।
త్వత్తః ప్రసూతా దేవేశ సంధ్యా రాత్రిస్తథైవ చ ॥ 13

సూర్యాయుతా నామయుత ప్రభావ నమోఽస్తుతే చంద్రసహస్రగౌర!
నమోఽస్తుతే వజ్రపినాకధారిణే నమోస్తుతే సాయకచాపపాణయే ॥ 14

నమోఽస్తుతే భస్మవిభూషితాంగ ! నమోఽస్తుతే కామశరీర నాశన!
నమోఽస్తుతే దేవ ! హిరణ్యగర్భ! నమోఽస్తుతే దేవ హిరణ్యవాససే! 15

నమోఽస్తుతే దేవ హిరణ్య యోనే నమోఽస్తుతే దేవ హిరణ్యనాభ!
నమోఽస్తుతే దేవహిరణ్య రేతసే! నమోఽస్తుతే నేత్ర సహస్రచిత్ర! ॥ 16

నమోఽస్తుతే దేవహిరణ్య వర్ణ! నమోఽస్తుతే దేవహిరణ్య కేశ!
నమోఽస్తుతే దేవహిరణ్య వీర! నమోఽస్తుతే దేవహిరణ్య దాయినే! ॥ 17

నమోఽస్తుతే దేవహిరణ్యనాథ! నమోఽస్తుతే దేవ హిరణ్యనాద!
నమోఽస్తుతే దేవ పినాకపాణే ! నమోఽస్తుతే శంకర నీలకంఠ! ॥ *18*

*(శ్లో॥32-50 అధ్యా-26, పూ.భా)*

ఈ విధంగా మేము స్తోత్రం చేసే సరికి ఆ లింగం మధ్యభాగం నుంచి కోటి సూర్యుల తేజస్సుతో ఈశ్వరుడు వ్యక్తమయ్యాడు. మహాద్యుతిమంతుడు, దయార్ద్రహృదయుడు అయిన శంకరుడు గంభీర స్వరంతో ఒక్కసారిగా పెద్ద నవ్వు నవ్వాడు. ఆ హాసం ప్రపంచమంతా ప్రతిధ్వనించింది. మేమిద్దరం ఒక్కక్షణం అది విని భయపడిపోయాం. ఆ సర్వేశ్వరుడు శంఖంలాంటి కంఠంతో, వివిధరకాల ఆభరణాలతో పినాకాన్ని, త్రిశూలాన్ని చేతిలో ధరించి, సర్పయజ్ఞోపవీతాన్ని అందంగా వేసుకుని మాకు దర్శనమిచ్చాడు. మా ఇద్దరినీ చూసి ప్రీతిపూర్వకంగా ఇలా పలికాడు.

"దేవశ్రేష్ఠులారా! మీ స్తోత్రపాఠం విని నేనెంతో ఆనందించాను. నా మహాయోగశక్తిని స్పష్టంగా చూడండి. ముందు భయాన్ని విడిచిపెట్టండి. మీ ఇద్దరూ సనాతనులు. నా శరీరం నుంచే మీరు జన్మించారు. లోకపితామహుడైన ఈ బ్రహ్మ నా దక్షిణ బాహువు లాంటివాడు. యుద్ధంలో ఎప్పుడూ అపజయం ఎరగని ఈ విష్ణువు నా వామబాహువు. మీ ఇద్దరినీ చూసి నేను ఎంతో సంతోషిస్తున్నాను. కనుక ఏదైనా వరం కోరుకోండి ప్రసాదిస్తాను" అన్నాడు. అప్పుడు మేమిద్దరం మా భయాన్ని తొలగించుకుని "స్వామీ! నీ మీద అచంచలమైన భక్తి ప్రపత్తులు స్థిరంగా వుండేలా అనుగ్రహించు. అదే మేం కోరే వరం" అని అడిగాము. శివుడు తథాస్తు అని వరాన్ని అనుగ్రహించి, మహానుభావులారా! మీరు ఇక నుంచి ప్రజల్ని సృష్టించి వృద్ధిచేయండి అని ఆజ్ఞాపించి అదృశ్యమయ్యాడు.

"దేవతలారా! ఆనాడు పరమేశ్వరుడి అనుగ్రహం వల్ల నేను శక్తివంతుడిని అయ్యాను. ఆ శక్తితోనే బలిలాంటి రాక్షసుల్ని జయించగలిగాను. కనుక సర్వేశ్వరుడైన శివుడే పరమదైవం. ఆయనకి నమస్కరిస్తే సకల దేవతలకూ నమస్కరించినట్టే. మీరంతా నిత్యం ఆ పరమపురుషుణ్ణి ప్రార్థించండి. మహాదేవుడి గురించి నేను, బ్రహ్మ కలిపి చేసిన దివ్యస్తుతిని పఠించండి. ఈ స్తవాన్ని ఎవరైతే శ్రద్ధగా చదువుతారో వారు అన్ని పాపాల నుంచీ విముక్తి పొందుతారు". అని శ్రీమహావిష్ణువు దేవతలకు చెప్పాడు.

# యుగాలలో ప్రజల లక్షణాలు

పిశాచులు, గంధర్వులు, అసురులు, యక్షులు, రాక్షసులు, పన్నగాలు (సర్పాలు)వీరంతా కృతయుగంలో జన్మిస్తారు. వారి ఎత్తు పరిమాణం ఉన్నతంగా సమానంగా వుంటాయి. దేవజన్ములైన వారందరూ 92 అంగుళాల ఎత్తులో వుంటారు. ఇది వారి శరీర పోషణబట్టి వుంటుంది. కొంతమంది మరికొంచెం ఉన్నతంగా ఉండచ్చు. సామాన్యంగా కృతయుగంలో అందరూ ఇదే పరిమాణంలో వుంటారు. ఆకాలంలో వుండే మనుషులు దేవజన్ములకన్నా ఏడు అంగుళాల తక్కువ ఎత్తులో వుంటారు. అనగా వారికన్నా పొట్టిగా వుంటారు. ఆ కాలంలో వుండే మనుషులు దేవజన్ములకన్నా ఏడు అంగుళాల తక్కువ ఎత్తులో వుంటారు. అనగా వారికన్నా పొట్టిగా వుంటారు. అయితే దేవతల అసురుల శరీరాలు 158 అంగుళాల పరిమాణంలో వుంటాయని కలియుగంలో పుట్టినవారు భావిస్తారు. కలియుగం ప్రారంభంలో జన్మించినవారు సాధారణంగా 84 అంగుళాల ఎత్తు వుంటారు. కాలం గడిచేకొద్దీ ఎత్తు ప్రమాణం మానవులలో తగ్గిపోతూ వుంటుంది. ఉన్నతమైన మానవులు అష్టతాల ప్రమాణంలో వుంటారు. అలాగే ఆపాదతల మస్తిష్కం వరకూ ఎవడు నవతాల ప్రమాణంతో వుంటాడో అతడి చేతులు మోకాళ్ళదాకా పొడవుంటాయి. అలాంటివాడిని దేవతలు కూడా పూజిస్తారు. ఇదేవిధంగా వారి వారి కర్మల్ని అనుసరించి వివిధయుగాలలో ఏనుగులు, ఎద్దులు, ఆవులు, గుర్రాలు తగినంత ఎత్తు వైశాల్యం పొందుతుంటాయి.

పశువుల మూపురాలు 76 అంగుళాల ఎత్తు. ఏనుగుమొత్తం 108 అంగుళాల ఎత్తులో వుంటుంది. చెట్ల ఎత్తు అత్యున్నతంగా 108 అంగుళాల వరకూ వుంటాయి. చెట్టు పొడవు 1000 అంగుళాలు వుంటుంది. మానవుల శరీర సంస్థితి ఎలా ఉంటుందో దేవతల శరీరస్థితి కూడా అదేవిధంగా వుంటుంది. ఆవులు, మేకలు, గొఱ్ఱెలు, గుఱ్ఱాలు, ఏనుగులు, పక్షులు, చెట్లు ఇవన్నీ పవిత్ర కర్మల్లో ఉపయోగపడతాయి. అవి అన్నివిధాలా యజ్ఞానికి అర్హమైనవి.

**సాధువులు :** 'సత్' అనే పదం బ్రహ్మను గురించి వివరిస్తుంది. అది కలిగినవాడు 'సంతః' అంటే బ్రహ్మతో తాదాత్మ్యం చెందినవాడు అని అర్థం. అతడే సాధువు,

అని చెప్పబడతాడు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలను అదుపులో వుంచుకున్న వాడు, ఎవరి మీదా కోపాన్ని ప్రత్యేకమైన ప్రేమనీ ప్రదర్శించరో అలాంటి వారే సాధువులు లేదా సంతులు.

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు సామాన్య ధర్మాలలో విశేష ధర్మాలలో నియుక్తులై వుండటంవల్ల వారిని ద్విజులు అంటారు. ద్విజులు అంటే రెండు జన్మలు కలిగిన వారు అని అర్థం. తన ఆశ్రమానికి సంబంధించిన ధర్మాలను సక్రమంగా ఆచరిస్తూ శ్రౌత స్మార్తధర్మాచరణ పట్ల ఆసక్తి కలిగి వుండేవాడిని ధర్మజ్ఞుడు అంటారు. అలాంటి వాడిని సాధువు అని కూడా వ్యవహరిస్తారు. గురువు క్షేమాన్ని కోరి ఆయనకు సేవలు చేస్తూ విద్యాసాధన కోసం శ్రద్ధగా ప్రయత్నం చేసే శిష్యుడు కూడా సాధువే. అలాగే తన ఇంటికి కావలసిన పదార్థాలని ధర్మబద్ధంగా సంపాదించుకుంటూ అతిథి అభ్యాగతులకు సేవలు చేసే గృహస్థుడు కూడా సాధువు అని పిలువబడతాడు. వైఖానసుడు (అరణ్యంలో యతిగా జీవించేవాడు) అరణ్యంలో జీవిస్తూ తపస్సు చేత శక్తిని సాధిస్తే అతడు సాధువౌతాడు. ఈ విధంగా బ్రహ్మచారి, గృహస్థుడు, వైఖానసుడు వీరందరూ తమ జీవితాన్ని ధర్మబద్ధంగా గడపటం వల్ల సాధువులుగా కీర్తించబడతారు.

**ధర్మం :** దేవతలుగానీ, పితృదేవతలుకానీ, మునులు కానీ, మనుష్యులు కానీ విభిన్న ధర్మమార్గాలు ఉండటం వల్ల ఇది ధర్మం ఇది అధర్మం అని పరిపూర్ణంగా గ్రహించలేరు. ఇక్కడ ధర్మం అంటే శ్రుతి, స్మృతుల్లో విధించబడ్డ పవిత్రమైన పనులు అని భావించాలి. వీటిలో పవిత్రమైన కర్మ ధర్మం అయితే అపవిత్రమైన కర్మ అధర్మం అవుతుంది. మనం కోరుకునేదాన్ని పొందింప చేసేదే ధర్మం. అలాంటి ధర్మాన్ని గురించే ఆచార్యులు మనకి బోధిస్తారు.

అనిష్టఫలాన్ని అందించే అధర్మం గురించి కూడా ఆచార్యులు ఉపదేశిస్తారు. ఎవరు వృద్ధులుగా వుంటారో! ఎవరు లోభగుణం లేకుండా వుంటారో, ఎవరు ఋజుప్రవర్తనతో వుంటారో, ఎవరు నియమపూర్వకంగా గురుకులంలో

విద్యాభ్యాసాన్ని పూర్వం చేసివున్నారో అలాంటివారినే ఆచార్యులంటారు. ధర్మాన్ని స్వయంగా ఆచరిస్తూ, ధర్మాన్ని స్థాపిస్తూ సకలశాస్త్రాలనూ పరిపూర్ణంగా అధ్యయనం చేసినవాడే ఆచార్యుడు.

శ్రౌతం, స్మార్తం అని ధర్మం రెండు విధాలుగా ద్విజులు చేత విధించబడింది. శ్రౌతధర్మం వివాహాది కార్యక్రమాలకు, నిత్యాగ్ని హోత్రాది విధులు నిర్వహించుటకు సంబంధించింది. స్మార్తధర్మం వర్ణాశ్రమాల ఆచారాలకు సంబంధించింది. స్మార్తధర్మం వర్ణాశ్రమాల ఆచారాలకు, యమ నియమాలకు సంబంధించింది. సప్తర్షులు తమ కన్నా ముందున్న ఋషుల ద్వారా ధర్మాన్ని తెలుసుకున్న తరువాత వారు స్వయంగా శ్రౌత ధర్మాలను ఉపదేశించారు.

ఋగ్యజుస్సామ వేదాలు మూడూ బ్రహ్మకి అంగాలు. గడిచిన మన్వంతరాలలోని ఆచారాలను స్మరించి మనువు తనపేర ఒక స్మృతిగ్రంథాన్ని రచించాడు. దీని ప్రకారం వర్ణాశ్రమధర్మానే స్మృతి గ్రంథాన్ని రచించాడు. దీని ప్రకారం వర్ణాశ్రమధర్మమే స్మృతిధర్మమని తెలుస్తోంది. మనువు చెప్పిన ధర్మాన్నే శిష్టాచారం అని కూడా వ్యవహరిస్తారు. శేష అనే శబ్దంనుంచి 'శిష్ఠ' అనేది రూపొందిందని చెప్తారు. ధర్మాన్ని ఆచరించే మనువు, సప్తర్షులు వంటివారు శిష్టులు. వీరు ఆచరించిన ధర్మాలనే శిష్టాచారాలు అంటారు. వీరు ప్రతిమన్వంతరంలో ఈ శిష్టాచారాల్ని పాటిస్తూనే వున్నారు. అందుకే వాటికి అంత ప్రాముఖ్యత ఏర్పడింది.

శిష్టాచారాలు మొత్తం 1.దానం 2.సత్యం 3.తపస్సు 4.జ్ఞానం 5.విద్య 6.యజ్ఞం 7.సన్న్యాసం 8.దయ అని ఎనిమిది రకాలుగా వుంటాయి. శిష్టులు, విశిష్టులు అయిన మనువులు, మహర్షులు వీటిని పరంపరగా ప్రతి మన్వంతరంలో ఆచరించటం వల్ల వీటిని శిష్టాచారాలంటారు. వీటిలో శ్రవణం (వినటం) చేత శ్రౌత ధర్మాన్ని, స్మరణం (స్మరించటం) చేత స్మార్త ధర్మాన్ని తెలుసుకోవాలి.

వేదాత్మకం యజ్ఞాత్మకం అయినది శ్రౌత ధర్మం. ప్రజల వర్ణాశ్రమ ధర్మాలకు సంబంధించింది స్మార్త ధర్మం.

**1. సత్యం :** ఒక విషయాన్ని దర్శించినవాడు దాని గురించి మరొకడు తనని ప్రశ్నించినప్పుడు ఏమాత్రం ఆ విషయాన్ని కప్పి పుచ్చకుండా జరిగింది జరిగినట్టు చెప్పటమే సత్యం.

**2. తపస్సు :** బ్రహ్మచర్య దీక్ష, జపం, మౌనం, నిరాహారంగా వుండటం అనే లక్షణాలతో కూడుకున్నది తపస్సు. ఇది చాలా కఠినమైన నియమాలతో కూడుకున్నది. సాధారణంగా దీన్ని సాధించటం చాలా కష్టం.

**3. యజ్ఞం :** పశువులు, నేయి, హవిస్సు, సమిధలు ఋగ్వేద, యజుర్వేద, సామవేద మంత్రాలు, ఋత్విక్కులు, దక్షిణలు వీటన్నిటి కలయికే యజ్ఞం.

**4. దయ :** సర్వప్రాణుల హితం, అహితం విషయాలలో తనతో సమానంగా అందరినీ అన్నిటినీ ప్రేమగా చూడటం దయ.

**5. క్షమ :** తనని ఎవరైనా నిందించినా, దూషించినా, కొట్టినా తిరిగి వారిని తిట్టక, కొట్టక ఓర్పుతో సహించి వుండటమే క్షమ.

**6. అలోభం :** యజమానులు వదిలివేసిన, రక్షిస్తున్న వస్తువుల్ని, ఇతరుల వస్తువుల్ని గ్రహించకుండా వుండటమే అలోభగుణం.

**7. తపము :** మైథునవ్యాపారం మీద ఆసక్తి లేకుండా వుండటం, స్త్రీ సంభోగం గురించి ఆలోచించకుండా వుండటం, ఇతరులతో సంభాషించకుండా బ్రహ్మచర్యాన్ని శ్రద్ధగా పాటించటాన్నే 'తపం' అంటారు.

**8. శమము :** ఆత్మార్థంగా కానీ, పరార్థంగా కానీ జ్ఞానేంద్రియాలు మిథ్యగా ప్రవర్తించకుండా అనగా ఇంద్రియాలన్నీ నిగ్రహంగా వుంచుకోవటాన్ని శయము అంటారు.

**9. జితాత్ముడు :** జ్ఞానేంద్రియాల నుంచి, కర్మేంద్రియాల నుంచి ఆటంకాలు, ప్రలోభాలు ఎదురైనా ఎవడు కోపగించుకోడో అతడు జితాత్ముడు.

**10. దానం :** తనకు ఎంతో ఇష్టమైనది. న్యాయమార్గంలో సంపాదించినది అయిన ధనాన్ని గుణవంతుడైన వ్యక్తికి ఇచ్ఛాపూర్వకంగా సమర్పించటం దానం అని చెప్పబడుతుంది. ఈ దానం అనేది మూడు రకాలుగా 1.కనిష్ఠ 2.జ్యేష్ఠ 3. మధ్యమం అని వుంటుంది. వీటిలో మోక్షం కావాలని కోరుకుంటూ చేసే దానాన్ని జ్యేష్ఠం అని, నీచమైన స్వార్థపరమైన కోరికలు సాధించుకోవాలనే సంకల్పంతో చేసిన దానాన్ని కనిష్ఠమని, ప్రాణుల మీద దయతో ప్రత్యేకమైన ఏ కోరిక లేకుండా చేసే దానాన్ని మధ్యమ దానమని అంటారు. సమాజంలో వున్న నాలుగు వర్ణాలవారికి, నాలుగు ఆశ్రమాల వారికీ వారు ఆచరించాల్సిన ధర్మం శ్రుతి స్మృతులలో ప్రత్యేకంగా చెప్పబడింది. శిష్టాచారానికి విరుద్ధంకానిది ఏదైనా ధర్మమే.

**11. సన్న్యాసం :** ఒకరికి ఇష్టంలేని వస్తువుల మీద విద్వేషంలేక పోవటం, ఇష్టమైన దాన్ని గొప్పగా అభినందించటం, ప్రేమ బాధలు, విషాదాల నుంచి ఉదాసీనత విరక్తి, అన్ని రకాల కర్మల పరిత్యాగం ఈ లక్షణాలన్నీ కలిగివుండటమే సన్న్యాసధర్మం అని చెప్పబడింది.

**12. జ్ఞానం :** ఈ విషయాలన్నీ తెలుసుకోవటం, ధర్మాచరణ మార్గాల గురించి సంపూర్ణమైన అవగాహన కలిగివుండటం అనే దానినే జ్ఞానం అంటారు.

ఈ విధంగా ధర్మం అనేది వివిధరూపాలుగా వుంటుంది. శిష్టులైన పూర్వఋషులు ఆచరించిన సనాతన ధర్మమే అందరికీ అనుసరణీయం. కనుక అందరూ ధర్మజ్ఞానాన్ని కలిగి ధర్మాచరణకు పూనుకోవాలి.

## 49 మంది మరుత్తుల వృత్తాంతం

ఒకనాడు కశ్యపుడి భార్య అయిన దితి. తన భర్తని "స్వామీ! నాకు ఇంద్రుణ్ణి సంహరించగలిగే ప్రచండ శక్తి కలిగిన పుత్రుణ్ణి ప్రసాదించండి అని ఒక కోరిక కోరింది. ఆమె కోరిక విని కశ్యపుడు ఆశ్చర్యపోయాడు. అయినా వరం ఇస్తానని మాట ఇచ్చాడు కనుక ఆమెతో "దేవీ! వెయ్యి సంవత్సరాలు నీవు శుచిగా ఉంటే మన్మథుడు లాంటి అందమైన వాడిని నీవు కోరినట్టు

ఇంద్రుణ్ణి సంహరించగలిగే శక్తిమంతుణ్ణి పుత్రుడుగా పొందుతావు” అని ఆశీర్వదించి, ప్రేమగా ఆమెని ఒక్కసారి కౌగిలించుకుని వెళ్ళిపోయాడు కశ్యపముని.

భర్త ఇచ్చిన వరంతో ‘దితి’కి ఎంతో ఆనందం కలిగింది. వెంటనే ఆమె కుశప్లవనానికి వెళ్ళి దారుణమైన తపస్సు ఆచరించింది. దితి, కశ్యపుల మధ్య జరిగిన సంభాషణ ఇంద్రుడు విన్నాడు. నెమ్మదిగా కుశప్లవనంలో తపస్సు చేసుకుంటున్న ‘దితి’ దగ్గరకి వచ్చాడు. ఆమెతో “తల్లీ! నేను మీకు సేవలు చేస్తాను. నిత్యం మీకు కావలిసిన పనులన్నీ చేసిపెడతా నన్ను అనుమతించండి” అని కోరాడు. విషయం తెలియని ‘దితి’ నాయనా! అలాగే చేయి అని అనుమతించింది. ఆనాటి నుంచి ఇంద్రుడు దితికి సేవలు చేయటం ప్రారంభించాడు.

దితి చేస్తున్న వేయి సంవత్సరాల వ్రతం ఇంకా పది సంవత్సరాలలో ముగియబోతోంది. ఒకనాడు దితి ఇంద్రుణ్ణి పిలిచి నాయనా! త్వరలోనే నీవు నీ సోదరుణ్ణి చూడగలవు. నాకు పుట్టబోయే నీ సోదరుడు నిన్ను జయించాలనే కోరికతో వున్నా. అతన్ని నీ సేవలోనే వినియోగిస్తాను. అతడితో కలిసి నీవు ముల్లోకాలకీ అధిపతిగా వుంటావు. అందరినీ జయిస్తావు అని ఆశీర్వదించింది. అప్పుడు ఆకాశంలో సూర్యుడు మధ్యభాగానికి వచ్చాడు. దితికి గర్భభారంతో ఒక్కసారిగా నిద్రముంచుకు వచ్చింది. వెంటనే ఆశ్రమంలో మోకాళ్ళ మీద తలవంచి శిరోజాలు పాదాల మీద పడుతుండగా అలాగే నిద్రపోయింది. దానితో ఆమె నాభిదిగువ భాగమంతా అశుచిగా అయ్యింది. ఇంద్రుడు అది సరైన సమయంగా భావించాడు.

ఇప్పటిదాకా పరమపవిత్రంగా శుచిగా వున్న ‘దితి’ ప్రస్తుతం అశుచిగా వుంది కనుక ఇప్పుడేదైనా చేయాలి అని అనుకుని సూక్ష్మశరీరంతో ఆమె గర్భంలోకి ప్రవేశించాడు. ఆ గర్భంలో ఆయనకి మహాశక్తి వంతుడైన బిడ్డ కనిపించాడు. అతడు తనని చంపటానికి పుట్టబోయేవాడని గ్రహించి,

తన వజ్రాయుధంతో ఆ పిండాన్ని ఏడుముక్కలుగా ఛేదించాడు. ఆ పిండాలు ఏడుస్తుంటే వాటిని వారించి తిరిగి ఒక్కొక్క పిండాన్ని మరల ఏడు ముక్కలు చొప్పున ఖండించాడు.

అంతలో దితికి మెలకువ వచ్చింది. గర్భంలోపల జరుగుతున్న విషయం గ్రహించింది. వెంటనే పుత్ర ప్రేమతో నాయనా ఇంద్రా! నా గర్భంలోని పిండాన్ని నరకకు అని వేడుకుంది. తల్లి మాటమీద గౌరవంతో వారిని ఇంకా ఖండించటం ఆపి ఇంద్రుడు బైటికి వచ్చాడు. తల్లితో "జననీ! నీవు అశుచిగా వున్నప్పుడు నేను నీ గర్భంలోకి ప్రవేశించాను. నీ ద్వారా పుట్టబోయేవాడు యుద్ధంలో నన్ను జయిస్తాడని తెలిసి లోపలికి వెళ్ళి వాడిని ఖండించాను దయచేసి నన్ను క్షమించు" అని ప్రాథేయపడ్డాడు.

ఆ ఇంద్రుడి వల్ల తన గర్భం విచ్ఛిన్నం కావటంతో 'దితి'కి ఎంతో దుఃఖం కలిగింది. బాధని దిగమింగుకుని ఇంద్రుడితో "నాయనా! నా అపరాధం వల్లే(శుచిగా ఉండకపోవటం)నా గర్భస్థపిండం నీ చేత ఛేదించబడింది. ఇందులో నీ అపరాధం ఏమీలేదు. నేను కోరరాని వరాన్ని కోరాను. ఇప్పుడు వగచి ఏం లాభం. నాకు పుట్టబోయే బిడ్డ నీకు శత్రువు. నీ శత్రువుని నీవు ఖండించటంలో దోషం ఏముంటుంది. నాయనా! నాకు పుట్టబోయే పుత్రులకి ఏదో ఒక శ్రేయస్సుని కలిగించు. వారివల్ల నీకు ముప్పు ఏనాటికీ వుండదు. నీకు సేవకులుగా వుంటారు. వారు ఎలా వుండాలంటే –

స్వర్గంలో నా కుమారులందరికీ ఏడు స్థానాలు ఉండాలి. నా కుమారులు అందరూ ఈ ఏడు స్కంధాలలో సంచరించాలి. వారందరూ మరుత్తులుగా కీర్తి పొందాలి. వారంతా ఒక్కోగణంలో ఏడుగురు చొప్పున ఏడు గణాలతో 7×7=49 మంది నివసించాలి. వీటిలో మొదటి స్కంధం భూమిమీద, రెండవస్కంధం సూర్యుడిలో, మూడోస్కంధం చంద్రుడి మీద, నాలుగో స్కంధం ఆకాశంలో వున్న జ్యోతిషాం గణంలో (నక్షత్రమండలం) ఐదోస్కంధం గ్రహాలలో, ఆరోస్కంధం సప్తర్షి మండలంలో, ఏడోస్కంధం ధృవమండలంలో వుండాలి. నా కుమారులందరూ ఈ సప్తస్కంధాలలో స్వేచ్ఛగా సంచరించాలి.

కుమారా! నాకు పుట్టబోయే 49 మంది కుమారులు ఏడుగణాలుగా ఉంటారు. వీరిలో మొదటి గణానికి చెందిన ఏడుగురు పుత్రులు భూమి నుంచి మేఘమండలం దాకా వ్యాపించిన 'అహవము' అనే మండలంలో సంచరిస్తారు. రెండో గణానికి చెందిన ఏడుగురు పుత్రులు మేఘమండలం నుంచి సూర్యమండలం దాకా వ్యాపించిన 'పహవము' అనే ప్రాంతంలో సంచరిస్తారు.

మూడో గణానికి చెందిన పుత్రులు, సూర్యలోకం పైభాగం నుంచి చంద్రుడి క్రింద వరకూ వ్యాపించిన 'ఉద్వహము' అనే పథంలో విహరిస్తారు. అలాగే నాలుగో గణానికి చెందినవారు చంద్రుడి కన్నా పైనుంచి నక్షత్ర మండలం వరకూ వ్యాపించిన 'సంవహము' అనే మండలంలో సంచరిస్తారు.

అలాగే అయిదో గణానికి చెందిన నా పుత్రులు నక్షత్రమండలం నుంచి గ్రహమండలందాకా వ్యాపించిన 'విహవము' అనే మండలంలో విహరిస్తారు. ఇక ఆరోగణానికి చెందిన కుమారులు గ్రహమండలం పైనుంచి సప్తర్షి మండలందాకా వ్యాపించిన 'అనుహవం' అనే పథంలో సంచరిస్తారు.

చివరి గణమైన ఏడోగణంలో వుండేవారు. సప్తర్షి మండలానికి పైనుంచి ధ్రువమండలం దాకా వ్యాపించిన 'పరివహం' అనే పేరుతో ప్రసిద్ధమైన మండలంలో సంచరిస్తారు. కుమారా! ఇంద్రా నాపుత్రులైన మరుద్గణాల పేర్లు ఇవి.

**1. మొదటిగణం :** 1.శుక్రజ్యోతి 2.సత్య 3.సత్యజ్యోతి 4.చిత్రజ్యోతి 5.జ్యోతిష్మంతుడు 6.సుతవుడు 7.చైత్యుడు – వీరు మొదటి గణానికి చెందిన సప్తమరుత్తులు.

**2. రెండోగణం :** 1.ఋతజిత్తు 2.సత్యజిత్తు 3.సుషేణుడు 4.సేవజిత్తు 5.సుతమిత్రుడు 6.అమిత్రుడు7.సురమిత్రుడు – వీరు రెండో గణానికి చెందిన సప్తమరుత్తులు.

**3. మూడోగణం :** 1.ధాతువు 2.ధనదుడు 3.ఉగ్రుడు 4.భీముడు 5.వరుణుడు 6.అభియుక్తాక్షికుడు 7.సాహ్వయుడు–ఈ ఏడుగురూ మూడో గణానికి చెందిన మరుత్తులు.

**4. నాలుగోగణం :** 1.ఇందులో వున్న మరుత్తుల పేర్లు చెప్పబడలేదు.

**5. ఐదోగణం :** 1.ఈదృక్కు 2.అన్యాదృక్కు 3.సిరత్ 4.ద్రుమ 5.వృక్షకం 6.మితుడు 7.సమితుడు వీరు ఐదోగణానికి చెందిన మత్తులు.

**6. ఆరోగణం :** 1.ఈఋక్కు 2.పురుషుడు 3.నాన్యాదృక్కు 4.సమచేతనుడు 5.సమ్మితుడు 6.సమవృత్తుడు 7.ప్రతీహర్త – ఈ ఏడుగురు ఆరోగణానికి చెందిన మరుత్తులు.

**7. ఏడోగణం :** ఈ గణానికి చెందిన మరుత్తుల పేర్లు చెప్పబడలేదు.

"నాయనా! నీవు ఛేదించిన నా 49మంది పుత్రులూ ఆయా మండలాల్లో యథేచ్ఛగా సంచరింతురు గాక! నీకు శుభం కలుగుగాక! దేవతలతో సమానంగా ఈ మరుద్గణాలు వాయుపథంలో విహరించుగాక! ఇదే నేను కోరుకున్నది" అని అన్నది.

దితిమాటలు విన్న దేవేంద్రుడు అమ్మా! నీవు కోరినట్టే జరుగుతుంది. మహాత్ములైన నీ కుమారులు నా సోదరులు దేవతలతో సమానంగా యజ్ఞయాగాలలో హవిస్సులు స్వీకరిస్తారు. మరుత్తులందరూ దేవతలే. మహాశక్తివంతులైన వీరు అన్నిలోకాల్లో శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలు పొందుగాక అని వారికి వరాన్నిచ్చాడు. అదివిన్న దితి ఎంతో సంతోషించి ఇంద్రుణ్ణి ఆశీర్వదించింది.

మరుతాంశ్చశుభంజన్మశ్రుణుయాద్యః పఠేచ్ఛవా ।
వాదేవిజయమాప్నోతి లబ్ధాత్మాచ భవత్యుత ॥

*(శ్లో॥ 106, అధ్యా6)*

పరమపవిత్రమైన ఈ మరుత్తుల చరిత్రని పఠించినవారు వాదాల్లో విజయాన్ని పొందుతారు. కోరిన కోరికల్ని సాధించుకుంటారు.

# దను వంశం

పూర్వం దనువు అనే గొప్ప రాక్షసుడుండేవాడు. అతడికి అమితబల పరాక్రమవంతులైన పుత్రులున్నారు. వారిలో గొప్పవాడు దీక్షతో తపస్సులు చేసి ఎన్నెన్నో వరాలు పొందారు. వారు సత్యసంధులు, మహాక్రూరులు, దేవతలమీద యుద్ధాలు చేసి ఎన్నోసార్లు విజయాన్ని పొందారు. మహాబలవంతులైన ఆ అసురులు వేదాధ్యయనం చేయటమేకాదు నిత్యాగ్ని హోత్రాలను కూడా దీక్షగా చేసేవారు. వంశానుగతంగా వచ్చిన దనువుపుత్రుల పేర్లు ఇవి.

ద్విమూర్ధుడు, శంబరుడు, దుందుభి, అయోముఖుడు, మఘవంతుడు, శుకథుడు, విభువు, శంకుకర్ణుడు, విపాదుడు, గవిష్ఠుడు, కపిలుడు, వామనుడు,మయుడు, మరీచి, అసిపుడు, మహాహయుడు, అశిరసుడు, భృశి, విక్షోభుడు, సుకేతుడు కేతువీర్యుడు, శతాహ్వాయుడు, ఇంద్రజిత్తు, ద్వివిదుడు, భద్రుడు, దేవజిత్, ఏకచక్రుడు, మహాబాహువు, తారకుడు, వైశ్వానరుడు, పురోముడు, ప్రాపణుడు, మహాశిరుడు, స్వర్భానుడు, వృషపర్వుడు, పురుండుడు, ధృతరాష్ట్రుడు, సూర్యుడు, చంద్రముడు, ఇంద్రతాపసుడు, సూక్ష్ముడు, నిచంద్రుడు, చూర్ణనాభుడు మొదలైనవారు. వీరందరూ దనువంశీయులు వీరికుమారులు. ఆ కుమారులకు పుట్టిన కుమారులు మనుమలు, మునిమనులు ఇలా వీరు అసంఖ్యాకంగా వ్యాపించారు. ఈ విధంగా దనువు సంతతి దానవులుగా పరిగణించబడ్డారు. దితికుమారులు దైత్యులుగా ఖ్యాతి పొందారు.

దైత్యులకు దానవులకూ జన్మించిన మహాసురులు అమితబల పరాక్రమవంతులు. దనువు వంశానికి చెందిన విప్రచిత్తికి, దైత్యవంశానికి చెందిన సింహికకు 1.శలుడు 2.శలభుడు 3.సవ్యుడు 4.ఇల్వలు 5.సముచి 6.వాతాపి 7.సుపింజకుడు 8.హరకల్పుడు 9.కాలనాభుడు 10.భౌముడు 11.కనకుడు 12.రాహువు అనేవారు జన్మించారు. వీరిలో సూర్యుణ్ణి మింగగలిగే రాహువు పెద్దవాడు.

ఈ సింహికాపుత్రులు చాలా దారుణమైనవారు. వారంతా బ్రాహ్మణ హంతకులు, మహాక్రూరులు. ఈ సింహికాగణాలు మొత్తం పదివేలుదాకా వుంటాయని చెబుతారు. ఈ పదివేల మందీ కాలాంతరంలో జమదగ్ని మహర్షి కుమారుడైన పరశురాముడి చేత చంపబడ్డారు.

## ప్రముఖగణాల వర్ణన

ఊర్ధ్వలోకాల్లో నివసించే గణాలలో ప్రముఖమైనవి గంధర్వ, అప్సర, విహగ, సర్ప, యక్ష, రాక్షస,పిశాచ, యాతుధాన మొదలైనవి. ఒక్కో గణంలో ఎంతోమంది ఆ గణానికి చెందినవారుంటారు. వారిలో లోక ప్రసిద్ధమైనవారు కూడా వుంటారు.

**1. గంధర్వులు :** గంధర్వులు–అప్సరసలు అనేవారు 'ముని' అనే మహానుభావుడి సంతానం. వీరిలో దేవ గంధర్వులుగా భీమసేనుడు, ఉగ్రసేనుడు, సుపర్ణుడు, వరుణుడు, ధృతరాష్ట్రుడు, గోమంతుడు, సూర్యవర్చసుడు, పత్రవంతుడు, అర్కపర్ణుడు, ప్రియుతుడు, భీముడు, చైత్రరథుడు, విఖ్యాతుడు, సర్వజిత్, త్రయోదశుడు, శాలిశిరుడు, పర్జన్యుడు, కలి, నారదుడు. కీర్తించబడ్డారు. ఈ పదహారు మంది గంధర్వులకీ ఇరవైనాలుగు మంది అప్సరసలు చెల్లెళ్ళుగా వున్నారు.

**2. అప్సరసలు :** పదహారుమంది గంధర్వులకి చెల్లెళ్ళైన అప్సరసలు అరుణా, అనపాయా, విమనుష్యా, వరాంబరా, మిశ్రకేశీ, అసిపర్ణినీ, అలంబుషా, మరీచిః, శుచికా, విద్యుత్పర్ణా, తిలోత్తమా, అద్రికా, లక్ష్మణా, క్షేమా, దివ్యా, రంభా, మనోభవా, అసితా, సుబాహూ, సుప్రియా, సుభుజా, పుండరీకా, అజగంధా, సుదతీ, సురసా అనేవారు మొత్తం ఇరవైనాలుగు మంది వున్నారు. గంధర్వులందరిలో గొప్పవారుగా హాహా, హూహూ, సుబాహువు, తుంబురుడు కీర్తిగాంచారు. ఈ విధంగా ముని సంతానమైన గంధర్వులు – అప్సరసలు పేర్కొనబడ్డారు.

అప్సరసల్లో ముని కుమార్తెలేకాక మరికొంతమంది సుప్రసిద్ధమైన అప్సరసలు కూడా వున్నారు. జ్యోతిష్టోమ, ఆచారా, దారుణా, వరూథా, వరేణ్యా వసురుచీ, సురుచీ, సుకేశీ, అరూపా, సుభగా, భాసీ, మనువంతీ అనే అయిదుగురు తుంబురుడి కుమార్తెలు. కృతస్థల, ఘృతాచీ, మేనకా, విశ్వాచీ, ప్రమ్లోచా, అనుమ్లోచా, ఊర్వశీ మొదలైనవారు. వీరేకాక అప్సరసల్లో 14మంది పుణ్యాత్ములైనవారున్నారు.

1. ఆహృతులు–బ్రహ్మమనస్సునుంచి పుట్టినవారు. వీరు దివ్య సౌందర్యవతులు 2. కురవలు–వీరు పవిత్రమైన చంద్రకిరణాలనుంచి జన్మించారు 3. స్రుక్కులు–వీరు యజ్ఞం నుంచి ఆవిర్భవించారు 4. బర్హలు – కుశపతి ద్వారా జన్మించారు 5. మృగులు–భూమినుంచి పుట్టారు 6. రుక్కులు–వీరు విద్యుత్తు నుంచి జన్మించారు 7. భీరులు–మృత్యువుద్వారా పుట్టారు 8. శోభయంతులు–ఈ అప్సరసలు కామం నుంచి జన్మించారు. 9. శోభవతులు - మరుద్గణాల నుంచి జన్మించారు 10. వేగవతలు - రిష్టకుమార్తెలు 11. ఊర్జలు–అగ్నికి పుట్టిన కుమార్తెలు 12. యువతులు - సూర్యరశ్మి నుంచి ఆవిర్భవించారు 12. అప్సరసలు - అమృతం నుంచి పుట్టారు 14. ముదలు–వీరు వాయువుద్వారా జన్మించారు.

ఈ విధంగా ఇంకా ఎంతమందో అప్సరసలున్నారు. వారిలో చాలామంది దేవతలకు, ఋషులకు పత్నులు. కొందరికి తల్లులు ఈ అప్సరసలు అందరికీ సమభావనలు. ఒక పరమేశ్వరుడు తప్ప దేవతలు, ఋషులు చాలామంది వారితో కామసంబంధాన్ని కలిగినవారే. పర్వతుడు–నారదుడు అనేవారు అప్సరసల వల్ల జన్మించినప్పటికీ వారి జన్మలో దేవఋషులు సంయోగం వుండటం వల్ల వారిద్దరూ దేవతలతో సమానులుగా పరిగణించబడ్డారు.

**3. నాగులు :** కద్రువగమాత వందమంది నాగుల్ని కన్నది. ఆ నాగులే పాతాళంలో వుండే భూమిని భరిస్తున్నారు. వారిలో ప్రధానమైనవారు శేషుడు, వాసుకి, తక్షకుడు, వీరు మహాత్ములు. ఆకాశ సంచారం చేయగల సమర్థులు.

ఇక మిగిలిన వారిలో – అకర్ణుడు, హస్తికర్ణుడు, పింజరుడు, అర్యకుడు, ఐరావతం, మహాపద్మం, కంబలం, అశ్వతరం, ఏలాపత్రం, శంఖుడు, కర్కోటకుడు, ధనుంజయుడు, మహాకర్ణుడు, మహానీలుడు, ధృతరాష్ట్రుడు, బలాహకుడు కరవీరుడు, పుష్టదంష్ట్రుడు, సుముఖుడు, దుర్ముఖుడు, సునాముఖుడు, దధిముఖుడు, కాళీయుడు, కపిలుడు, అంబరీషుడు, కాద్రవేయుడు తదితర మహాసర్పాలున్నాయి.

**4. రాక్షసులు :** పూర్వం 'ఖశ' అనే ఆమె ఇద్దరుపుత్రుల్ని కన్నది. పుట్టినవారిద్దరూ వికృతరూపంతో వున్నారు. వారిలో పెద్దకుమారుడు నాలుగు చేతులు, నాలుగుకాళ్ళతో శరీరమంతా రోమాలతో, బానపొట్టతో, పెద్దపెద్ద చెవులతో వికృతమైన అవయవాలతో జన్మించాడు. ఇక రెండోపుత్రుడు ఉషఃకాలంలో జన్మించాడు. అతడు ఎర్రటి కళ్ళతో పెద్దముక్కుతో, హ్రస్వశరీరంతో, 8 కోరలతో జడలుగా అల్లుకున్న జుట్టుతో మహాస్కందుడుగా మహావికారంగా పుట్టాడు.

పుట్టిన వెంటనే ఆ ఇద్దరూ వృద్ధి చెందటం ప్రారంభించారు. క్రమంగా వారి అవయవాలు పెద్దవయ్యాయి. వారికి ఆకలివేయటం ప్రారంభించింది. ఎదురుగా తల్లి 'ఖశ' వారికి కనిపించింది. యుక్తాయుక్తాలు మరిచి ఆమెనే భక్షించాలని అనుకున్నాడు పెద్దకొడుకు. వెంటనే అతడు 'ఖశ' దగ్గరకి వెళ్ళి "అమ్మా! మాకు చాలా ఆకలిగా వుంది. మా ప్రాణాలు నిలుపుకోవటానికి నిన్ను భక్షిస్తాము అన్నాడు. వెంటనే చిన్న కొడుకు అన్నను వారిస్తూ "సోదరా! తల్లి తండ్రుల్ని రక్షించవలసినవాడివి నీవే ఇలా భక్షించాలని భావిస్తే ఎలా! మనకి తండ్రి కనిపించలేదు. కనీసం కనిపించే ఈ తల్లినైనా రక్షించు" అని వారించాడు. అతడా మాటలు అన్న వెంటనే వారి తండ్రి అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

తండ్రిని చూడగానే ఆ పుత్రులిద్దరూ భయపడిపోయారు. ఒక్కసారిగా ఇద్దరూ ఏకమయ్యారు. వెంటనే తల్లి శరీరంలో లీనమయ్యారు. వచ్చిన ఆ ఋషి తన పుత్రులు అత్యంత వికారంగా వుండటం గమనించాడు.

వెంటనే తన భార్య అయిన 'ఖశతో' దేవీ నీ పుత్రులు నేను వచ్చేముందు నీతో ఏ విషయం గురించి మాట్లాడారు అని ప్రశ్నించాడు. ఆమె వారిద్దరి సంభాషణ ఆయనకు చెప్పింది. వారిలో క్రూరుడైన మొదటివాడు తనని 'యక్ష' అనగా నములుతాను అన్న అర్థంలో ఉపయోగించాడు. ఇక రెండో కుమారుడు తల్లిని రక్షించే ఉద్దేశంతో అన్నునువారిస్తూ 'రక్ష' అని అన్నాడు అని చెప్పింది. ఈ వృత్తాంతం విన్న ఋషి మొదటి పుత్రుడికి 'యక్షుడు' అని, రెండో కుమారుడికి 'రాక్షసుడు' అని నామకరణం చేసాడు. ఆ విధంగా వారి ప్రవృత్తుల్ని అనుసరించి వారిద్దరికి ఆ పేర్లను పెట్టాడు ఋషి.

తన కుమారులు బాగా ఆకలిగా ఉండటం గమనించాడు. ఆయనకి ఆశ్చర్యం కలిగింది. వారిద్దరి ఆకలిని తీర్చాలని భావించి రక్తాన్ని, కొవ్వుని వారికి ఆహారంగా ప్రసాదించాడు. వారితో "యక్ష–రాక్షసులారా మీ చేతి స్పర్శవల్ల అన్నిచోట్ల రక్తం మాంసం మీకు లభిస్తుంది. మీకు దేవతలు, బ్రాహ్మణులు ఆహారంగా అవుతారు. రాత్రిపూట మీకు బలం ఎక్కువగా ఉంటుంది. పగటిపూట మీరు బలహీనులుగా వుంటారు. మీరు మీ తల్లిని రక్షించండి అదే మీకు పరమధర్మం అని చెప్పి అదృశ్యమయ్యాడు ఆ ఋషి.

ఇక ఆనాటినుంచి సహజంగానే వికృతరూపాలు, వికృత స్వభావులైన వారిద్దరూ సకల ప్రాణుల్ని హింసించటం ప్రారంభించారు. వారు మాయావులు, కామరూపాన్ని పొందగలరు. రోగాలు వారికుండవు. పితరుల్ని, ఋషుల్ని గంధర్వుల్ని, మనుషుల్ని, సర్పాలని తినాలనే కోరికతో వుంటారు. వారంతా రాత్రిపూటే సంచరించేవారు. అలాంటి భయంకరులని చూసి ఇంద్రుడు తదితర దేవతలు ఎంతో క్షోభ పొందారు. 'ఖశ' కుమారులిద్దరూ అలాయథేచ్ఛగా రాత్రుళ్ళు సంచారం చేస్తున్న సమయంలో అజుడు –షండుడు అనే రెండు పిశాచాలు వారికి ఎదురొచ్చాయి. ఆ పిశాచాలు రెండు 'కపి' అనే పిశాచుడి పుత్రులు. మహాశక్తి మంతులు భీకరాకారులు, వారిద్దరూ తన కుమార్తెలతో కలిసి వస్తున్నారు. ఈ ఇద్దర్నీ చూసి తమకుమార్తెలకు తగిన వరులుగా భావించారు.

షండుడి కుమార్తెపేరు 'బ్రహ్మాధన' (బ్రాహ్మణుడు ఆహారంగా కలది) అజుడి కుమార్తె పేరు 'జంతుధన' (జంతువులు ఆహారంగా కలది) వీరిద్దరినీ 'ఖశ' పుత్రులకిచ్చి ఘనంగా వివాహం చేసారు. కొంతకాలానికి జంతుధన అనే పిశాచం 'యాతుధాన' అనే కుమార్తెని కన్నది. అలాగే బ్రహ్మాధన అనే పిశాచం కూడ ప్రహీతి అనే కూతుర్ని కన్నది.

ఆ ఇద్దరు పిశాచ స్త్రీలద్వారా క్రమక్రమంగా రాక్షసవంశం వృద్ధిచెంద సాగింది. పుత్రపౌత్ర పరం పరంగా వ్యాపించిన రాక్షసవంశంలో హేతి, ప్రహేతి, ఉగ్ర, పౌరుషేయ మాల్యవంతుడు, సుమాలి, పులోముడు, లవణాసురుడు, క్రూరుడు, వికృతుడు, మేదాసుడు, వపాసుడు, విఘ్నుడు శమనుడు, దురాచారుడు, నికుంభుడు, సర్పుడు, యజ్ఞాహేతుడు, బ్రహ్మాపేతుడు, అంబుకుడు, కేలి తదితర బ్రహ్మారాక్షసులందరూ భూమిమీద బ్రహ్మారాక్షస స్త్రీల వంశంలో జన్మించారు.

ఈ విధంగా రాక్షసుల్లో అసంఖ్యాకమైన గణాలు ఏర్పడ్డాయి. 1.అలంబేయగణం 2.ఔత్కచేయగణం 3.ఐత్కార్షేయ గణం 4.నైర్రుత గణ అనేవి వీటిలో ప్రధానమైనవి. ఈ గణాల్లోవున్న వారందరూ పరమక్రూరులు. యక్షులు రాక్షసులు ఇద్దరూ తామసప్రవృత్తి కలిగినవారే. యక్షులు మానవుల రక్తమాంసాలను తమకంటి చూపుతోనే పీల్చి త్రాగుతారు. రాక్షసులు మానవుల శరీరంలోకి ప్రవేశించి రక్తాన్ని కొవ్వుని తాగుతారు. ఇక పిశాచాలు మానవుల శరీరం నుంచి రక్తాన్ని కొవ్వుని పీల్చి పీడించి త్రాగుతారు. గంధర్వులు అప్సరసలు దేవతలకన్నా మూడు పాదాలు తక్కువ స్థాయికి చెందినవారు. వారికన్నా తక్కువ స్థాయిలో వరుసగా గుహ్యకులు (యక్షులు), రాక్షసులు, పిశాచులు వుంటారు. ఈ విధంగా దేవ, గంధర్వ, పిశాచ, అప్సర, గుహ్యక (యక్ష) రాక్షస గణాలన్నీ దేవయోనుల ద్వారా జన్మించాయి.

**5. యక్షులు :** యక్షజాతికి చెందిన ఒకడు పంచచూడ అప్సరసల్లో ఒకతైన క్రతుస్థలను ప్రేమించాడు. ఆమెను ఎలాగైనా పొందాలని దేవతల ఉద్యానవనాలు,

నివాసాలు అన్నీ వెతికాడు చివరికి ఆమె నందనోద్యానవనంలో అతడికి కనిపించింది. అక్కడ ఇతర అప్సరసలతో కూర్చుని సల్లాపాలు చేస్తోంది. వెంటనే తాను గంధర్వుడైన వసురుచి రూపాన్ని ధరించి ఆమె దగ్గరకి వెళ్ళాడు. ఆమె అతన్ని గంధర్వుడే అనుకుంది. ఆమెను ప్రేమిస్తున్నాని చెప్పాడు యక్షుడు. ఆమె అభ్యంతరం చెప్పలేదు. తమకం ఆపుకోలేక ఆమెని గాఢంగా కౌగిలించుకున్నాడు. కామాతురం వల్ల వెంటనే వారికి సద్యోజాతుడుగా ఒక కుమారుడు జన్మించాడు. పుట్టిన వెంటనే వృద్ధి చెందిన అతడు నేను నాభిని మహారాజును అని చెప్పి గంధర్వుడి రూపంలో వున్న తన తండ్రికి నమస్కరించాడు.

అత్యంత ఆనందాన్ని పొందిన యక్షుడు వెంటనే తన నిజరూపాన్ని పొందాడు. అది చూసి చుట్టు ప్రక్కలున్న ఆ గంధర్వ స్త్రీలందరూ భయంతో పారిపోయారు. (యక్షులు–రాక్షసులు నిగూఢరూపంలో వున్నప్పటికీ, వారు నిద్రపోతున్నప్పుడు, బాగా కోపంవచ్చినప్పుడు, మరణించినప్పుడు భయానికి గురైనప్పుడు, అత్యంత ఆనందాన్ని, హర్షాన్ని పొందినప్పుడు తమ నిజస్వరూపాన్ని పొందుతారు.)

నిజరూపాన్ని ధరించిన యక్షుడు క్రతుస్థలతో దేవీ! భయపడకు. నేను నీ భర్తను, నాతోరా! మన నివాసానికి వెళదాం అన్నాడు. అతడి మాటలు మన్నించకుండా క్రతుస్థలకూడా వెళ్ళిపోసాగింది. తల్లివెళ్ళిపోవటం చూసి ఆమెకి పుట్టిన కుమారుడు ఆమెని వెంబడించి బ్రతిమిలాడి తిరిగి వెనక్కి తీసుకువచ్చాడు. అప్పుడు ఆమెతో వున్న అప్సరగణాలన్నీ క్రతుస్థలంతో 'నేటినుంచీ నీవు యక్షులకు తల్లివి” అని అన్నారు. తరువాత యక్షుడు అతడి కుమారుడు తల్లితో సహా యక్షలోకానికి వెళ్ళారు.

యక్షుడికి అప్సరసలకి జన్మించిన ఆ కుమారుడి పేరు రజతనాభుడు. న్యగ్రోథం అనగా మఱ్ఱిచెట్టు. అది యక్షుల నివాసస్థానం. దానినే రోహిణం అనికూడా అంటారు. ఆరజతనాభుడు యక్షులందరికీ పితామహుడు. ప్రహ్లాదుడనే రాక్షసుడి కుమార్తె మణివరను అతడు వివాహం చేసుకున్నాడు.

వారిద్దరికీ మణిభద్రుడనే యక్షుడు జన్మించాడు. అతడు పరాక్రమంలో ఇంద్రుడంతటివాడు. అతడు అక్కచెల్లెళ్ళైన పుణ్యజనని, దేవజనని అనే ఇద్దరు స్త్రీలని వివాహం చేసుకున్నాడు.

వీరిలో మొదటి భార్య పుణ్యజనని 20 మంది పుత్రుల్ని కన్నది. వారిలో సిద్ధార్థుడు, రుచకుడు, సూర్యతేజుడు, మణిమంతుడు, పింగాక్షుడు, చంద్రప్రభుడు అనేవారు ప్రముఖులు. రెండోభార్య దేవజననికి పూర్ణభద్రుడు, హైమవంతుడు, పద్మవర్ణుడు, సుచంద్రుడు, పూర్ణమానుడు వంటి మరికొందరు పుత్రులు జన్మించారు. వీరందరూ ఎంతో అందమైన వారు వివిధ రూపాలు ధరించగలిగిన వారు. యక్షలోకంలో గుహ్యకులుగా ఎంతో ప్రసిద్ధిచెందారు. తరువాత వారంతా వంశాభివృద్ధిని చేయటంతో యక్షులు (గుహ్యకుల) సంఖ్య అసంఖ్యాకంగా పెరిగిపోయింది.

## శ్రాద్ధకర్మలో పవిత్ర అపవిత్ర వస్తువులు

రాత్రి సమయాలలో శ్రాద్ధము చేయకూడదు. రాహువు కనిపించినప్పుడు తప్పకుండా శ్రాద్ధం చేయాలి. అనగా గ్రహకాలంలో శ్రాద్ధవిధిని ఆచరించాలి. అది అత్యంత పుణ్యప్రదం. ఎవడైతే పవిత్ర గ్రహణ కాలంలో (సూర్య) శ్రాద్ధకర్మని ఆచరించడో వాడు ఊబిలో దిగబడ్డ వృషభంలాగా నశిస్తాడు. అదే గనుక గ్రహణ సమయంలో శ్రార్ధవిధిని ఆచరించినవాడు అత్యధిక పుణ్యాన్ని పొంది తరిస్తాడు. వైశ్వదేవ క్రతువులాంటి మరికొన్ని క్రతువుల్లో కొమ్ము విరిచిన ఖడ్గమృగ మాంసాన్ని సమర్పించాలి. అది దోషం కాదు. పూర్వం దేవేంద్రుడు సోమరసం త్రాగుతున్నప్పుడు కొన్ని బిందువులు భూమిమీద పడ్డాయి. వాటినుంచి 'శ్యామాకము' అనే ధాన్య పుట్టింది. అలాగే ఇంద్రుడి ముక్కుకి అంటుకొని ఇవతలకి వచ్చిన సోమరసం నుంచి 'ఇక్షు' అనగా 'చెఱుకు' పుట్టింది. అందుకే చెఱుకు శీతలంగా, స్నిగ్ధంగా, మధురంగా వుంటుంది. పితృకార్యాలలో శ్యామాకధాన్యాన్ని, చెఱుకుని ఉపయోగించటం శ్రేయస్కరం.

వీటితో పాటు స్మృతుల్లో ప్రియంగువులు, మాషాలు, హరితాలు కూడా శ్యామాక ధాన్యంతో సమానమైనవని చెప్పటం జరిగింది.

పితృకార్యాలలో నల్లని మినుములు, నువ్వులు, బార్లీ, ధాన్యం, బియ్యం శ్రేష్ఠమైనవి. ఉపయోగించ తగ్గవి. మహాయవలు, నిష్పావలు, మధూలికలు, కృష్ణయవలు, నల్లనిలోహాలు, రాజమాషధాన్యాలు వంటివి నిషేధించాలి. అనగా వాడకూడదు.

## శ్రాద్ధంలో వాడదగిన వస్తువులు :

మసూరాలు, కుసుమధాన్యం, వర్షాకాలంలో లభించే అతియవలు, వృషకాలు (మొక్క) వాసకం, బిల్వం, ఆమలకం(ఉసిరి) మాధ్వీకం (ద్రాక్ష) పనస, ఆమ్రాతకం, దాడిమ(దానిమ్మ) ఖర్జూరం, ఆమ్రఫలం (తామరపువ్వు) తమాలం, శతకందం, కాలశీకం, భూరిపూర్ణం, సువర్చల, మాంసాక్షం, దువిశాకం, కషాలకం, కణ, ద్రాక్ష,లకుచం, చోచం, అలాబు (గుమ్మడి) గ్రీవాకం, వీరము, కర్కంధువు, మధుసాహ్వాయం, నారికేళం (కొబ్బరి) శృంగాజపకం, రూషకం (చారు) పిప్పలి, మారీచం (మిరియాలు) పటోలం, బృహతి, సర్వకషాయాలు, సుగంధభరితమైన బలిసిన జంతువుల మాంసం, దీర్ఘమూలకం, వెదురువేరు, సురసం, సర్జకం (సాలవృక్షం) భూస్తృణం (గరిక) వంటివి శ్రాద్ధ కర్మలో వినియోగించవచ్చు. ఇవి పవిత్రమైనవి.

## శ్రాద్ధ కర్మలో వాడకూడని వస్తువులు :

లశునం (వెల్లుల్లి) గృంజనం (వీదేశీ కూరగాయలు క్యారెట్, బీట్‌రూట్ వంటివి)పలాండు (ఉల్లిపాయ) పిండమూలకం , కరంభం (పెరుగులో కలిపిన పిండి) వీటితో పాటు రసగంధహీనమైన ఇతరపదార్థాలు వాడకూడదు. ఎందుకంటే పూర్వం దేవాసుర సంగ్రామం జరిగినప్పుడు దేవతల చేతిలో 'బలి'గాయపడ్డాడు. అప్పుడు అతడి శరీరం నుంచి రక్తబిందువులు కారి భూమి మీద పడ్డాయి. ఆ బిందువులనుంచే లశునం అనగా వెల్లుల్లి పుట్టింది. ఈ వెల్లులి తామస ప్రదమైనది కాబట్టి శ్రాద్ధకర్మల్లోనే కాదు ఇతర శుభ కార్యక్రమాలలో కూడా వినియోగించకూడదు.

# శ్రాద్ధకర్మలో దానఫలం

శ్రాద్ధకర్మని ఆచరించేవాడు లోకంలో ఏది శ్రేష్ఠమైనదో, ఏది తనకు అత్యంత ప్రీతిపాత్రమైనదో ఆ వస్తువుల్ని పితృదేవతలకి సమర్పించాలి. పితృదేవతల ఆజ్ఞల్ని పాటించేవాడు, అన్నదానం చేసేవాడు

జంబూనదమయం దివ్యం విమానం సూర్యసన్నిభమ్ ।
దివ్యాప్సరోభిః సంపూర్ణమన్నదో లభతేऽక్షయమ్ ॥
సవ్యంజనతు యోదద్యావహతం శ్రాద్ధకర్మణి ।
ఆయుః ప్రకాశమైశ్వర్యం రూపంచలభతే శుభమ్॥

*(శ్లో॥2-3, అధ్యా-16)*

బంగారంతో నిర్మించబడింది, దివ్యమైనది, సూర్యుడిలా ప్రకాశించేది, అందమైన అప్సరసలతో నిండివున్నది, అక్షయమైనది అయిన విమానాన్ని పొందుతాడు. పవిత్రమైన శ్రాద్ధ కర్మలో మంచిరుచికరమైన కూరలతో అన్నాన్ని దానం చేస్తాడో అతడు ఆయువును, వృద్ధిని, తేజస్సును ఐశ్వర్యాన్ని రూపాన్ని పొందుతాడు.

యాజ్ఞీకుడైన విప్రుడికి యజ్ఞోపవీతాన్ని దానంచేస్తే వేదాన్ని దానంచేసిన ఫలితం పొందుతాడు. శ్రాద్ధ సమయంలో విప్రుడికి నీటితో నిండిన కమండలాన్ని దానం చేస్తే అతడికి తేనె, నేయి, పాలు, పెరుగుతో కూడిన కమండలం వచ్చిచేరుతుంది. (అన్నగా ఆ పదార్ధాలన్నీ సమృద్ధిగా అతడికి చేకూరుతాయని భావం) మెత్తని పరుపును, పాదరక్షలను దానంచేస్తే దాతకి వాహనయోగం కలుగుతుంది. పాదాలకు సుఖం లభిస్తుంది. సంపూర్ణమైన భోజనాన్ని, భోజన పాత్రని, శయ్యతో సహా విప్రుడికి దానం చేస్తే దాతకి స్వర్గంలో అఖండమైన గౌరవం లభిస్తుంది. రసవంతమైన ఫలాలను, భక్ష్యాలను దానం చేస్తే సౌభాగ్యవంతుడవుతాడు. నువ్వులు చెఱుకు ముక్క ఇస్తే అధికంగా స్నేహితులు లభిస్తారు. లోహ పాత్రలు దానం చేస్తే అందరికీ ఆప్తుడవుతాడు. వెండిబంగారాలను శ్రాద్ధకర్మలో దానం చేస్తే యజమాని కోరికలు తీరుతాయి.

ఈవిధంగా పితృదేవతలకు సంబంధించిన శ్రాద్ధవిధిలో వివిధరకాల దానాలు వాటి ఫలితాలు సంక్షిప్తంగా చెప్పబడ్డాయి. ఇక్కడ చెప్పినవేకాదు. యజమానికి వీలైన ఏ పవిత్రమైన వస్తువునైనా శ్రాద్ధకర్మలో దానం ఇవ్వవచ్చు. అయితే ఆ దానం త్రికరణ శుద్ధిగా ఇవ్వాలి. అలా చేస్తేనే సత్ఫలితం లభిస్తుంది.

## పరశురామ చరిత్ర

మహర్షులలో గొప్పవాడైన జమదగ్ని ఒక ఆశ్రమాన్ని నిర్మించుకుని నిత్యం యజ్ఞయాగాది క్రతువుల్ని నిర్వహిస్తూ జీవిస్తున్నాడు. జమదగ్ని మహర్షిపుత్రుడు రాముడు (పరశురాముడు) ఒకరోజు రాముడు తండ్రి దగ్గరకి వచ్చి "పితామహా నాకు మన పితామహుల్ని దర్శించాలని కోరికగా వుంది. వెళ్ళి రావటానికి అనుమతినివ్వండి" అని ప్రార్థించాడు. జమదగ్ని మహర్షి ఎంతో సంతోషంగా అనుమతిచ్చి సాగనంపాడు.

తండ్రి అనుమతితో బయలుదేరిన రాముడు అక్కడనుంచి సరాసరి తమ పితాముడు, మహాత్ముడు అయిన 'ఋచీకుడి' ఆశ్రమానికి వెళ్ళాడు. పరమప్రశాంతంగా వున్న ఆయన ఆశ్రమంలో కొన్నాళ్ళు ఆనందంగా నివసించాడు. తరువాత తాతగారి ఆదేశాన్ని అనుసరించి ఆయన తండ్రి అయిన భృగు మహర్షి ఆశ్రమానికి బయలుదేరాడు రాముడు. దారిలో చ్యవనమహర్షి ఆశ్రమాన్ని దర్శించి ఆయనకి నమస్కరించి అక్కడి నుంచి భృగు ఆశ్రమానికి చేరుకున్నాడు. ఆనందకరమైన వాతావరణంతో, ప్రకృతి సౌందర్యంతో పరమ ప్రశాంతంగా వుంది భృగుమహర్షి ఆశ్రమం. రాముడు ఆ ఆశ్రమంలోకి ప్రవేశించగానే దర్భాసనం మీద ఆసీనుడై చుట్టూ శిష్యజనంతో పరివేష్ఠితుడైన భృగుమహర్షి ఆయనకి దర్శనమిచ్చాడు. మహాతేజస్సుతో వెలిగిపోతున్న ప్రపితామహుణ్ణి చూసి ఎంతో ఆనందించాడు రాముడు.

వినయంగా భృగుమహర్షి సమీపానికి చేరుకున్న రాముడు భక్తి పూర్వకంగా ఆయనకి నమస్కరించి క్రమంగా అక్కడ వున్న మునులందరికీ వరుసగా నమస్కరించాడు. వారంతా అతడి వినయవిధేయతలకు ఎంతో

పొంగిపోయి ఆశీర్వదించారు. రాముణ్ణి దగ్గరకు రమ్మని భృగుమహర్షి కుశల ప్రశ్నలు వేశాడు. నాయనా! నీ తల్లితండ్రులు కుశలమేనా! నీవు కూడా క్షేమంగానే వున్నావా! ఇప్పుడు ఇక్కడికి ఏదైనా పనిమీద వచ్చావా! లేక చూసిపోదామని వచ్చావా! అని అడిగాడు. రాముడు సవినయంగా ఆయన్ని దర్శించాలని వచ్చానని చెప్పాడు. రాముడి మాటలు విని భృగుమహర్షి ఎంతో సంతోషించాడు.

రాముడు తన ముత్తాత గారి ఆశ్రమంలో కొన్ని రోజులు ఆనందంగా కాలం గడిపాడు. అక్కడున్న వారందరికీ ఏదోవిధంగా సాయం చేస్తూ వారి ఆదరాభిమానాల్ని పొందాడు. ఒకనాడు భృగుమహర్షి రాముణ్ణి పిలిచి ఏకాంతంగా అతడితో "నాయనా! లోకక్షేమం కోసం, నీ క్షేమం కోసం నా ఆదేశాన్ని అనుసరించి సరాసరి ఇక్కణ్ణుంచి హిమగిరికి వెళ్ళు. అక్కడ ఒక పవిత్రమైన ఆశ్రమాన్ని నిర్మించుకో, కఠోరమైన దీక్షతో తపస్సుచేసి పరమేశ్వరుణ్ణి మెప్పించు. శంకరుడు భక్తవశంకరుడు, నిన్ను తప్పక అనుగ్రహిస్తాడు. మనసారా నీవు ఏది కోరుకుంటావో దాన్ని నీకు ప్రసాదిస్తాడు. నాయనా! నీవు ఆయన్ని శత్రువినాశకాలైన దివ్యాస్త్రాల్ని ప్రసాదించమని కోరుకో. భవిష్యత్తులో నీవు ఎన్నో మహత్కార్యాలు చేయవలసి వుంటుంది. క్షేమంగా వెళ్ళిరా" అని ఆశీర్వదించి పంపాడు.

**భార్గవరాముడి తపస్సు :**

భృగుమహర్షి ద్వారా ఆదేశించబడ్డ రాముడు సరాసరి భృగు ఆశ్రమం నుంచి హిమగిరికి చేరుకున్నాడు. దారిలో వున్న మునుల ఆశ్రమాలను దర్శిస్తూవారందరి ఆశీర్వచనాల్ని అందుకుని హిమగిరికి వచ్చాడు రాముడు. తెల్లని వెండిలా ప్రకాశించే పర్వత శిఖరాలతో పైనుంచి దుమికే సెలఏర్లతో వివిధ రకాల పక్షుల కిలకిలా రావాలతో, నెమళ్ళ నాట్యాలతో సుందరమైన వృక్షాలతో అందమైన తీగలతో, లతలతో ఓషధులతో, సంచరిస్తున్న చమరీమృగాలతో, కిన్నెరలు పాడే మధురమైన సంగీతనాదాలతో కూడుకున్న ఆ హిమగిరిని చూసి ఎంతో పరవశించిపోయాడు. ఒక్కసారి ఆ పర్వతం మీదున్న సుందర ప్రదేశాల్ని దర్శించాడు. ఒకచోట ఒక అందమైన సరోవరం ఆయన్ని ఆకర్షించింది. వెంటనే ఆ సరోవర తీరంలో ఒక ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడు రాముడు.

ఒక శుభముహూర్తాన కేవలం ఫలాలనే ఆహారంగా స్వీకరిస్తూ పరమేశ్వరుడి గురించి కఠోరదీక్షతో తపస్సు చేయటం ప్రారంభించాడు రాముడు. గ్రీష్మఋతువులో పంచాగ్నులమధ్యన నిలబడి, శీతాకాలంలో సరోవరంలోని నీళ్ళలో నిలబడి అరిషడ్వర్గాలను అరికట్టి, శీతోష్ణాలను సహించి దీక్షగా తన తపస్సుని కొనసాగించాడు. కొన్నాళ్ళ తరువాత ఆహారాన్ని కూడా స్వీకరించక ధ్యానంలో నిమగ్నమైపోయాడు. తన హృదయంలో ఆ సర్వేశ్వరుడి రూపాన్ని నింపుకుని ఏకాగ్రతలో లయమైపోయాడు.

గొప్ప తపోధనులైన భృగువు, అత్రి, క్రతువు, జాబాలి, వామదేవుడు, మృకండుడు, వంటి మహర్షులు తమ తపస్సుల ద్వారా పాపరహితులై గొప్పవారుగా ప్రసిద్ధిపొందారు. అలాంటి తీవ్ర తపోధనులు కూడా హిమాలయాల్లో రాముడు కఠోరదీక్షతో తపస్సుచేస్తున్నాడని విని అందరూ అతన్ని చూడటానికి వెళ్ళారు. వారేకాదు ఇంకా చుట్టుప్రక్కల ఆశ్రమాలలో సాధనచేసుకుంటున్న మహర్షులు కూడా రాముడి ఆశ్రమానికి వచ్చారు. వచ్చిన వారందరూ తపోదీక్షలో నిశ్చలంగా వున్న రాముణ్ణి చూసి ఆనందంతో ఆశీర్వదించి తిరిగి వెళ్ళిపోయారు.

**మృగవ్యాధుడు :** రాముడి తపోదీక్ష శివుణ్ణి కదిలించింది. ఒక్కసారి రాముడి ప్రతిభని పరీక్షిద్ధామనుకున్నాడు. వెంటనే 'మృగవ్యాధుడు' అనే ఒక భయంకరాకారుడి రూపాన్ని ధరించి రాముడి ఆశ్రమానికి వెళ్ళాడు. రక్తంకారుతున్న ఒకమాంసం ముక్కని నములుతూ నల్లని ఎత్తైన శరీరంతో జుగుప్సాకరంగా వున్న ఆ మృగవ్యాధుడు ఆశ్రమ ప్రాంగణంలో వున్న ఒకచెట్టు దగ్గరకి వచ్చి నిలబడ్డాడు. సరోవరతీరంలో నుల్చున్న రాముడు అతడి దగ్గరకు వెళ్ళాడు. ధర్మవ్యాధుడు చేతులెత్తి రాముడికి నమస్కరించి "స్వామీ! నాపేరు తోషప్రవర్షుడు. నేను వ్యాధుడను (బోయవాణ్ణి) ఈ మహావనంలో నేను చిరకాలం నుంచీ జీవిస్తున్నాను. ఈ ప్రాంతానికి నేనే అధిపతిని, ఇక్కడ నా అనుమతి లేకుండా ఎవరూ నివసించకూడదు. ఇంతకీ తమరెవరు? ఎందుకు ఇక్కడికి వచ్చారు?" అని ప్రశ్నించాడు.

మృగవ్యాధుడి మాటలువిన్న రాముడు ఎంతో ఆశ్చర్యపోయాడు. "బోయవాడైన అతడు చాలా స్పష్టంగా ఎలాంటి అక్షరదోషాలు లేకుండా మాట్లాడుతున్నాడు. అసలు ఇతడెవరు? చూడటానికి జుగుప్సాకరంగా ఉన్నా ఏవో శుభలక్షణాలు అతడిలో కనిపిస్తున్నాయి." అని అనుకుని అతడితో ఓయీ! నీకు శుభం జరుగుగాక!

నాపేరు రాముడు. నా తండ్రి జమదగ్ని మహర్షి. నేను భృగువంశీయుణ్ణి. పరమేశ్వరుడి అనుగ్రహం కోసం చిరకాలంగా ఇక్కడే తపస్సు చేస్తున్నాను. నిన్ను ఇంతవరకూ చూడలేదు. ఇప్పుడే చూస్తున్నాను. ఇక నువ్వెవరైనా సరే నేను ఇక్కడే వుండి తపస్సుచేసుకుంటా. నీవే ఎక్కడికైనా పోవటం మంచిది. నేను నీకు అతిథిని. అతిథిని గౌరవించటం ధర్మం. పైగా నేను తపస్సు చేసుకోవటానికి వచ్చాను. నన్ను తిరస్కరించటం నీకూ శ్రేయస్కరం కాదు. కనుక నీవే వేరే చోటుకి వెళ్ళటం మంచిది" అని మృదువుగా చెప్పాడు.

రాముడి మాటలు విన్న మృగవ్యాధుడికి కోపం వచ్చింది. ఆవేశంతో "ఓయీ! రామా! ఇది నీకు ధర్మంగా వుందా! నా నివాసానికి వచ్చి నా అనుమతి లేకుండా ఇక్కడ వుండటమేకాకుండా నన్ను నా నివాసాన్ని అవమానిస్తావా! నా ఇంటికే వచ్చి నన్నే వేరే చోటుకి వెళ్ళమంటావా! అది సాధ్యంకాదు. ఇది నా ఇల్లు. ఇక్కడేవుంటా, ఇక్కడే తింటా. నీకు నా సన్నిధి అసహ్యంగా, జుగుప్సాకరంగా అనిపిస్తే నీవే వేరేచోటుకి వెళ్ళు, లేదా అన్నీ సహిస్తూ ఇక్కడే వుండు. నాకేం అభ్యంతరం లేదు" అని అన్నాడు.

ధర్మవ్యాధుడి వచనాలు విన్నాక రాముడిలో సహనం నశించింది. "ఓరీ! నీవు నిజంగా అసహ్యించుకోతగినవాడివే, ఎందుకంటే నీవు హింసాపరుడివి. ప్రతిరోజూ సాధుజంతువుల్ని వధిస్తూ వాటిని తింటుంటావు. అన్ని రకాలుగా నీవు అధమ జాతి వాడివే పురుషాధముడవైన నీవు నా సన్నిధిలో నివసించతగవు. వెంటనే ఇక్కడ నుంచి తొలగిపోతే మంచిది లేదా నా బలాన్ని ఉపయోగించి నిన్నిక్కణ్ణుంచి పంపించాల్సి వుంటుంది" అని హెచ్చరించాడు.

రాముడి ఆగ్రహవాక్యాలు విన్న మృగవ్యాధుడు మృదువుగా ఈసారి ఏమాత్రం ఆవేశపడకుండా "రామా! నేను నా ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాను. జంతువుల్ని చంపి జీవనాన్ని గడుపుకోవటం నావృత్తి. నేను నాకు నా కుటుంబానికి కావలసింది తప్ప అధికంగా ఏ ఒక్క జీవినైనా చంపితే నాకు పాపం అంటుకుంటుంది గానీ వేరేవిధంగా కాదుకదా! జీవుల మాంసమే నాకు ఆహారం. పూర్వం ఎప్పుడో బ్రహ్మదేవుడు నాకీ వృత్తిని నిర్దేశించాడు. నేను అదే చేస్తున్నాను. ఇందులో తప్పేముంది. అయినా ఇన్ని ధర్మపన్నాలు పలుకుతున్న నీవు నిజంగా ధర్మాత్ముడవేనా! తండ్రి మాటవిని నీ తల్లిని చంపావు. ఇప్పుడు వృద్ధుడైన తండ్రిని వదిలి మహాధార్మికుడిలా ఇక్కడికి వచ్చి తపస్సు చేస్తున్నావు. ఇదేనా ధర్మం? నీ గతచరిత్ర మొత్తం నాకు తెలుసు. అసలు మనుషుల్లో భేదభావాలు చూపే నిన్ను శంకరుడు ఎలా అనుగ్రహిస్తాడు. నీవీ తపస్సు చేయటం వ్యర్థం. కనుక తపస్సు మాని మరోచోటుకి పోవటం మంచిది" అని పలికాడు.

మృగవ్యాధుడు తన వృత్తాంతాన్నంతా కళ్ళకు కట్టినట్టు చెప్పటంతో రాముడికి జ్ఞానోదయమైంది. తన ఎదురుగావున్నది మృగవ్యాధుడు కాదని గ్రహించాడు. సాక్షాత్తు ఆ సర్వేశ్వరుడే తనని పరీక్షించటానికి వచ్చాడేమో అని అనిపించింది. వెంటనే అతడితో "మహానుభావా! క్షమించు. నీవెవరు? నిజంగా నీవు మృగవ్యాధుడివి కావు. మరెవరో చెప్పు ఒకవేళ నీవే శివుడివైతే నా అపరాధాన్ని మన్నించి నీ నిజస్వరూపాన్ని నాకు చూపించు. ప్రభూ! నన్ను కరుణించు. కాపాడు. అని ప్రార్థించాడు. మృగవ్యాధుడు ఏమీ పలకలేదు. అలానే నిలబడి చూస్తున్నాడు.

రాముడు వెంటనే నేలమీద పద్మాసనంలో కూర్చుని ధ్యాననిమగ్నుడయ్యాడు. ఏకాగ్రతతో మనసు కేంద్రీకరించి చూసాడు. కొద్దిసేపటికి మృగవ్యాధుడి రూపంలో వున్న సర్వేశ్వరుడు ఆయన మనోనేత్రానికి కనిపించాడు. ఆనందంతో కళ్ళు తెరిచిన రాముడికి ఎదురుగా మృగవ్యాధుడు నవ్వుతూ దర్శనమిచ్చాడు.

రాముడికి ఆనందంతో నోటమాటరాలేదు. వెంటనే అతడిపాదాల మీదపడి శరణువేడుకున్నాడు. పరిపరి విధాలుగా స్తుతించాడు. రాముడి ప్రార్ధనవిని సంతోషించిన శివుడు తన నిజరూపంతో దర్శనమిచ్చాడు. రాముడు ఆయన దివ్యరూపాన్ని చూసి ఆనందోద్రేకంతో

నమస్తే దేవదేవాయ శంకరాయాదిమూర్తయే ।
నమఃశర్వాయ శాంతాయ శాశ్వతాయ నమోనమః ॥ 1

నమస్తే నీలకంఠాయ నీలలోహితమూర్తయే ।
నమస్తే భూతనాథాయ భూతావాసాయతే నమః ॥ 2

వ్యక్తావ్యక్తస్వరూపాయ మహాదేవాయ మీఢుషే ।
శివాయబహురూపాయ త్రినేత్రాయ నమోనమః ॥ 3

శరణం భవమేశర్వ త్వద్భక్తస్యజగత్పతే ।
భూయోఽనన్యాశ్రయాణాం తు త్వమేవహి పరాయణమ్ ॥ 4

*(శ్లో॥ 25-28, అధ్యా 24)*

దేవదేవుడివైన శంకరా! నీకు నమస్కారం. ఆది మూర్తివైన నీకు నమస్కారం. శర్వుడు, శాంతుడు, శాశ్వతుడు అయిన నీకు నమస్కారం. భూతనాథుడు, నీలకంఠుడు నీలలోహితమూర్తి అయిన నీకు నమస్కారం. బహురూపుడు, త్రినేత్రుడు, శివుడువైన నీకు నమస్కారం. ఓ జగత్పతీ! సర్వేశ్వరా! నీ భక్తుడనైన నన్ను అనుగ్రహించు. అందరికీ నీవేగతి. నీ గురించి తెలియక ఏవైనా అపరాధాలు చేసివుంటే క్షమించు"అని ప్రార్థించాడు.

శివుడు ఆనందించి "రామా!నీ మనసులో వున్న కోరిక నాకు తెలుసు. నీకిప్పుడు రుద్రసంబంధితమైన అస్త్రాలు ధరించే శక్తిలేదు. కనుక నీవు తిరిగి కఠోరమైన తపస్సుచేయాలి. భూమండలమంతా సంచరించి సకల తీర్థాలలో స్నానమాచరించి పవిత్రదేహుడవైతేగానీ నీకు దివ్యాస్త్రాల్ని పొందే అర్హతరాదు. వెంటనే నేను చెప్పిన విధిని ఆచరించిరా" అని పలికి అదృశ్యమయ్యాడు.

శివుడి ఆదేశానుసారం రాముడు భూమండలమంతా పర్యటించి, ఎన్నో దివ్యక్షేత్రాల్ని దర్శించాడు. ఎన్నో పుణ్యతీర్థాలలో స్నానాన్ని ఆచరించి పరమ పవిత్రుడై తిరిగి హిమాలయాల్లో తాను పూర్వం తపస్సు ఆచరించిన ప్రాంతానికి వచ్చాడు. అక్కడే నివసిస్తూ కఠోరదీక్షతో శివుడి గురించి మళ్ళీ తపస్సు చేయటం ప్రారంభించాడు. అలా కొన్ని వందల సంవత్సరాలు గడిచిపోయింది. ఆ సమయంలో దేవతలకీ దానవులకీ భయంకరమైన యుద్ధం ప్రారంభమయ్యింది. యుద్ధంలో దానవుల చేతిలో దేవతలు ఘోరంగా ఓడిపోయారు. దిక్కుతోచక వారంతా కలిసి పరమేశ్వరుడి దగ్గరకెళ్ళి మొరపెట్టుకున్నారు. తమని ఎలాగైనా కాపాడమని ప్రార్థించారు.

దేవతల విన్నపాన్ని విన్న శివుడు వారికి అభయాన్నిచ్చి వారితో "దేవతలారా! హిమవత్పర్వతం మీద భార్గవరాముడు నా గురించే ఎంతోకాలం నుంచీ తపస్సు చేస్తున్నాడు. మీరు వెంటనే అక్కడకి వెళ్ళి నేను రమ్మన్నానని చెప్పి తీసుకురండి" అని పంపించాడు. శివాజ్ఞ విన్న దేవతలు సరాసరి భార్గవరాముడి దగ్గరకొచ్చి శివుడు చెప్పిన మాటని చెప్పారు. భార్గవ రాముడు ఎంతో ఆనందించి వారివెంట బయలుదేరాడు. దేవతలతో సహా కైలాసంలోకి ప్రవేశించాడు భార్గవరాముడు. అక్కడ సమస్త భూతాలతో ఇంద్రాదులతో నారదాది మహర్షులతో సేవించబడుతున్న శంకరుణ్ణి చూసాడు. పరుగెత్తుతూ వెళ్ళి శివుడికి సాష్టాంగనమస్కారం చేసి స్తుతించాడు. శివుడు ఆనందించి భార్గవరాముణ్ణి స్వయంగా పైకి లేపి చిరునవ్వుతో ఇలా అన్నాడు.

**అస్త్ర ప్రదానం :** భార్గవరామా! ఈ దేవతలందరూ దైత్యులచేత పీడించబడి తమతమ నగరాల నుంచి బహిష్కరించబడ్డారు. వారంతా శక్తిహీనులై నాదగ్గరకొచ్చారు. నీవు దైత్యగణాల్ని జయించి ఈ దేవతలందరికీ ఆనందాన్ని చేకూర్చు" అని పలికాడు. అది విని ఆశ్చర్యపోయిన భార్గవరాముడు "ప్రభూ! ఇంద్రాదిదేవతలే జయించలేని దానవుల్ని నేనెలా ఓడించగలను? అసలు యుద్ధంచేయటానికి నాకు ఆయుధాలు కూడా లేవుకదా! అని తన సందేహాన్ని

వెలిబుచ్చాడు. శివుడు నవ్వుతూ "వత్సా! ఇదిగో కాలాగ్నితో సమానమైన కాంతి కలిగింది, శివతేజో మయమైనది అయిన దివ్యాస్త్రాన్ని ఇస్తున్నా తీసుకో, అదేకాదు నా దివ్య ప్రభావంతో సమస్త శత్రువుల్నీ నిర్జించగలిగే పరశువుని కూడా నీకు ప్రసాదిస్తున్నాను. ఈ దివ్యాయుధాలతో సమస్త శత్రువుల్నీ నాశనం చేసే శక్తి నీకు కలుగుతుంది. నీకు ఎదురే వుండదు. ముల్లోకాల్లో నిన్ను జయించే వారే వుండరు. వెళ్ళు వెళ్ళి యుద్ధం చెయ్యి" అని దివ్యాస్త్రాలని, పరశువుని (గండ్రగొడ్డలి) భార్గవరాముడికి ప్రసాదించాడు.

శివవరప్రసాదమైన శస్త్రాస్త్రాలతో గండ్రగొడ్డలితో భార్గవరాముడు మహాయోధుడిగా తయారయ్యాడు. ఆయనలో క్షాత్రధర్మం ఉద్దీపించింది. వెంటనే శివాజ్ఞననుసరించి దానవులతో యుద్ధాన్ని ప్రకటించాడు. తిరిగి దానవులకూ దేవతలకూ మధ్యయుద్ధం ప్రారంభమయ్యింది. భార్గవరాముడు పరశురాముడై యుద్ధరంగంలో వీరవిహారంచేసాడు. ఆయన ధాటికి వేలాది అసురులు నేలకూలారు. ఎందరో క్షతగాత్రులైహాహాకారాలు చేస్తూ యుద్ధరంగం నుంచి పారిపోయారు. విజయం దేవతల్ని వరించింది. అందరూ జయజయ ధ్వానాలు చేస్తూ భార్గవరాముణ్ణి అభినందించారు.

ఆ విధంగా దైత్యులందరినీ సంహరించి దేవతలందరినీ సంతోషపెట్టి తిరిగి హిమాలయాల్లో వున్న తన ఆశ్రమానికి వచ్చాడు భార్గవరాముడు. ఆశ్రమంలో తనకి జ్ఞానోదయం కలిగించిన మృగవ్యాధుడి ప్రతిమని స్థాపించుకుని, దాన్ని ఆరాధిస్తూ తన తపోదీక్షని కొనసాగించాడు. కొంతకాలం గడిచాక భార్గవరాముడి భక్తి ప్రపత్తులు చూసి ఆనందం కలిగిన శివుడు మరుద్గణాలతో సహా అతడి ముందు ప్రత్యక్షమయ్యాడు. దేవదేవుడైన ఈశ్వరుణ్ణి సకల గణసమేతంగా దర్శించిన భార్గవరాముడు భక్తి ప్రపత్తులతో ఆయన్నిలా స్తుతించాడు.

## భార్గవరాముడు చేసిన శివస్తుతి

నమస్తే దేవదేవేశ నమస్తే పరమేశ్వర ।
నమస్తే జగతోనాథ ! నమస్తే త్రిపురాంతక ॥ 1

నమస్తే సకలాధ్యక్ష నమస్తే భక్తవత్సల ।
నమస్తే సర్వభూతేశ నమస్తే వృషభధ్వజ! ॥ 2

నమస్తే సకలాధీశ ! నమస్తే కరుణాకర !
నమస్తే సకలావాస ! నమస్తే నీలలోహిత॥ 3

నమః సకలదేవారి గణనాశాయ శూలినే ।
కపాలినే, నమస్తుభ్యం సర్వలోకైకపాలినే ॥ 4

శ్మశానవాసినే నిత్యం నమః కైలాసవాసినే ।
నమోఽస్తు పాశినే తుభ్యం కాలకూటవిషాశినే ॥ 5

విభవే ఽమరవంద్యాయ ప్రభవే తే స్వయంభువే ।
నమో ఽఖిలజగత్కర్మసాక్షిభూతాయ సంభవే ॥ 6

నమస్త్రిపథగా ఫేనభాసిగాతార్ధేందుమౌలినే ।
మహాభోగీంద్రహారాయ శివాయ పరమాత్మనే ॥ 7

భస్మసంఛన్న దేహాయ, నమోఽర్కాగ్నీందుచక్షుషే।
కపర్దినే నమస్తుభ్యమంధకాసురమర్ధినే ॥ 8

త్రిపురధ్వంసినే దక్షయజ్ఞవిధ్వంసినే నమః ।
గిరిజాకుచకాశ్మీర విరంజిత మహోరసే ॥ 9

మహాదేవాయ మహతే నమస్తే కృత్తివాసనే ।
యోగిధ్యేయ స్వరూపాయ శివాయా చింత్యతేజసే ॥ 10

స్వభక్త హృదయాంభోజకర్ణికా మధ్యవర్తినే ।
సకలాగమసిద్ధాంతసారరూపాయ తే నమః ॥ 11

నమో నిఖిల యోగేంద్రబోధనాయామృతాత్మనే ।
శంకరాఖిలవ్యాప్తమహిమ్నే పరమాత్మనే ॥ 12

నమః శర్వాయ శాంతాయ, బ్రహ్మణే విశ్వరూపేణే ।
ఆది మధ్యాంతహీనాయ, నిత్యాయావ్యక్తమూర్తయే ॥ 13

వ్యక్తావ్యక్తస్వరూపాయ స్థూలసూక్ష్మాత్మనే నమః ।
నమో వేదాంతవేద్యాయ విశ్వవిజ్ఞానరూపిణే ॥ 14

నమః సురాసురశ్రేణి మౌళిపుష్పార్చితాంఘ్రయే ।
శ్రీకంఠాయ జగద్ధాత్రే లోకకర్త్రే నమోనమః ॥ 15
రజోగుణాత్మనే తుభ్యం విశ్వసృష్టివిధాయినే ।
హిరణ్య గర్భరూపాయ హరాయ జగదాదయే ॥ 16
నమో విశ్వాత్మనే లోకస్థితి వ్యాపార కారిణే ।
సత్వవిజ్ఞానరూపాయ పరాయ ప్రత్యగాత్మనే ॥ 17
తమోగుణవికారాయ జగత్సంహారకారిణే ।
కల్పాంతే రుద్రరూపాయ పరాపరవిదే నమః ॥ 18
అవికారాయ నిత్యాయ నమః సదసదాత్మనే ।
బుద్ధిబుద్ధి ప్రబోధాయ బుద్ధీంద్రియ వికారిణే ॥ 19
వస్వాదిత్యమరుద్భిశ్చ సాధ్యరుద్రాశ్విభేదతః ।
యన్మాయాభిన్నమతయే దేవాస్తస్మై నమోనమః ॥ 20
అవికారమజం నిత్యం సూక్ష్మరూపమనౌపమ్ ।
తవయత్తన్న జానంతి యోగినోఽపి సదాఽమలాః ॥ 21
త్వామవిజ్ఞాయ దుర్జ్ఞేయం సమ్యగ్బ్రహ్మాదయో ఽపి హి ।
సంసరంతి భవే నూనం న తత్కర్మాత్మకాశ్చిరమ్ ॥ 22
యావన్నోపైతి చరణౌ తవాజ్ఞానవిఘాతినః ।
తావద్భ్రమతి సంసారే పండితోఽచేతనో ఽపివా ॥ 23
స ఏవ దక్షః స కృతీ స మునిః స చ పండితః ।
భవతశ్చరణాంభోజే యేన బుద్ధిః స్థిరీకృతా ॥ 24
సుసూక్ష్మత్వేన గహనః సద్భావస్తే త్రయీమయః ।
విదుషామపి మూఢేన స మయా జ్ఞాయతే కథమ్ ॥ 25
అశబ్దగోచరత్వేన మహిమ్నస్తవ సాంప్రతమ్ ।
స్తోతు మప్యనలం సమ్యక్త్వామహం జడధీర్యతః॥ 26
తస్మాదజ్ఞానతో వాపి మయా భక్త్యైవ సంస్తుతః ।
ప్రీతశ్చ భవ దేవేశ నను త్వం భక్తవత్సలః ॥ 27

*(శ్లో॥5-31 అధ్యా-25, పూ.భా)*

ఈ విధంగా భక్తిప్రపత్తులతో భార్గవరాముడు చేసిన స్తుతి శంకరుణ్ణి ఆనందపరిచింది. “భార్గవా! నీ తపస్సుతో, వినయంతో, శ్రద్ధతో నా మనసుగెల్చుకున్నావు. నీకు ఏం వరం కావాలో కోరుకో నిస్సందేహంగా నీకు ప్రసాదిస్తాను” అని పలికాడు. శంకరుడు స్వామీ! నిజంగా మీరు నన్ను అనుగ్రహిస్తే నాకు మీదగ్గరున్న అన్ని శస్త్రాల్ని, అస్త్రాలన్ని ప్రసాదించండి. ముల్లోకాల్లో నన్ను మించిన వాడుండకూడదు. ఇదే నా కోరిక” అన్నాడు భార్గవరాముడు. తథాస్తు!రామా! ఇదిగో నీవు కోరిన శస్త్రాస్త్రాలు అనిచెప్పి వాటిని భార్గవరాముడికి అందించాడు శివుడు. ఆయన ప్రసాదించిన అస్త్రాలతో గొప్పది ఎక్కడా అడ్డులేకుండా వేగంగా వెళ్ళే ‘శుభ్రాశ్వము’ సుధ్వజము అనేవి. వీటితో పాటు దృఢమైన విజయం అనే ధనస్సుని, అక్షయతూణీరాలు రెండింటిని, సకల శస్త్రాస్త్రదుర్భేధ్యమైన కవచాన్ని ప్రసాదించి, అతన్ని ఆశీర్వదించి భూతమరుద్గణాలతో సహా అంతర్ధానమయ్యాడు పరమేశ్వరుడు.

పరమేశ్వర ప్రసాదితమైన అస్త్రాల్ని, శస్త్రాల్ని, దివ్యధనస్సుని, కవచాన్ని స్వీకరించిన భార్గవరాముడు ఎంతో సంతోషించాడు. ఇన్నాళ్ళకు తన మనోరథం తీరిందని ఆనందపడ్డాడు. అక్కడేవున్న మహోదరుడు అనేవాణ్ణి పిలిచి “మహోదరా! వీటన్నిటనీ నీవు సంరక్షించు. నాకు వీటితో పని కలిగినప్పుడు నిన్ను స్మరిస్తాను వెంటనే వాటిని నా దగ్గరకు పంపు” అని చెప్పి రథాన్ని అస్తకవచ బాణాల్ని అతడికి అప్పగించాడు.

భార్గవరాముడికి తన వాళ్ళందరినీ చూడాలనిపించింది. హిమవంతం నుంచి బయలుదేరాడు. దారిలో వ్యాఘ్రం బారిన పడిన బాలుణ్ణి రక్షించాడు. ఆ బాలుడికి అకృతవ్రణుడు అనే పేరు పెట్టి తన ముత్తాతగారైన భృగుమహర్షి ఆశ్రమానికి తనతో పాటు తీసుకెళ్ళాడు. అక్కడ భృగుమహర్షికి ఆయన భార్య అయిన ఖ్యాతికి నమస్కరించి వారి ఆశీర్వచనాల్ని స్వీకరించాడు. అక్కడ నుంచి బయలుదేరి అకృతవ్రణుడితో సహా ఋచీకమునిని దర్శించి అక్కణ్ణుంచి సరాసరి తన తండ్రి జమదగ్ని మహర్షి ఆశ్రమానికి వచ్చాడు.

ఎన్నో సంవత్సరాల తరువాత ఆశ్రమానికి తిరిగి వచ్చిన పుత్రుణ్ణి చూసి జమదగ్ని ఎంతో ఆనందించాడు. కుశలప్రశ్నలు వేసి ప్రేమతో కౌగిలించుకున్నాడు. భార్గవరాముడు తండ్రికి భక్తిగా నమస్కరించి తాను అక్కడ నుంచి వెళ్ళినప్పటి నుంచీ జరిగిన వృత్తాంతాన్ని సవివరంగా ఆయనకి తెలియచేసాడు. తన కుమారుడు శివవరప్రసాది అయినందుకు జమదగ్ని ఎంతో సంతోషించాడు.

## కార్తవీర్యుడి ఉపాఖ్యానం

ఒకనాడు హైహయరాజవంశీయుడైన కార్తవీర్యార్జునుడు వేటకోసం అడవికి బయలుదేరాడు. ఆయనతో పాటు చతురంగ బలాలు కూడా బయలుదేరాయి. అడవిలోకి సైన్యసమేతంగా ప్రవేశించిన కార్తవీర్యుడు అక్కడున్న క్రూరమృగాల్ని వేటాడటం ప్రారంభించాడు. సింహాలు, ఖడ్గమృగాలు, పులులు, లేళ్ళు ఆయన బాణాలదెబ్బకి నేలకొరిగిపోయాయి. ఆ విధంగా చాలాకాలం వారివేట కొనసాగింది. ఒకనాటి మధ్యాహ్నం వేటాడి వేటాడి కార్తవీర్యుడు అతడిసైన్యం అలసిపోయారు. వారికి విపరీతంగా ఆకలి, దాహం వేసాయి. సమీపంలో ఎక్కడా కనీసం నీరు కూడా దొరకలేదు. అలా తిరుగుతూ వుండగా వారికి నర్మదానదీ తీరంలో ఉన్న జమదగ్ని మహర్షి ఆశ్రమం కనిపించింది. కార్తవీర్యుడు ఆ ఆశ్రమాన్ని చూసి తన పరివారాన్ని సైన్యాన్ని అక్కడేవుంచి, కొంతమంది పురోహితులతో కలిసి ఆ మహర్షి ఆశ్రమంలోకి ప్రవేశించాడు.

సాక్షాత్తు దేశచక్రవర్తి తన ఆశ్రమానికి అతిథిగా రావటంతో సంతోషించిన జమదగ్ని కార్తవీర్యుడికి తగిన అతిథి మర్యాదలు చేసి గౌరవించాడు. కొంతసేపటి తరువాత జమదగ్ని కార్తవీర్యుణ్ణి భోజనం స్వీకరించటానికి సిద్ధం కమ్మని చెప్పాడు. స్వామీ! వనంలో దొరకినవి తిని జీవించే మీరు మాకు ఆతిథ్యం ఇవ్వటం చాలా కష్టం కదా! మాకు అనుమతినిప్పించండి మా నగరానికి వెళతాము. అదీగాక, దూరంగా అపారమైన నాసైన్యం కూడా వుంది. మీకెందుకు శ్రమ” అని అన్నాడు కార్తవీర్యుడు.

కార్తవీర్యుడు మాటలు విన్న జమదగ్ని రాజా! మీకు ఆతిథ్యం ఇవ్వటంలో నాకేం శ్రమలేదు. కేవలం మీకేకాదు మీ సైన్యాన్ని కంతటికీ ఆహారాన్ని అందిస్తాను. వారిని కూడా పిలవండి అనిచెప్పాడు. కార్తవీర్యుడు ఆ మాటలు విని ఆశ్చర్యపోయాడు. అంతమందికి ఆహారం ఎలా పెడతాడా! అని సందేహపడ్డాడు. అంతలో జమదగ్ని లోపలున్న కామధేనువుని వీరి ముందుకు తీసుకువచ్చాడు. ఆ ధేనువుతో "వీరందరూ మన అతిథులు. వీరికి తగిన స్థాయిలో ఆతిధ్యాన్ని అందించు అని కోరాడు. ఆశ్చర్యం, అద్భుతం ఒక్కసారిగా కామధేనువు సంకల్పంతో ఆ ఆశ్రమం ఇంద్రనగరంలా మారిపోయింది. ఎటుచూసినా చక్కని నందనోద్యానవనాలు అందమైన భవనాలతో వైభవంగా దర్శనమిచ్చింది. కార్తవీర్యుడు ఆ దృశ్యాన్ని చూసి అబ్బురపడ్డాడు. జమదగ్ని రాజుకి, అతడి పరివారానికీ షడ్రసోపేతమైన విందుభోజనాన్ని అందించాడు. హాయిగా విందారగించిన అందరూ ఆ దివ్య నగరంలో వున్న భవనాలలో విశ్రాంతి పొందారు.

సూర్యుడిరాకతో తూర్పుదిక్కున వెలుగు రేకలు విచ్చుకున్నాయి. వందిమాగధులు తమ సుప్రభాత స్తోత్రాలతో కార్తవీర్యుణ్ణి మేలుకొలిపారు. నిద్రలేచిన రాజు అతడి పరివారం అందరూ కాలకృత్యాలు తీర్చుకుని జమదగ్ని దగ్గర వీడ్కోలు పుచ్చుకొని తమ రాజ్యానికి బయలుదేరారు. కొంతదూరం వచ్చేసరికి కార్తవీర్యుడి మదిలో ఒక దుష్ట ఆలోచన బయలుదేరింది. నాకు ఎంతరాజ్యం ఎంత సంపదలుండి ఏంలాభం. ఆ జమదగ్ని మహర్షి దగ్గరున్న కామధేనువుకి ఇవన్నీ ఏమాత్రం సరిపోవు.

ఎలాగైనా ఆ ధేనువును తన రాజ్యానికి తీసుకెళ్ళాలి అని ఆలోచించ సాగాడు. అతడి ఆలోచనకు ప్రోత్సాహం అందించారు అతడి మంత్రులు. అయితే కామధేనువు బ్రాహ్మణ ద్రవ్యం కదా! దాన్ని పరిగ్రహించటం పాపకర్మ అవుతుందేమో అని కార్త్యవీర్యుడు సందేహించాడు. రాజపురోహితుడు రాజు ఆంతర్యం గ్రహించి తప్పు అని నివారించే ప్రయత్నం చేసాడు. అయితే దుష్టుడైన మంత్రి కార్తవీర్యుణ్ణి ప్రలోభపెట్టటంతో, సహజంగానే ధేనువు మీద ఆసక్తి పెంచుకున్న కార్తవీర్యుడు దాన్ని తీసుకురమ్మని మంత్రిని పంపించాడు.

**కామధేనువు అపహరణ :** జమదగ్ని ఆశ్రమానికి సైన్యసమేతంగా వెళ్ళాడు మంత్రి. ఆ మహర్షితో కామధేనువుని మహారాజ కోరుకున్నారు. దాన్ని తమరి దగ్గరనుంచి తీసుకురమ్మన్నారని విన్నవించాడు. జమదగ్ని అతడి మాటలు విని "మంత్రివర్యా! ఇది నా కామధేనువు. హోమధేనువు కూడా. దీని వల్లే నేను నా నిత్యకర్మానుష్ఠానాలను నెరవేర్చుకోగలుగుతున్నాను. కనుక దీన్ని కోరటం సరికాదు. దయచేసి వెళ్ళండి" అన్నాడు. మంత్రి కొంచెం ఆగ్రహంతో "మహర్షీ! తమరు మనసు మార్చుకుని ధేనువుని ఇస్తేసరి లేదంటే బలాత్కారంగానైనా తీసుకువెళతాం. ఇది రాజాజ్ఞ" అన్నాడు మీరు ఏం చేసినా సరే ధేనువుని ఇవ్వను. మీరే ధర్మం తప్పి విప్రద్రవ్యాన్ని తీసుకువెళతానంటే చేసేదేముంది. ఆ పాపఫలితం మీరే అనుభవిస్తారు" అన్నాడు జమదగ్ని.

పాపమనస్కుడైన మంత్రి ఆవేశం ఆపుకోలేక ఆశ్రమప్రాంగణంలో కామధేనువుని బలవంతంగా తోలుకెళ్ళాలని ప్రయత్నించాడు. జమదగ్ని కోపంతో అతడికి అడ్డుపడ్డాడు. గోవును అపహరించటం మహాపాపం అన్నాడు. అయినా ఆ మంత్రికి ఆయన మాటలు చెవికెక్కలేదు. దయారహితంగా తన సైనికులతో జమదగ్ని మహర్షిని పక్కకి లాగించేసాడు. ఆయన తిరిగి అడ్డుపడబోతే కర్రలతో ఆయన్ని అతిఘోరంగా బాదించాడు. చేసేదేమీలేక జమదగ్ని అక్కడే కూలబడిపోయాడు. అంతచేసినా జమదగ్ని వారిమీద కోపంపెంచుకోలేదు. శాంతంగా ఉండి పోయాడు. క్రమంగా దెబ్బల బాధకి ఆయన ప్రాణం పోయింది.

మహా తేజస్వి అయిన జమదగ్ని దెబ్బలబాధతో నేలకొరిగిపోవటంచూసి మంత్రి మరింత రెచ్చిపోయాడు. వెంటనే ఆ కామధేనువుని ఈడ్చుకు రండి అని ఆజ్ఞాపించాడు. పరివారం వెళ్ళి ఆ కామధేనువుని అక్కడ నుంచి తరలించబోయారు. అంతే ఒక్కసారి ఆ కామధేనువు ఒళ్ళు విరుచుకుంది కోపంతో కళ్ళెర్ర చేసి బుసలు కొట్టింది. తన కొమ్ములతో, గిట్టలతో బంధించటానికి వచ్చిన సైన్యాన్నంతా ఛిన్నాభిన్నం చేసింది. ఎంతమంది ప్రయత్నించినా ఆ ధేనువుని ఎవరూ

తాకలేకపోయారు. అలా వారందర్నీ తప్పించుకున్న కామధేనువు ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగిరి అదృశ్యమయ్యింది. ధేనువు చేత పరాభవించబడి గాయాల పాలైన సైనికులు చేసేదేమీ లేక అక్కడేవున్న నందినీ ధేనువుని (దూడ) తీసుకెళ్ళి కార్తవీర్యుడికి అప్పగించారు. జరిగిన తతంగమంతా ఆయనకి వివరించారు.

**భార్గవరాముడి ప్రతిజ్ఞ :** తన పరివారం చేసిన దురాగతం వల్ల ఒక మహాతపస్వి మరణించాడని తెలుసుకుని కార్తవీర్యుడు ఎంతో బాధపడ్డాడు. "అయ్యో! నేనెంత ఘోరం చేసాను. బ్రాహ్మణ ద్రవ్యం కోసం ఆశపడి ఎంతో పాపకార్యాన్ని ఆచరించాను. నాకిక నిష్కృతి ఏది? అని చింతిస్తూ నగరానికి బయలుదేరాడు. నీళ్ళకోసం వెళ్ళిన రేణుకా దేవి ఆశ్రమానికి వచ్చింది. అంతాచిందర వందరగా కనిపించింది. లోపలికి వచ్చి చూడగానే రక్తం మడుగులో జమదగ్ని మహర్షి నిర్జీవంగా పడివున్నాడు. హా! నాథా! అంటూ ఆమె ఆర్తనాదాలు చేసింది.

అంతలో భార్గవరాముడు సమిధల కోసం అడవికి వెళ్ళి అప్పుడే తిరిగివచ్చాడు. తల్లి దారుణంగా రోదిస్తోంది. లోపలికి వచ్చి చూసాడు. తండ్రి విగతజీవుడై కనిపించాడు. ఆయనకి కూడా శోకం ముంచుకు వచ్చింది. కాస్త తమాయించుకున్నాడు. తల్లిని ఓదార్చాడు. కానీ కొద్దిసేపటికి దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు.

అంతలో అకృతవ్రణుడు భార్గవరాముణ్ణి చేరి ధైర్యాన్నీ కోల్పోవద్దని అనునయించాడు. ఇక జరగాల్సింది ఆలోచించు అని హితవుపలికాడు. రేణుకాదేవి అలా శోకిస్తూ 21సార్లు తన కడుపుమీద బాదుకుంది. భార్గవరాముడు దుఃఖాన్ని దిగమింగుకుని తల్లిని చేరాడు. ఎంతో ఆగ్రహంతో నిండిన స్వరంతో "తల్లీ! నీ భర్త, నా తండ్రి అయిన జమదగ్ని మహర్షిని చంపినవాడిని వదిలిపెట్టను. వాడితో సహా సమస్త క్షత్రియ లోకాన్నీ 21సార్లు భూమండలమంతా పర్యటించి వధిస్తాను. క్షత్రియుడన్నవాడు ఈ భూమి మీదే లేకుండా చేస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ" అని అన్నాడు.

**జమదగ్ని జీవించటం :** భార్గవరాముడు మాటలు విని కొంత ఊరట చెందింది రేణుకాదేవి. వెంటనే తన కుమారులందరినీ పిలిచి అందరితో నాయనా! పతిలేని జీవితం వ్యర్థం. నేను కూడా నా భర్తతో సహగమనం చేస్తాను. దయచేసి మీరెవ్వరూ నాకు అడ్డుచెప్పద్దు అని సహగమనానికి సిద్ధమయ్యింది. అంతలో ఆకాశవాణి "దేవీ రేణుకా! నీవు సహగమనం చేయవద్దు. దుఃఖాన్ని వదలి పెట్టు. అచిరకాలంలోనే నీ భర్త తిరిగి జీవిస్తాడు" అని పలికింది.

ఆమాటలు విన్న రేణుక ధైర్యాన్ని పొంది సహగమనాన్ని విరమించింది. అందరూ కలిసి జమదగ్ని శరీరాన్ని ఒకచోట భద్రంగా వుంచారు. అదే సమయంలో అధర్వణవేద పండితుడు మహామంత్రవేత్త అయిన ఒకముని అక్కడికి వచ్చాడు. ఆయనకు మృత సంజీవనీ విద్య తెలుసు. ఇది అందరు మహర్షులకూ తెలియదు. ఆయన జరిగినది అంతా విన్నాడు. వెంటనే సంజీవినీ విద్యని ప్రయోగించి జమదగ్ని మీద నీళ్ళు చిలకరించాడు. "నేను చేసిన యజ్ఞం తపస్సు ఫలవంతమైతే ఈ మహర్షి వెంటనే పైకి లేచుగాక" అని అన్నాడు. అంతే నిద్ర నుంచి లేచినట్టుగా జమదగ్ని పైకిలేచాడు. అది చూసి అందరూ ఎంతో సంతోషించాడు.

జమదగ్ని తనకు ప్రాణభిక్ష పెట్టిన ఆ ఋషిని సముచిత రీతిలో గౌరవించి ఎన్నో సపర్యలు చేసాడు. ఆయనతో "స్వామీ! నేను ఏ తప్పు చేయలేదా! ఆ రాజుని అతడి పరివారాన్ని ఆదరించి ఆతిథ్యమిచ్చినందుకు నాకీ కష్టం కలిగించారు. దీనికి కారణం ఏమిటి? అని అడిగాడు. మహర్షీ! కార్తవీర్యుడు దత్తాత్రేయవరప్రసాదుడు, మహాభక్తుడు. అయితే వరబలంతో ఒకనాడు వశిష్ఠ మహర్షిని అవమానించాడు. ఆయన రాబోయే కాలంలో ఒక మహర్షి మరణానికి కారకుడవై నీవు, నీతో సహా గర్వమదాంధులైన క్షత్రియులు మరణిస్తారు" అని శపించాడు. ఆయన శాపం జరిగి తీరాలి కదా!

అందుకే కార్తవీర్యుడు నీ మరణానికి కారకుడయ్యాడు. అది చూసి నీ పుత్రుడే భార్గవరాముడు క్షత్రియలోకాన్ని భూమండలం మీద లేకుండా చేస్తానని ప్రతిజ్ఞ చేసాడు. ఇదీ జరిగిన విషయం. ఇదంతా దైవ నిర్ణయం,

మీరంతా నిమిత్త మాత్రులు అంతే" అని చెప్పి తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళిపోయాడు ఆ ఋషి.

**పరశురాముడి ప్రతిజ్ఞాపాలన :** ఆ ఋషి వెళ్ళిపోగానే పరశురాముడు (భార్గవరాముడు) తండ్రిని సమీపించి "పితామహా! మిమ్మల్ని ఇంత ఘోరంగా అవమానించిన కార్తవీర్యుణ్ణి వధిస్తానని ప్రతిజ్ఞ చేసాను. అది నెరవేర్చేందుకు వెళుతున్నా అనుమతి నివ్వండి" అని ప్రార్థించాడు. జమదగ్ని నాయనా! మనం మునులం, తపస్వులం, తాపసులకు క్రోధం పనికిరాదు. అతన్ని క్షమించి వదిలిపెట్టు. తిరిగి నువ్వు తపస్సుని కొనసాగించు అని వారించాడు. ఆ మాటలు విన్న పరశురాముడు తండ్రీ! మీరు చెప్పింది నిజమే, అయితే అది సాధుజీవుల విషయంలో సరిపోతుంది.

ఈ కార్తవీర్యుడు గర్వంతో మదంతో ఇంతటి ఆకృత్యానికి పాల్పడ్డాడు. ఇలాంటి వాడిని వదిలిపెడితే నా ప్రతిజ్ఞ భంగమవుతుంది. ఇదికూడా మనకి శ్రేయస్కరం కాదుకదా! అన్నాడు. జమదగ్నికి అతడి మాటలూ సమంజసమేననిపించింది. సరే! నాయనా భవిష్యత్తుని ఎవరు ఆపగలరు. అయితే నీవు సరాసరి బ్రహ్మ దగ్గరకు వెళ్ళి ఆయనతో జరిగిన విషయమంతా చెప్పు. ఆయన ఏది ధర్మం అని చెబితే దాన్ని ఆచరించు" అని చెప్పాడు.

తండ్రి ద్వారా అనుమతి పొందిన పరశురాముడు బ్రహ్మలోకానికి వెళ్ళాడు. ఆయనకి నమస్కరించి జరిగిన వృత్తాంతమంతా ఆయనకి తెలియచేసాడు. అంతావిన్న బ్రహ్మ "వత్సా! నీ ప్రతిజ్ఞ ధర్మబద్ధమైనదే. ఈ సృష్టి మొత్తం నారాయణుడి దయతో నాచే సృష్టించబడింది. నీవు లోకంలో వున్న క్షత్రియులందరినీ వధిస్తానని ప్రతిజ్ఞచేసావు. భూలోకంలో వున్న ఎందరో క్షత్రియులు ఈశ్వరభక్తులు, శంకరకింకరులు. ఆయన అనుమతి లేనిదే వారందర్నీ సంహరించటం దుర్లభం. వారంతా తమ శరీరం మీద 'కవచం' అనే శక్తిని ధరించివుంటారు. నీవు ముందుగా శివలోకానికి వెళ్ళి ఆయన అనుమతి తీసుకో.

తరువాత గురపరంపర ద్వారా శ్రీకృష్ణుడి దివ్య మంత్రకవచాన్ని ధరించు. దుర్లభమైన వైష్ణవ తేజస్సుని శివశక్తి జయిస్తుంది. త్రైలోక్య విజయం అనే పరమాద్భుతమైన కవచం ఈశ్వరుడి దగ్గర వున్నది. నీవు ఆయన్ని మెప్పించి ఆ కవచాన్ని ఉపదేశం పొందారు. నీ మనోరథం సిద్ధిస్తుంది" అని చెప్పాడు.

పరశురాముడు బ్రహ్మదేవుడికి నమస్కరించి సరాసరి కైలాసానికి వెళ్ళాడు. పరమయోగీశ్వరులకు నిలయమైన ఆ కైలాసం ప్రమథగణాలతో పరివేష్టితమై దివ్యంగా శోభిస్తోంది. లోపలికి వెళ్ళిన పరశురాముడు పార్వతీ పరమేశ్వరుల్ని దర్శించి వారికి నమస్కరించాడు. భూలోకంలో జరిగిన విషయమంతా ఆయనకు వివరించాడు. అంతా విన్న శంకరుడు చిరునవ్వుతో "భార్గవరామా! 21సార్లు క్షత్రియులందరినీ హతమారుస్తానని, మహాశక్తివంతుడైన కార్తవీర్యుణ్ణి అస్త్రరహితంగా సంహరిస్తానని ఘోరమైన ప్రతిజ్ఞ చేసావు. అది సరే! కార్తవీర్యుడు అసామాన్యుడు కదా! తన కంటి చూపుతోనే రావణుడంతటి వాడిని బెదిరిపోయేలా చేసాడు. పైగా అతడికి దత్తాత్రేయుడు శ్రీహరి కవచాన్ని ప్రసాదించాడు కూడా. అతన్ని ఎలా జయిస్తావు? అని అన్నాడు. ఆ మాటలు విని స్వామీ! మీరే నాకు దిక్కు. ఎలాగైనా నా ప్రతిజ్ఞ నిలబడాలి. అని వేడుకున్నాడు పరశురాముడు.

శివుడు ఒక్కక్షణం ఆలోచించి జరగబోయే భవిష్యత్తు అనివార్యం అని గ్రహించి, భార్గవరాముడితో "నాయనా! నేటినుంచి నా ప్రక్కనే ఉండు ఒక దివ్యమైన మంత్రాన్ని (కవచాన్ని) నీకు ఉపదేశిస్తాను. దాని ప్రభావంతో నీవు కార్తవీర్యుణ్ణి సంహరించగలవు. త్రైలోక్య విజయమనే కవచంతోపాటు నాగాస్త్రం, పాశుపతం, బ్రహ్మాస్త్రం, నారాయణాస్త్రం, ఆగ్నేయ వారుణ్యాస్త్రాలు, గాంధర్వ గరుడాస్త్రాలు, గద, శక్తి, శూలం, దండం, వంటి శస్త్రాలను కూడా ఇస్తున్నాను అని వాటిని ప్రసాదించాడు. పరశురాముడు వాటన్నిటినీ గ్రహించి అక్కడ నుంచి భూలోకంలో పరమపవిత్రమైన పుష్కరతీర్థానికి చేరుకున్నాడు. అక్కడ తన అస్త్రాలన్నిటినీ సిద్ధి చేసుకుని, వాటితో కార్తవీర్యుణ్ణి అతడి సైన్యాన్ని ఘోరంగా సంహరించాడు. వారందరినీ సంహరించిన తరువాత అక్కడి నుంచి ముందుగా తన తండ్రి జమదగ్ని ఆశ్రమానికి వచ్చాడు పరశురాముడు.

# త్రైలోక్య విజయ మంత్రకవచం

**'గోపీజనవల్లభాయస్వాహా'** అనేది శ్రీకృష్ణుడి దశాక్షరమంత్రం. ఇది భక్తి ముక్తిప్రదమైన మంత్రం. ఈ మంత్రానికి సదాశివుడు ఋషి, పంక్తి ఛందస్సు, శ్రీకృష్ణుడు దేవత, సకలకార్యసిద్ధికోసం దీన్ని వినియోగించాలి. త్రైలోక్యవిజయం అనే కవచం ఎంతో శక్తివంతమైనది. దీనికి ఋషి-ప్రజాపతి, ఛందస్సు జగతి. దేవత శ్రీకృష్ణుడు. త్రైలోక్యవిజయ ప్రాప్తికోసం వినియోగించాలి.

## త్రైలోక్య విజయ కవచం

శృణు వత్స ప్రవక్ష్యామి కవచం పరమాద్భుతమ్ ।
మంత్రం చ సిద్ధిదం శశ్వత్సాధకానాం సుఖావహమ్ ॥ 1

గోపీజనపదస్యాంతే వల్లభాయ సముచ్చరేత్ ।
స్వాహాంతోఽయం మహామంత్రో దశార్ణో భుక్తి ముక్తిదః ॥ 2

సదాశివస్త్వస్య ఋషిః పంక్తిశ్ఛంద ఉదాహృతమ్ ।
దేవతా కృష్ణ ఉదితో వినియోగోఽఖిలాప్తయే ॥ 3

త్రైలోక్యవిజయస్యాథ కవచస్య ప్రజాపతిః ।
ఋషిశ్ఛందశ్చ జగతీ దేవో రాజేశ్వరః స్వయమ్ ॥ 4

త్రైలోక్య విజయప్రాప్తౌ వినియోగః ప్రకీర్తితః ।
ప్రణవో మే శిరః పాతు శ్రీకృష్ణాయ నమః సదా ॥ 5

పాయాత్కపాలం కృష్ణాయ స్వాహేతి సతతం మమ ।
కృష్ణేతి పాతు నేత్రే మే కృష్ణ స్వాహేతి తారకామ్ ॥ 6

హరయే నమ ఇత్యేష భ్రూలతాం పాతు మే సదా ।
ఓం గోవిందాయస్వాహేతి నాసికాం పాతు సంతతమ్ ॥ 7

గోపాలయ నమో గండం పాతు మే సతతం మనుః ।
క్లీం కృష్ణాయ నమః కర్ణౌ పాతు కల్ప తరుర్మమ ॥ 8

శ్రీం కృష్ణాయ నమః పాతు నిత్యం మేఽధర యుగ్మకమ్ ।
ఓం గోపీశాయ స్వాహేతి దంతపంక్తిం మమావతు ॥ 9

శ్రీకృష్ణేతి రదచ్ఛిద్రం పాతు మే త్ర్యక్షరో మనుః ।
ఓం శ్రీకృష్ణాయ స్వాహేతి జిహ్వికాం పాతు మే సదా ॥ 10

రామేశ్వరాయ స్వాహేతి తాలుకం పాతు మే సదా ।
రాధికేశాయ స్వాహేతి కంఠం మే పాతు సర్వదా ॥ 11

నమో గోపీగణేశాయ గ్రీవాం మే పాతు సర్వదా ।
ఓం గోపేశాయ స్వాహేతి స్కంధౌ పాతు సదా మమ ॥ 12

నమః కిశోరవేషాయ స్వాహా పృష్ఠం మమావతు ।
ఉదరం పాతు మే నిత్యం ముకుందాయ నమో మనుః ॥ 13

హ్రీం శ్రీం క్లీం కృష్ణాయ స్వాహా కరౌ పాతు సదా మమ ।
ఓం విష్ణవే నమః స్వాహా బాహుయుగ్మం మమావతు ॥ 14

ఓం హ్రీం భగవతే స్వాహా నఖపంక్తిం మమావతు ।
నమో నారాయణాయేతి నఖరంధ్రం మమావతు ॥ 15

ఓం హ్రీం శ్రీం పద్మనాభాయ నాభిం పాతు సదా మమ ।
ఓం సర్వేశాయ స్వాహేతి కేశాన్మమ సదా ఽవతు ॥ 16

నమః కృష్ణాయ స్వాహేతి బ్రహ్మరంధ్రం సదాఽవతు ।
నమో మాధవాయ స్వాహేతి భాలం మే సర్వదా ఽవతు ॥ 17

ఓం హ్రీం శ్రీం రసికేశాయ కటిం మమ సదాఽవతు ।
నమో గోపీజనేశాయ ఊరూ పాతు సదా మమ ॥ 18

ఓం నమో దైత్యనాశాయ స్వాహేత్యవతు జానునీ ।
యశోదానందనాయేతి నమోంతో జంఘకేఽవతు ॥ 19

రాసారంభప్రియాయేతి స్వాహాంతో హ్రీం మమావతు ।
వృందాప్రియాయ స్వాహేతి సకలాంగాని మేఽవతు ॥ 20

పరిపూర్ణమనాః కృష్ణః ప్రాచ్యాం మాం సర్వదాఽవతు ।
స్వయం గోలోకనాథో మామాగ్నేయ్యాం దిశి రక్షతు ॥ 21

పూర్ణబ్రహ్మస్వరూపశ్చ దక్షిణే మాం సదా ఽవతు ।
నైరృత్యాం పాతు మాం కృష్ణః పశ్చిమే పాతు మాం హరిః ॥ 22

గోవిందః పాతు వాయవ్యాముత్తరే రసికేశ్వరః ।
ఐశాన్యాం మే సదా పాతు బృందావనవిహారకృత్ ॥ 23

వృందాప్రాణేశ్వరః శశ్వత్ పాతు మామూర్ధ్వదేశతః ।
సదైవ మామధః పాతు బలిధ్వంసీ మహాబలః ॥ 24

జలే స్థలే చాంతరిక్షే నృసింహః పాతు మాం సదా ।
స్వప్నే జాగరణే చైవ పాతు మాం మాధవః స్వయమ్ ॥ 25

సర్వాంతరాత్మా నిర్లిప్తః పాతు మాం సర్వతో విభుః ।
ఇతి తే కథితం భూప సర్వాఘౌఘవినాశనమ్ ॥ 26

త్రైలోక్యవిజయం నామ కవచం పరమేశితుః ।
మయా శ్రుతం శివముఖాత్ప్రవక్తవ్యం న కస్యచిత్ ॥ 27

గురుమభ్యర్చ్య విధివత్కవచం ధారయేత్తు యః ।
కంఠే వా దక్షిణే బాహౌ సోఽపి విష్ణు ర్నసంశయః ॥ 28

స సాధకోఽవసద్యత్ర తత్ర వాణీరమే స్థితే ।
యదిస్యాత్సిద్ధకవచో జీవన్ముక్తో న సంశయః ॥ 29

నిశ్చితం కోటి వర్షాణాం పూజాయాః ఫలమాప్నుయాత్ ।
రాజసూయసహస్రాణి వాజపేయశతాని చ ॥ 30

మహాదానాని యాన్యేవ భువశ్చాపి ప్రదక్షిణా ।
త్రైలోక్య విజయస్యాస్య కలాం నార్హంతి షోడశీమ్ ॥ 31

వ్రతోపవాసనియమాః స్వాధ్యాయాధ్యయనే తథా ।
స్నానం చ సర్వతీర్థేషు నాస్యార్హంతి కలామపి ॥ 32

సిద్ధత్వమమరత్వం చ దాసత్వం శ్రీహరేరపి ।
యది స్యాత్సిద్ధకవచః సర్వం ప్రాప్నోతి నిశ్చితమ్ ॥ 33

స భవేత్సిద్ధకవచో దశలక్షం జపేత్తు యః యో ।
భవేత్సిద్ధకవచో విజయీ స భవేత్ ధ్రువమ్ ॥ 34

రాజ్యం దేయం శిరో దేయం ప్రాణా దేయాశ్చ భూపతే ।
ఏతత్తు కవచం వత్స న దేయం సంకటే ఽపి చ ॥ 35

మయా ప్రకాశితం యత్తే చైతేషాం త్రాణకారణాత్ ।
మమాజ్ఞాకరణాచ్చైవ తద్విద్ధి కులభాస్కర ।
ఇదం ధృత్వా తు కవచం చక్రవర్తీ భవాన్ భవ ॥ 36

*(శ్లో॥2-37, అధ్యా-33, పూ.భా)*

**కవచఫలం :** ఈ దివ్యకవచాన్ని పరమేశ్వరుడు ప్రబోధించాడు. గురుముఖతః ఈ కవచాన్ని స్వీకరించాలి. విధివిధానంగా ఈ దివ్యకవచాన్ని కంఠంలోగానీ, కుడిచేతికి గానీ ధరించాలి. ఈ కవచాన్ని ధరించినవాడు విష్ణువుతో సమానం. ఈ కవచాన్ని ధరించిన వాడి ఇంట లక్ష్మీ సరస్వతులు స్థిరంగా వుంటారు. ఈ కవచ సిద్ధిని పొందినవాడు జీవన్ముక్తుడు. పదిలక్షలసార్లు ఈ కవచమంత్రాన్ని జపిస్తే అది సిద్ధిస్తుంది. మంత్రం సిద్ధించినవాడికి సకల కార్యాలలో దిగ్విజయం లభిస్తుంది. రాజ్యాన్నైనా ఇవ్వవచ్చు కానీ ఈ కవచాన్నీ ఎవ్వరికీ ఇవ్వకూడదు.

## శ్రీకృష్ణామృత స్తోత్రం

ఆదిశేషుడు పాతాళలోకంలో నివసిస్తూ భూమండలాన్నంతా భరిస్తున్నాడు. ఆయన సమీపంలో ఎందరో నాగరాజులు, మరెందరో మహర్షులు కూర్చుని వున్నారు. ప్రతిరోజు ఆదిశేషుడు ఏవో పారమార్థికమైన విషయాలు వారికి బోధిస్తుండేవాడు ఒకరోజు భూదేవి కూడా ఆయన దగ్గరకి వచ్చి కూర్చుంది. ఆ రోజు ఆదిశేషుడు మహామహిమాన్వితమైన శ్రీకృష్ణ ప్రేమామృతస్తోత్రాన్ని వారికి వినిపించాడు. అది 108 శ్రీకృష్ణుడి దివ్యనామాలతో కూడుకుని వుంది.

## శ్రీకృష్ణుడి నామామృత స్తోత్రం

సర్వమంగళ మూర్ధన్యమణిమాద్యష్ట సిద్ధిదమ్ ।
మహాపాతకోటిఘ్నం సర్వతీర్థఫలప్రదమ్ ॥ 1

సమస్త జపయజ్ఞానాం ఫలదం పాపనాశనమ్ ।
శృణు దేవి ప్రవక్ష్యామి నామ్నామష్టోత్తరం శతమ్ ॥ 2

సమస్తనామ్నాం పుణ్యానాం త్రిరావృత్యాతు యత్ఫలమ్ ।
ఏకావృత్యా తు కృష్ణస్య నామైకం తత్ప్రయచ్ఛతి ॥ 3

తస్మాత్పుణ్యతరం చైతత్ స్తోత్రం పాతకనాశనమ్ ।
నామ్నామష్టోత్తర శతస్యాహమేవ ఋషిః ప్రియే ॥ 4

ఛందోఽనుష్టుబ్దేవతా తు యోగః కృష్ణప్రియావహః ।
శ్రీకృష్ణః కమలానాథో వాసుదేవః సనాతనః ॥ 5

వసుదేవాత్మజః పుణ్యో లీలామానుషవిగ్రహః ।
శ్రీవత్సకౌస్తుభధరో, యశోదావత్సలో హరిః ॥ 6

చతుర్భుజాత్తరచక్రాసిగదాశంఖాద్యుదాయుధః ।
దేవకీ నందనః శ్రీశో నందగోపోప్రియాత్మజః ॥ 7

యమునావేగసంహారీ బలభద్రప్రియానుజః ।
పూతనాజీవితహరః శకటాసురభంజనః ॥ 8

నందవ్రజజనానందీ సచ్చిదానందవిగ్రహః ।
నవనీతవిలిప్తాంగో నవనీతనటోఽనఘః ॥ 9

నవనీతలవాహారీ ముచికుందప్రసాదకృత్ ।
షోడశస్త్రీసహస్రేశ స్త్రిభంగీ మధురాకృతిః ॥ 10

శుకవాగమృతాబ్ధీందుర్గోవిందో గోవిదాం పతిః ।
వత్సపాలనసంచారీ ధేనుకాసురమర్దనః ॥ 11

తృణీ కృతతృణావర్తో యమలార్జున భంజనః ।
ఉత్తాలతాలభేత్తా చ తమాలశ్యామలాకృతిః ॥ 12

గోపగోపీశ్వరో యోగీ సూర్యకోటి సమప్రభః ।
ఇలాపతిః పరంజ్యోతి ర్యాదవేంద్రో యదూద్వహః ॥ 13

వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః ।
గోవర్ధనాచలోద్ధర్తా గోపాలః సర్వపాలకః ॥ 14

అజో నిరంజనః కామజనకః కంజలోచనః ।
మధుహా మధురానాథో ద్వారకానాథకో బలీ ॥ 15

బృందావనాంతసంచారీ తులసీదామభూషణః ।
స్యమంతకమణేర్హర్తా నరనారాయణాత్మకః ॥ 16

సంసారవైరీ కంసారీ, మురారిర్నరకాంతకః ।
అనాదిబ్రహ్మచారీ చ కృష్ణావ్యసనకర్షకః ॥ 17

శిశుపాలశిరచ్ఛేత్తా దుర్యోధన కులాంతకృత్ ।
విదురాక్రూరవరదో విశ్వరూప ప్రదర్శకః ॥ 18

సత్యవాక్సత్యసంకల్పః సత్యభామారతో జయీ ।
సుభద్రాపూర్వజో విష్ణుర్భీష్మముక్తిప్రదాయకః ॥ 19

జగద్గురుర్జగన్నాథో వేణువాద్యవిశారదః ।
వృషభాసురవిధ్వంసీ బకారిర్బాణ బాహుకృత్ ॥ 20

యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హి బర్హావతంసకః ।
పార్థసారథి రవ్యక్తో గీతామృతమహోదధిః ॥ 21

కాలీయఫణి మాణిక్యరంజిత శ్రీపదాంబుజః ।
దామోదరో యజ్ఞభోక్తా దానవేంద్రవినాశనః ॥ 22

నారాయణః పరం బ్రహ్మపన్నగాశనవాహనః ।
జలక్రీడాసమాసక్త గోపీవస్త్రాపహారః ॥ 23

పుణ్యశ్లోకస్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః ।
సర్వతీర్థాత్మకః సర్వగ్రహరూపీ పరాత్పరః ॥ 24

ఇత్యేవం కృష్ణదేవస్య నామ్నామష్టోత్తరం శతమ్ ।
కృష్ణేన కృష్ణభక్తేన శ్రుత్వా గీతామృతం పురా ॥ 25

స్తోత్రం కృష్ణప్రియకరం కృతం తస్మాన్మయా శ్రుతమ్ ।
కృష్ణప్రేమామృతం నామ పరమానందదాయకమ్ ॥ 26

అత్యుపద్రవ దుఃఖఘ్నం పరమాయుష్యవర్ధనమ్ ।
దానం వ్రతం తపస్తీర్థం యత్కృతం త్విహజన్మని ॥ 27

పఠతాం శృణ్వతాం చైవ కోటికోటిగుణం భవేత్ ।
పుత్రప్రదమపుత్రాణామగతీనాం గతిప్రదమ్ ॥ 28

*(శ్లో॥16-45 అధ్యా-26, పూ.భా)*

**ఫలశ్రుతి :**

శ్రీకృష్ణుడికి అత్యంత ప్రీతిపాత్రమైన ఈ అష్టోత్తర శతనామ స్తోత్రం వేదవ్యాసుడి చేత రచించబడింది. ★ఈ స్తోత్రాన్ని శ్రీకృష్ణ నామామృత స్తోత్రం అని కూడా అంటారు. ★ఇది సకల సుఖాల్ని ప్రసాదిస్తుంది. ★పుత్రులు లేనివారికి సంతానాన్ని ప్రసాదిస్తుంది. ★ధనం, ధాన్యం, ఐశ్వర్యాలను ప్రసాదిస్తుంది. ★ఆయుర్దాయాన్ని వృద్ధిచేసి చివరకు మోక్షాన్ని ప్రసాదిస్తుంది. ★తాపత్రయాల్ని నివారిస్తుంది. మంత్రసిద్ధిపొందని వారికి సిద్ధిని కలిగిస్తుంది. ★దరిద్రుల్ని ధనవంతుల్ని చేస్తుంది.

## శ్రీకృష్ణుడి శ్లోకమంత్రం

శ్లో॥ కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయయోగినే ।
నాథాయ రుక్మిణీశాయ నమోవేదాంత వేదినే ॥

'శ్రీకృష్ణుడికు, యాదవేంద్రుడికి, జ్ఞానసముద్రుడికి, యోగికి, లోకనాథుడికి, రుక్మిణీదేవి భర్తకు, వేదాంత వేద్యుడికి నమస్కారం"

ఓ భూదేవీ! రాత్రిపగలు ఈ దివ్యమంత్రాన్ని జపించినవాడికి సర్వగ్రహాలు అనుకూలమవుతాయి. అందరికీ అతడు ప్రీతిపాత్రుడవుతాడు. సర్వసిద్ధులు పొంది భోగభాగ్యాలు అనుభవిస్తాడు. చివరకు శ్రీకృష్ణ సాయుజ్యాన్ని పొందుతాడు అని ఆదిశేషుడు చెప్పాడు.

## ఏకదంతుడి వృత్తాంతం

పరమేశ్వర వరప్రసాదమైన దివ్యశస్త్రాస్త్రాలతో, త్రైలోక్యమోహన కవచప్రభావంతో భార్గవరాముడు (పరశురాముడు) కార్తవీర్యార్జునుణ్ణి, అతడి కుమారుల్ని, సమస్త పరివారాన్ని అవలీలగా వధించాడు. యుద్ధం ముగిసాక తన మిత్రుడు అకృతవ్రణుడితో కలిసి పరమేశ్వరుణ్ణి దర్శించాలని కైలాస పర్వతానికి వచ్చాడు. కైలాస మందిరంలో పార్వతీ పరమేశ్వరులు ఏకాంతంగా వున్నారు. పరశురాముడు ఆ మందిర ద్వారం దగ్గరకి వచ్చేసరికి అక్కడ వినాయకుడు, కార్తికేయుడు కాపలాగా వున్నారు.

శివపుత్రులైన వారిని చూసి పరశురాముడు భక్తిగా నమస్కరించాడు. అలాగే ఆ సమీపంలో వున్న క్షేత్రపాలకులందరికీ నమస్కరించి, లోపలికి ప్రవేశించబోయాడు. అంతలో వినాయకుడు భార్గవరామడితో “మహానుభావా! ఆగాగు లోపల పార్వతీ పరమేశ్వరులు ఏకాంతంలో వున్నారు. నేను లోపలకి వెళ్ళి ఆయన ఆజ్ఞ తీసుకుని వస్తాను కొద్దిసేపు ఇక్కడే నిలు” అని పలికాడు.

వినాయకుడి మాటలు విన్న పరశురాముడు “సోదరా! నీవు వెళ్ళి అనుమతి తీసుకురావటం ఎందుకు? నేనిప్పుడే వెళ్ళి వారికి నమస్కరించి వస్తాను. నాకు అనుమతి ఎందుకు? భూలోకంలో మహావీరులైన కార్తవీర్యాది ఎందరో రాజుల్ని శివవరప్రసాదంతో సంహరించాను. ఆ విషయాన్ని స్వామికి నివేదించి వెళ్ళిపోతాను అంతే! నన్ను వెళ్ళనీ’ అన్నాడు.

పరశురామా! కాస్త ఆగు ఏకాంతంలోవున్న పితరుల్ని దర్శించటం పాపం. వారి ఏకాంతానికి భంగం కలిగించటం దోషం. కొద్దిసేపు ఓర్పువహించు అని తిరిగి మృదువుగా చెప్పాడు వినాయకుడు. పరశురాముడికి కోపం వచ్చింది. నేనూ శివుడి కుమారుణ్ణే. నాకు ప్రత్యేకంగా అనుమతి అవసరం లేదు అని గట్టిగా పలికి అకృతవ్రణుడితో సహా లోపలికి అడుగుపెట్టాడు. ఇక సహనం కోల్పోయిన గణపతి వారిద్ధరినీ బైటికి లాగిపడేసాడు.

పరశురాముడికి కోపం వచ్చింది. వెంటనే తన చేతిలోని గండ్రగొడ్డలిని వినాయకుడి మీదకి విసరబోయాడు. అది చూసిన వినాయకుడు లాఘవంగా అతన్ని ఒడిసిపట్టి ఏడు ఊర్ధ్వలోకాలు, ఏడు అథోలోకాల్లోకి త్రిప్పి తీసుకుపోయాడు. అక్కడ నుంచి ఊర్ధ్వలోకాల్లోకి తీసుకువచ్చి అక్కడున్న పెద్ద సరోవరంలోకి విసిరేశాడు. దాంతో భయపడిపోయిన పరశురాముడు రక్షించమని వేడుకోగా తిరిగి పూర్వం ఉన్న స్థానానికి తీసుకువచ్చాడు వినాయకుడు.

హమ్మయ్యా ఎలాగైతేనేం నా ప్రాణాలు రక్షించుకున్నాను. తిరిగి యథాస్థానానికి చేరుకున్నాను అని సంతోషించాడు పరశురాముడు. అయితే

తనని ఇంతగా పరాభవించి నందుకు గణపతిమీద మనసులో కోపం రగిలిపోతోంది. ఆగ్రహాన్ని ఆపుకోలేక తన చేతులోవున్న పరశువుని గణపతి మీదకి ప్రయోగించాడు. ఆ పరశువు అజేయమైంది దానికి తిరిగులేదు. ఈ విషయాన్ని పరమేశ్వరుడు స్వయంగా చెప్పాడు. గణపతి విషయం గ్రహించాడు. తండ్రి ప్రసాదించిన పరశువు శక్తిని గౌరవించి ఆ గొడ్డలికి తన ఎడమదంతాన్ని తాకించాడు. వెంటనే ఆ దంతం పగిలి నేల మీద పడింది.

వినాయకుడి దంతపతనంతో భూమి ఒక్కసారిగా కంపించింది. సముద్రాలు ఘోషించాయి. ఆ దంతం నుంచి కారిన రక్తంతో భూమంతా తడిసిపోయింది. లోకాలన్నీ భయపడిపోయాయి. దేవతలందరూ హాహా కారాలు చేసారు. ఆ భయానక దృశ్యంచూసి కార్తికేయుడు తదితర గణాలు గట్టిగా ఏడవటం ప్రారంభించారు. బైట జరుగుతున్న ఈ కలకలం లోపలున్న పార్వతీ పరమేశ్వరులకి వినిపించింది. వారు బైటకి వచ్చారు. ఎదురుగా రక్తసిక్తమైన ముఖంతో గణపతి ఏకదంతుడిగా కనిపించాడు. పుత్రుణ్ణి అలా చూసి చలించిపోయింది పార్వతి? వెంటనే కుమారస్వామిని పిలిచి నాయనా ఏమిటీ ఉత్పాతం! అసలేం జరిగింది? అని అడిగింది. స్కందుడు జరిగిన విషయమంతా తల్లికి చెప్పాడు. అంతా విన్న పార్వతికి కోపం ముంచుకొచ్చింది. ఎదురుగా వున్న పరమేశ్వరుడితో ఇలా అన్నది.

ప్రభూ! చూసారా! తమ శిష్యుడైన భార్గవుడు ఎంత పని చేసాడో. సోదరసమానుడని కూడా చూడకుండా మన గణపతికి ఎంత బాధకలిగించాడో! మీరిచ్చిన ఆయుధాన్ని మీ కుమారుడి మీదే ప్రయోగించాడు. ఇంతకన్నా నాకు వేరే అవమానం లేదు. ఇక నేనిక్కడ ఉండలేను. నా పుత్రుల్ని తీసుకుని నా తండ్రిగారింటికి వెళ్ళిపోతా అని కోపంగా అంతఃపురం లోపలికి వెళ్ళింది. శివుడు ఆమె మాటలు విని వెంటనే సంధానకర్త అయన రాధాకృష్ణుల్ని స్మరించాడు. వెంటనే వారిద్దరూ ఆయనముందు ప్రత్యక్షమయ్యారు. జరిగిన విషయమంతా వారికి తెలియచేసాడు శంకరుడు.

ఎలాగైనా పార్వతిని శాంతింపచేయమని కోరాడు. సరేనన్నారు రాధాకృష్ణులు. శివుడు వారిద్దరినీ సాదరంగా తన మందిరంలోకి తీసుకువెళ్ళాడు. లోపలున్న పార్వతీ దేవి కూడా వారిద్దరికీ స్వాగతం పలికి కూర్చోబెట్టింది.

వారి వెనుకే వచ్చిన భార్గవరాముడు అపరాథభావంతో కుమిలిపోతూ పార్వతీదేవి పాదాలమీద పడిపోయాడు. క్షమించమని దీనంగా ప్రార్థించాడు. అయినా పార్వతీ కోపం చల్లారలేదు అతన్ని మన్నించలేదు. అది చూసి శ్రీకృష్ణుడు మృదువుగా దేవీ! పార్వతీ! శాంతించవమ్మా! ఈ పరశురాముడు కూడా నీ బిడ్డ లాంటివాడే. అపరాధం చేసానన్న పశ్చాత్తాపంతో నీ పాదాల మీద పడ్డాడు. ఇతన్ని కాస్త కనికరించవమ్మా. ఒక దంతం విరిగి నీ కుమారుడైన వినాయకుడి కీర్తికి ఏమాత్రం లోటురాదు. అతడు ఎంత గొప్పవాడవుతాడో, సకలలోకాల చేతా ఎలా పూజించబడుతాడో చెబుతున్నా విను అని గణపతి ప్రాశస్త్యం గురించి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

## ఏకదంతుడి ప్రాశస్త్యం

పార్వతీ! నీ కుమారుడైన వినాయకుడు గొప్పవారికన్నా ఎంతో గొప్పవాడు. అతన్ని కామం, క్రోధం, ఉద్వేగం, భయం అనేవి ఎప్పుడూ చేరవు. అతడి నామాలన్నీ ఎంతో పుణ్యప్రదమైనవి. వేదాల్లో, పురాణాల్లో, స్మృతిగ్రంథాల్లో చెప్పబడినవి. ఆయన నామాలు పాపహరాలు. అవి ఏమిటో చెబుతున్నాను.

**1. గణేశుడు :** నానారూపాలతో ఉండే మహాబలవంతులతో కూడుకున్నవి ప్రమథగణాలు. వాటికి ఈశుడు అనగా అధిపతి కాబట్టి అతడు గణేశుడు.

**2. లంబోదరుడు :** ఆయన ఉదరంలో భూత భవిష్యత్ వర్తమానాలు స్థిరమైవున్న అఖిలబ్రహ్మాండాలు వున్నాయి. కనుక అతడు లంబోదరుడు.

**3. గజాననుడు :** పూర్వం విధివశాత్తు తన తల తెగిపడగా తిరిగి ఏనుగుతలను స్వీకరించటం చేత అతడు గజాననుడయ్యాడు.

**4. ఫాలచంద్రుడు :** పూర్వం చతుర్దశినాడు 'దర్భి' అనే మహర్షిచేత చంద్రుడు శపించబడ్డాడు. అప్పుడు విఘ్నేశ్వరుడు చిక్కిన ఆ చంద్రుణ్ణి తన ఫాలభాగంలో ధరించాడు. కనుక ఫాలచంద్రుడు అని ఆయనకు పేరు.

**5. శూర్పకర్ణుడు :** అగ్నిదేవుడు పూర్వం సప్తర్షుల చేత శపించబడ్డాడు. దానివల్ల బాగా క్షీణించిపోయాడు. అయితే తిరిగి వినాయకుడి ద్వారా విసరబడి తిరిగి ప్రజ్వరిల్లాడు. అందుకే గణేశుడు శూర్ప(చేట)కర్ణుడయ్యాడు.

**6. విఘ్ననాశకుడు :** పూర్వం దేవాసురసంగ్రామం జరిగేడప్పుడు యుద్ధంలో దేవతలందరి చేతా ఆయన పూజలందుకుని, వారి విఘ్నాలన్నిటినీ తొలగించాడు కనుక ఆయన విఘ్ననాశకుడయ్యాడు.

**7. ఏకదంతుడు :** ఇప్పుడు దైవికంగా భార్గవరాముడి చేత ఒక దంతం విరగగొట్టబడటం వల్ల ఏకదంతుడయ్యాడు.

అమ్మా! పార్వతీ! భవిష్యత్తులో నీ కుమారుడి తొండం వంకరగా అవుతుంది. అప్పుడు పండితులందరూ అతన్ని వక్రతుండుడని సంబోధిస్తారు. తల్లీ! నీ కుమారుడి నామాలన్నీ పరమపవిత్రమైనవి. వాటిని స్మరించినంతనే సకల పాపాల్ని హరిస్తాయి. రాబోయే కల్పాలలో నీకుమారుడైన గణపతిని ఆదిపూజ్యుడుగా అందరిచేతా గౌరవించబడేలా నేను వరాన్నిస్తున్నాను.

జాతకర్మాది సంస్కారే గర్భాదానాదికేఽపిచ ।
యాత్రాయాంచ వణిజ్యాదే యుద్ధేదేవార్చనే శుభౌ ॥
సంకష్టేకామ్య సిద్ధ్యర్థం పాజయేద్యోగజాననమ్ ।
తస్య సర్వాణి కార్యాణి సిద్ధ్యంత్యేవనసంశయః ॥

*(శ్లో॥43-44 అధ్యా, 42)*

జాతకర్మలు లాంటి సంస్కారాలు చేసే సమయంలో గర్భాదానాది కార్యక్రమాలలో, యాత్రలకు వెళ్ళేటప్పుడు, వ్యాపారాలు ప్రారంభించేడప్పుడు, దేవతార్చన చేయటానికి ముందు కష్టాలు సంభవించినప్పుడు ఎవడైతే గజాననుణ్ణి పూజిస్తారో వారికి సర్వకార్యాలూ నిర్విఘ్నంగా సిద్ధిస్తాయి" అని అన్నాడు.

శ్రీకృష్ణుడు తన కుమారుడి గొప్పతనాన్ని ప్రాశస్త్యాని గురించి చెప్పేసరికి పార్వతీదేవికి ఎంతో ఆనందం ఆశ్చర్యం రెండూ కలిగాయి. అయినా ఆమె భార్గవరాముడి విషయంలో ఏమీ స్పందించలేదు. అప్పుడు రాధాదేవి ఆమె దగ్గరకు వచ్చి గాయంతో వున్న వినాయకుణ్ణి తన దివ్యహస్తంతో తాకింది.

వెంటనే వినాయకుడి గాయం మాయమయ్యింది. అది చూసాక పార్వతీదేవి కాస్త శాంతించింది. ఆదే సమయంలో భార్గవరాముడు తిరిగి ఆమె పాదాల మీద పడ్డాడు. కరుణించిన పార్వతి అతన్ని పైకి లేవనెత్తి క్షమించి దీవించింది. భార్గవరాముడు గణేశుడు ఇద్దరూ పరస్పరం కౌగిలించుకున్నారు. అందరూ ఎంతో ఆనందించారు.

## పరశురాముడు చేసిన దేవతాస్తుతి

ప్రకృతివికృతి జాతం విశ్వమేతద్విధాతుమ్ మమ కియ దనుభూతం వైభవం తత్ర్పమాతుమ్।
అవిదిత తనునామాఽభీష్టవస్త్వేకధా మాఽభవదథ భవ భామా పాతు మాం పూర్ణకామా।
ప్రకటి తగుణభావం కాలసంఖ్యా విధానం సకలభవనిదానం కీర్తయే యత్ప్రధానమ్ ।
తదిహ నిఖిలతాతః సంబభూవోక్షపాతః కృతకృతకనిపాతః పాతు మామద్యమాతః ॥
దనుజకులవినాశీ లేఖపాతా వినాశీ ప్రథమకులవికాశీ సర్వవిద్యా ప్రకాశీ ।
ప్రసభరచితకాశీ భక్తదత్తాభిలాశీ రవతువిజితపాశీ మాం సదాషణ్ముఖాశీ ॥
హర నికటనివాసీ కృష్ణసేవా విలాసీ ప్రణతజన విభాసీ గోపకన్యాప్రహాసీ ।
హరకృత బహుమానో గోపికేశైకతానో విదితబహువిధానో జాయతాం కీర్తిహానో ॥
ప్రభు నియతమనాయో నున్న భక్తాంతరాయో హృతదురితనికాయో జ్ఞానదాతా పరాయోః।
సకల గుణగరిష్ఠో రాధికాంకే నివిష్టో మమ కృతమపరాధం క్షంతుమర్హత్యగాధమ్ ॥
యా రాధా జగదుద్భవస్థితి లయేష్వారాధ్యతే వా జనైః ।
శబ్దం బోధయతీశ వక్త్రవిగలత్ ప్రేమామృతాస్వాదనమ్ ।
రాసేశీ రసికేశ్వరీ రమణహృన్నిష్ఠా నిజానందినీ నేత్రీ ।
సా పరిపాతు మామవనతం రాధేతి యా కీర్త్యతే ॥ *(శ్లో॥3-8 అధ్యా-43, పూ.భా)*

పరశురాముడు ముందుగా తనకు క్షమాభిక్ష పెట్టిన పార్వతీదేవిని తరువాత వినాయక కార్తికేయుల్ని వారి తరువాత శ్రీకృష్ణ-రాధాదేవిని ఘనంగా స్తుతించాడు. భార్గవరాముడి స్తుతికి ఆనందించిన రాధాకృష్ణులు అతనికి అభీష్టవరాల్ని ప్రసాదించి అంతర్ధానమయ్యారు. భార్గవరాముడు సంతోషంతో అకృతవరుణ్ణి వెంటబెట్టుకుని తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు.

# ధన్వంతరి జననం

మహావీరుడైన 'ఆయువు'కి అయిదుగురు పుత్రులు. వారంతా మహాబలవంతులు. వారి తల్లి ప్రభాదేవి. ఆ అయిదుగురు పుత్రుల్లో పెద్దవాడు 'నహుషుడు' తరువాత వారు వరుసగా క్షత్రవృద్ధుడు, రంభుడు, రాజు, అనేనుడు. వీరంతా ముల్లోకాల్లో ఎంతో ప్రసిద్ధిపొందారు. వీరితో క్షత్రవృద్ధుడి కుమారుడు 'సునహోత్రుడు', ఇతడు ఎంతో కీర్తిప్రతిష్ఠలు సంపాదించాడు. ఇతడికి కాశుడు, శలుడు, గృత్సమదుడు అని ముగ్గురు కుమారులుదయించారు. వీరిలో గృత్సమదుడి పుత్రుడు శౌనకుడు. ఈ శౌనకుడు ఎంతో విచిత్రమైన కర్మల్ని ఆచరించటం వల్ల బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య వర్ణాలవారు వారి వంశంలో జన్మించారు. సునహోత్రుడి రెండో కుమారుడైన శలుడికి అర్ష్ణిసేనుడు జన్మించాడు. అతడి కుమారుడు శశిరుడు. వీరిలో శౌనకుడు, అర్ష్ణిసేనుడు క్షత్రియవర్ణంతో కూడిన బ్రాహ్మణులు. ఇక సునహోత్రుడి మూడో పుత్రుడైన కాశ్యుడికి దీర్ఘతపుడనేవాడు జన్మించాడు. ఆ దీర్ఘతపుడికి ధన్వంతరి జన్మించాడు.

ధన్వంతరి ఎంతో జ్ఞానం కలిగినవాడు. ఇతడు ఏ విధంగా జన్మించాడంటే – పూర్వం దేవతలు దానవులు అమృతం కోసం సాగరాన్ని మథిస్తుండగా ఆ సముద్రం మధ్యనుంచి ధన్వంతరి ఆవిర్భవించాడు. అతడు పుట్టిన వెంటనే దివ్యమైన కాంతితో వెలిగిపోతున్నాడు. అప్పుడు అక్కడే వున్న ఒకడు నీవు నీటినుంచి పుట్టావు గనుక నీపేరు అబ్జుడు అన్నాడు. అప్పుడు ఆ అబ్జుడు (ధన్వంతరి) అక్కడ నుంచున్న విష్ణువుతో "ప్రభూ! నేను నీ పుత్రుడిని, దయచేసి నాకు కూడా లోకంలో ఒక ప్రత్యేకమైన స్థానాన్ని కల్పించు" అని కోరాడు. విష్ణువు అతడితో "అబ్జా! యజ్ఞ విభాగం అంతా దైత్యులచేత, దేవతల చేతా చేయబడింది. మహర్షులందరూ వేద విధిని అనుసరించే హోమాలు చేస్తారు. అందువల్ల వారు నీ గురించి హోమం చేయటం సాధ్యంకాదు. ఎందుకంటే! నీవు వేదాలు పుట్టిన తరువాత జన్మించావు. కనుక నీకు ప్రత్యేకంగా ఏ మంత్రమూ లేదు. నీకు ఈ జన్మలో కాదు రెండోజన్మలో గొప్ప ఖ్యాతిని పొందుతావు. నీకు గొప్పసిద్ధి కలుగుతుంది.

అబ్బా! (ధన్వంతరీ) నీవు శరీరంతోనే దేవతా స్థితిని పొందుతావు. బ్రాహ్మణులందరూ నిన్ను చతుర్వేద మంత్రాలతో పంచగవ్యాలతో పూజిస్తారు. నీవు మరోసారి ఆయుర్వేదాన్ని పునరుద్ధరిస్తావు. నీకు సంబంధించి భవిష్యత్తులో జరగబోయేవన్నీ బ్రహ్మదేవుడు దర్శించి నాకు చెప్పాడు. ఆయన మాటప్రకారం రెండో ద్వాపరయుగంలో నీవు మళ్ళీ జన్మిస్తావు" అని పలికి విష్ణువు అంతర్ధానమయ్యాడు.

రెండో ద్వాపరయుగం వచ్చింది. దీర్ఘతపుడు కాశీనగరానికి మహారాజయ్యాడు. ఎంతోకాలం దీర్ఘతపుడు పుత్రుడికోసం తపస్సు చేసాడు. అతడి తపస్సుకి సంతోషించిన ధన్వంతరి ప్రత్యక్షమై వరంకోరుకోమన్నాడు. దీర్ఘతపుడు ఆనందంతో స్వామి! మీరే నాకు పుత్రుడుగా ఉదయించాలి. ఇదే నా కోరిక అన్నాడు. తథాస్తు అని అదృశ్యమయ్యాడు ధన్వంతరి. తరువాత దీర్ఘతపుడికి ధన్వంతరి పుత్రుడు జన్మించి, తరువాత కాశీరాజ్యానికి రాజయ్యాడు.

ధన్వంతరి తనకున్న అపారమైన వైద్య విజ్ఞానంతో ఆయుర్వేదశాస్త్రాన్ని వైద్యులకోసం రచించాడు. తాను రచించిన ఆయుర్వేదాన్ని ఎనిమిది విభాగాలుగా చేసి తన శిష్యులకు ప్రసాదించాడు. ఆనాటి నుంచి పరంపరగా ఆయుర్వేదం లోకంలో ఎంతగానో వ్యాప్తి చెందింది. ధన్వంతరికి కేతుమంతుడనే పుత్రుడు జన్మించాడు. అతడికి భీమరథుడు. ఆ భీమరథుడుకి ధీమంతుడు జన్మించారు. ఆ ధీమంతుడే కాలక్రమంలో దివోదాసుగా విశ్వవిఖ్యాతి చెంది కాశీనగరాన్ని పాలించాడు.

## కల్కి అవతారం

కలియుగం అంతం కావటానికి ముందే శ్రీమహావిష్ణువు 'కల్కి' అనే పేరుతో అవతరిస్తాడు. ఆయన పారాశర్య వంశంలో జన్మిస్తాడు. ఆయన ఎంతో పరాక్రమవంతుడు. యాజ్ఞవల్క్యమహర్షి ఆయనకు గురువు. కల్కి వెనుక రథగజ, తురగ సైన్యాలు అసంఖ్యాకంగా వుంటాయి.

ఆయన శతసహస్ర అనగా ఒక లక్షమంది బ్రాహ్మణుల్ని కూడా వెంటబెట్టుకుని, ఎక్కడ ధర్మవినాశనం జరుగుతుందో అక్కడికి వెళ్ళి వారిని సంహరస్తాడు. ముఖ్యంగా ధర్మానికి హాని కలిగించే మ్లేచ్ఛుల్ని వధించి ధర్మాన్ని నిలబెడతాడు.

కల్కి భూమండలం మీద ఉత్తరదిశలో వున్నవారిని, మధ్యప్రాంతంలో వున్నవారిని, వింధ్యపర్వత ప్రాంతంలో వున్న వారిని, అలాగే దాక్షిణాత్యుల్ని, ద్రావిడుల్ని, సింహళ, గాంధార, పారద, పహ్లవ, శక, శబర, పుళింద బరద, వసు, లంకపాక, ఆంధ్రక, పుండ్రక, కిరాతక రాజు వంశాలవారిని కలుసుకుని వారిమధ్య సంచరిస్తాడు. అత్యంత బలవంతులైన మ్లేచ్ఛుల్ని మట్టుబెట్టి మహాబలవంతుడుగా కీర్తి పొందుతాడు. ఎవ్వరికీ కనపడకుండా కల్కి భూమండలమంతా సంచరించగలడు. ధీమంతుడైన కల్కి దేవసేనుడనేవాడికి మానవరూపంలో జన్మిస్తాడు.

కలియుగం సమాప్తమైన తరువాత శ్రీమహావిష్ణువు చంద్రగోత్రంవారి వంశంలో తిరిగి జన్మిస్తాడు. ఆయన తిరిగి 25వ కల్పంలో జన్మించి 25 సంవత్సరాల పాటు భూమండలం మీద సర్వభూతాలనీ, మనుష్యుల్ని నాశనం చేసి భూమిని కేవలం బీజమాత్రంగా వుంచుతాడు. ఆ విధంగా కల్కి చరితార్థుడై కలియుగ రాబోయే కృతయుగసంధికాలం దాకా వుంటాడు. కలియుగ సంధికాలంలో ప్రజలందరూ అల్పాయుష్కులై ఒకరిపై ఒకరుదాడి చేసుకుంటూ ఎన్నో బాధలు పొందుతారు. సంధికాలం పరిసమాప్తమయ్యే సరికి అందరూ నశిస్తారు. దీనితో కలియుగం పరిసమాప్తమవుతుంది. తిరిగి కృతయుగం ప్రారంభం కాగానే ధర్మం న్యాయం అన్నీ సక్రమంగా అమలవుతాయి.

## శ్రీ లలితో పాఖ్యానం

చతుర్భుజేచంద్ర కళావతంసేకుచోన్నతే కుంకుమరాగశోణే ।
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే నమస్తే జగదేకమాతః ॥

నాలుగు భుజాలతో, చంద్రకళా భూషణంతో ఉన్నతమైన కుచాలతో, కుంకుమలాంటి ఎర్రటి శరీరకాంతితో, అందమైన చెరుకుగడ, పాశం,

పుష్పబాణం, అంకుశం ధరించి ప్రకాశించే లలితాంబా! జగత్తుకి ఏకైక మాతవైన నీకు నమస్కారం.

పూర్వం అగస్త్యుడనే మహర్షి ఉండేవాడు. ఆయన వేద వేదాంగాలు తెలిసిన పండితుడు సకల శాస్త్రాలు ఆయనకి కరతలామలకం. ఆయన భూమండలం మీదున్న ఎన్నో దివ్యక్షేత్రాలు, పుణ్యతీర్థాలు, స్థావరాలు, పర్వతాలు, అరణ్యాలు అన్నిచోట్లా సంచరించాడు. తాను తిరిగిన అన్ని ప్రదేశాల్లో ఎంతోమంది ప్రజలు అజ్ఞానంతో నిత్యం మైథునం, ఆహారం మీద అత్యంత ఆసక్తితో జీవిస్తున్నారు. వారందరినీ చూసి ఆయనకి చాలా ఆవేదన కలిగింది. అలా ఆయన సంచరిస్తుండగా కాంచీపురం కనిపించింది. కాంచీపురం మహాపుణ్యక్షేత్రం. ఆ దివ్యక్షేత్రానికి చేరుకున్న అగస్త్యుడు అక్కడ ఏకామ్రవృక్ష పాదస్థానంలో వెలిసిన ఏకామ్రేశ్వరుణ్ణి, కలిదోషాల్ని నశింపచేసే క్షేత్రప్రధాన దేవత శ్రీకామాక్షీదేవిని భక్తిగా పూజించాడు.

లోకక్షేమాన్ని కోరుకునే అగస్త్యుడు ఆ దివ్యక్షేత్రంలో కొంతకాలం శ్రీహరి గురించి తపస్సు చేసాడు. దయామయుడైన జనార్ధనుడు అగస్త్యుడి తపస్సుకి సంతోషించి దివ్యతేజస్సుతో అతడు ముందు ప్రత్యక్షమయ్యాడు. హయగ్రీవుడి రూపంలో తనకు ఎదురుగా నిలిచిన విష్ణువుని చూసి అగస్త్యుడు ఆశ్చర్యపోయాడు.

హయగ్రీవం తనుంకృత్వా సాక్షాచ్చిన్మాత్రవిగ్రహమ్ ।
శంఖచక్రాక్ష వలయపుస్త కోజ్జ్వల బాహుకామ్ ॥

*(శ్లో॥ 9 అద్యా 5)*

కేవలం చిన్మయరూపంతో శంఖ, చక్ర, అక్షమాల, పుస్తకం అనేవాటిని ధరించటంచేత ఉజ్వలంగా ప్రకాశించే నాలుగు చేతులతో, శరీరంనుంచి పుట్టిన కాంతితో జగత్తునంతా వెలిగిస్తున్న హయగ్రీవుణ్ణి చూసి ఆనందించాడు

తన దర్శనంకోసం తపస్సుచేసిన అగస్త్యమహర్షిని చూసి హయగ్రీవుడి రూపంతో వున్న జనార్దనుడు అగస్త్యా! నీకు వరాన్ని ప్రసాదించటానికి వచ్చాను.

కోరుకో నీకేం కావాలో అన్నాడు. స్వామీ! తమరు నాకు వరాన్నిస్తానన్నారు. చాలాసంతోషం అయితే నేను కోరేది నా స్వార్థం కోసం కాదు. స్వామీ! భూలోకంలో వున్న ఈ మానవులందరూ విషయ సుఖాలనే పరమార్థంగా భావిస్తు ఎంతో పాపాన్ని మూటకట్టుకుంటున్నారు. వీరంతా తరించే ఉపాయాన్ని చెప్పు స్వామీ! ఇదే నా కోరిక"అన్నాడు అగస్త్యముని.

అగస్త్యా! పూర్వం ఇదే కోరికని శివుడు దుర్వాసుడు, బ్రహ్మ కూడా అడిగారు. మీరంతా మహాత్ములు, పరోపకార పరాయణులు, లోకహితాన్ని కోరేవారు. ముందుగా నీకు అభినందనలు చెబుతున్నాను.

మానవులు విధి హితంగా, లేకుండాగానీ ఏవిధంగానైనా ఆదిపరాశక్తిని పూజించాలి. అలాంటివారికి ముక్తి తప్పకుండా లభిస్తుంది. సాక్షాత్తు పరమేశ్వరుడు కూడా ఆ పరాశక్తిని ఆరాధించే యోగీశ్వరుడయ్యాడు. అలాగే మిగిలిన దేవతలు కూడా శక్తిని అర్చించి ఎన్నో దివ్యశక్తులు పొందారు. అందువల్ల మానవులకి త్రిపుర సుందరీ దేవి ఆరాధన భోగమోక్షప్రదమైనది. నీవు కోరినట్టు మానవులు తరించాలంటే దేవిని అర్చించాలి".

మహావిష్ణువు మాటలు విన్న అగస్త్యముని ఆయనతో "స్వామీ! తమరు చెప్పిన పరాశక్తి ఎవరు. ఆ త్రిపురసుందరీదేవి స్వరూప స్వభాలు ఎలా ఉంటాయి? ఆమె ఎలాంటి ప్రభావాన్ని చూపుతుంది? దయచేసి సవివరంగా చెప్పండి అని ప్రార్థించాడు. "నాయనా అగస్త్యా! నీవు అడిగే అన్ని విషయాలనూ ఇదిగో నా అంశ అయిన హయగ్రీవుడు నీకు చెబుతాడు. ఆయన ద్వారా నీ సందేహాలన్నీ తీర్చుకో" అని చెప్పి తన హయగ్రీవరూపాన్ని అక్కడే నిలిపి అదృశ్యమయ్యాడు శ్రీహరి. అగస్త్యుడు ఎంతో ఆనందంతో హయగ్రీవుణ్ణి వెంటబెట్టుకుని తన ఆశ్రమానికి వెళ్ళాడు.

## హయగ్రీవుడు చెప్పిన దేవీ ఆవిర్భావం

అగస్త్యమహర్షి హయగ్రీవుణ్ణి ఆశ్రమానికి తీసుకువచ్చి ఆయనకు యథోచిత ఉపచారాలు చేసాడు. తరువాత ఒక ఉన్నతమైన ఆసనం మీద

కూర్చోబెట్టి "స్వామీ! హయగ్రీవా! మీలాంటి వారి దర్శనం సకల పాపాల్నీ హరిస్తుంది. ఈ రోజు నా జన్మ ధన్యమయ్యింది. మీ రాకతో మా ఆశ్రమం ఎంతో పావనమైంది. మహాదేవి అయిన ఆ పరమేశ్వరి ఎలా ఆవిర్భవించింది. ఆమె వివిధరకాల రూపాల్ని ఎలా ధరించింది? ఆమె ముఖ్యవిహాలు ఏవి? ఇలాంటి విషయాలన్నీ తెలుసుకోవాలనుకుంటున్నాను దయచేసి చెప్పండి అని ప్రార్థించాడు.

అగస్త్యమహర్షితో హయగ్రీవుడు ఇలా చెప్పాడు. అగస్త్యా! నీవు అడిగిన ఆ మహాశక్తి ఆది అంతాలూ రెండూ లేనిది. సమస్త ప్రకృతీ ఆమె స్వరూపమే. అన్ని రూపాలు ఆమెవే. కేవలం ధ్యానయోగ సాధన వల్లే ఆమెని చూడగలం. అసలు ధ్యానమే ఆమె స్వరూపం. ఆ దేవి మన హృదయంలోనే కొలువై వుంటుంది. ఎంతోకాలం దేవీమంత్రాన్ని జపంచేసిన వాడే ఆమెతో తాదాత్మ్యం చెందగలుగుతాడు. ఆ పరాశక్తి మొదట బ్రహ్మదేవుడి ధ్యానం వల్ల ఆవిర్భవించింది. ఆమెనే ఆది ప్రకృతి లేక మూల ప్రకృతి అంటారు. ఆమె దేవతలందరికీ ఎన్నో శక్తుల్ని సిద్ధుల్నీ ప్రసాదిస్తుంది." అని చెప్పాడు హయగ్రీవుడు.

## పాపకర్మలు - ప్రాయశ్చిత్తాలు

ఎవరినైనా, ఏ జీవినైనా అకారణంగా చంపటం, దొంగలించటం, హింసించటం, పరస్త్రీలతో సంగమించటం, కల్లువంటి మద్యాలను సేవించటం, ఇవి రాజు చేయకూడని దుష్కర్మలు. తల్లి తండ్రి గురువు, గురుపుత్రుడు పుత్రుడు – వీరి విషయంలో ప్రాయశ్చిత్తం వుంటుంది. రాజు పదిమంది బ్రాహ్మణుల జీవనాధారాన్ని నిలపటం కోసం ఒక బ్రాహ్మణుణ్ణి చంపవచ్చు. బ్రాహ్మణుడు వందమంది బ్రాహ్మణుల్ని రక్షించటం కోసం ఒక బ్రాహ్మణుణ్ణి సంహరించవచ్చు. ఐదు గురు బ్రాహ్మణుల బాగుకోసం ఒక వైశ్యుణ్ణి దండించవచ్చు. వందమంది వైశ్యుల బాగుకోసం ఒక బ్రాహ్మణుణ్ణి దండించవచ్చు.

తనను చంపటానికి పూనుకున్నప్పుడు అది బ్రాహ్మణుడు గానీ, క్షత్రియుడు గానీ, వైశ్యుడుకానీ, శూద్రుడుకానీ, ఆవుగానీ, గుర్రాన్ని గానీ,

మరే ఇతర జీవినిగానీ చంపితే దోషం అంటదు. అలాగే తనకన్నా తన భార్యని, బంధువుల్ని రక్షిస్తే ఉత్తరోత్తర అధికమైన పుణ్యం లభిస్తుంది. రాజుని, వేద పండితుణ్ణి, బ్రాహ్మణుణ్ణి వేదాంతవేత్తని సేవిస్తే ఉత్తరోత్తర అధికమైన పుణ్యం లభిస్తుంది.హింసాకర జంతువుల్ని వేటాడి చంపితే దోషం అంటదు. తనకోసం పశువుల్ని వధించకూడదు. యజ్ఞార్థం పశువధ చేస్తే అది దోషంకాదు. ఆపదలో గత్యంతరంలేని పరిస్థితుల్లో బ్రాహ్మణుడు మాంసం తిన్నా పాపం అంటుకోదు.

## మద్యం - గుణదోషాలు

పైష్టికం, తాళజం క్షైరం మాధూకం గుడసంభవమ్ ।
క్రమాన్న్యూనతరం పాపం తదర్థార్థార్థతస్తథా ॥

పిండితో చేసింది, తాటిచెట్టునుంచి తీసింది, కాశ్మీరదేశం వారు తయారుచేసింది, విప్పపూవునుంచి తయారుచేసింది, బెల్లంతో రూపొందించింది. అని మద్యాలు వివిధరకాలుగా వుంటాయి. వీటిలో వరుసగా ఒకదాని తరువాత ఒకటి తక్కువ పాపాన్ని కలుగచేస్తాయి. అనగా పిండితో చేసిన మద్యం ఎక్కువ పాపాన్ని కలిగిస్తే తరువాత మద్యాలు తక్కువ పాపాన్ని కలిగిస్తాయి.

పైష్టికతాళ మద్యాలను క్షత్రియులు విడిచిపెట్టాలి. వైశ్యులు పైష్టిక, తాళజాలతో పాటు క్షైరం కూడా విసర్జించాలి. శూద్రుడు మాత్రం మొదటి రెండురకాల మద్యాలు విడిచిపెడితే చాలు. బ్రాహ్మణస్త్రీలు ఏ మద్యాన్నీ స్వీకరించకూడదు. అలాగే భర్తలేని స్త్రీ, ఋతుమతి అయిన స్త్రీ, కన్య, ఈ ముగ్గురూ కూడా మద్యం త్రాగకూడదు. భర్తలేనప్పుడు మద్యపానం చేసే స్త్రీని ఉన్మాది అంటారు.

బ్రాహ్మణుడు మద్యపానం చేస్తే చాంద్రాయణ వ్రతం చేయాలి. తరువాత పదివేల సార్లు గాయత్రీ మంత్రాన్ని లేదా 'జాతవేదసా' అనే దుర్గా మంత్రాన్ని గానీ జపం చేయాలి. అలా చేయకపోతే అతడు పరిశుద్ధుడు కాలేడు. క్షత్రియ వైశ్యశూద్రులు మద్యపానదోషం పోవటానికి నీటిలో నిలబడి సహస్రగాయత్రీ జపం చేయాలి.

లక్ష్మీ సరస్వతీ గౌరీ చండికా త్రిపురాంబికా ।
భైరవో భైరవీ కాళీమహాశాస్త్రీచ మాతరః ॥

అన్యాశ్చ శక్తయస్తాసాం పూజనేమధు శస్యతే ।
బ్రాహ్మణస్తు వినేతేన యజేద్వేదాంగపారగః ॥

*(శ్లో॥72-73, అధ్యా-8 ఉ.భా)*

లక్ష్మీదేవి, చండీదేవి, సరస్వతి, గౌరి, త్రిపురాంబికా, భైరవుడు, భైరవి కాళీ, మహాశాస్త్రా, బ్రాహ్మీ వంటి సప్తమాతృకలు వంటి శక్తిదేవతల పూజల్లో మధువు ఉపయోగించవచ్చు. వేదపండితుడు మాత్రం మద్యం లేకుండానే శక్తి దేవతల్ని పూజించవచ్చు. దేవికి నైవేద్యం పెట్టిన ప్రసాదాన్ని తిన్న వారు దేవితో తాదాత్మ్యం చెందుతారు.

కృతస్యాఖిలపాపస్య జ్ఞానతోఽజ్ఞానతోఽపివా ।
ప్రాయశ్చిత్త మిదం ప్రోక్తం పరాశక్తేః పదస్మృతిః ॥

*(శ్లో॥75, అధ్యా-8, ఉ.భా)*

ఎవరైనా తెలిసిగానీ, తెలియకగానీ దోషాలు చేసివుంటే అవి పరాశక్తి నామస్మరణతో తొలగిపోతాయి. ఎవరైతే పరాశక్తిని అర్చించకుండా మద్యపానాన్ని చేస్తారో వారు రౌరవాది నరకాలకి పోతారు. భోగేచ్ఛతో మద్యపానం చేసిన బ్రాహ్మణుడికి ప్రాయశ్చిత్తమే లేదు.

## భండాసుర జననం

భండాసురుడి జన్మవృత్తాంతాన్ని త్రిపురసుందరి శ్రీలలితాదేవి ఆవిర్భవించిన కథనాన్ని, భండాసురుడు దేవి చేతిలో వధించబడిన ఇతిహాసాన్ని హయగ్రీవుడు అగస్త్యమహర్షికి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

దక్షయజ్ఞంలో తన భార్య సతీదేవి ఆత్మత్యాగం చేయటంతో శివుడికి తీవ్రమైన వైరాగ్యం కలిగింది. వెంటనే కైలాసానికి వెళ్ళి ఆత్మధ్యానంలో మునిగిపోయాడు. తరువాత ఆ సతీదేవి హిమవంతుడి కూతురుగా జన్మించింది.

నారుదుడు హిమవంతుడి దగ్గరకి వచ్చి నీ కుమార్తె శివుడికి భార్య అవుతుంది అనిచెప్పాడు. పార్వతి కూడా పరమేశ్వరుణ్ణి వివాహం చేసుకోవాలని సంకల్పించుకుని ఆయనకి సేవలు చేయసాగింది. ఇదే సమయంలో తారకాసురుడి చేత బాధలు పడుతున్న దేవతలు మన్మథుడి దగ్గరకు వెళ్ళి శివపార్వతుల మధ్యప్రేమ అంకురించేలా పుష్పబాణాల్ని ప్రయోగించమని కోరారు.

అలా చేసినందువల్ల వారిద్దరికీ వివాహమై, వారికి జన్మించబోయే కుమారుడు తారకాసురుణ్ణి వధిస్తాడు అని నచ్చచెప్పారు. దేవతల ప్రార్థన విని మన్మథుడు కరిగిపోయాడు. వెంటనే హిమాలయంలో తపస్సు చేసుకుంటున్న శివుడి దగ్గరకి వెళ్ళాడు. అక్కడ పార్వతీదేవి ఆయనకు సపర్యలు చేస్తూ కనిపించింది. ఇక ఇదే సరైన సమయం అని భావించాడు మన్మథుడు. వెంటనే తన పూలబాణాన్ని శంకరుడి హృదయానికి తాకేలా ప్రయోగించాడు.

శివుడు కళ్ళు తెరిచాడు. ఎదురుగా మనోహరంగా ప్రకాశిస్తున్న పార్వతీదేవిని చూసాడు.ఆయన మనసు చలించింది. మన్మథవికారానికి గురయ్యింది. ఒక్కక్షణం తనకెందుకిలా అవుతోంది అని ఆలోచించాడు. ఆయనకి సత్యం బోధపడింది. ఇదంతా మన్మథుడి పనేనని గ్రహించాడు. వెంటనే తన మూడో కన్ను తెరిచి ఒక్క క్షణంలో మన్మథుణ్ణి భస్మం చేసేసాడు.

శివుడి ద్వారా దహించబడ్డ మన్మథుడి శరీర భస్మం నుంచి భండాసురుడనే రాక్షసుడు ఆవిర్భవించాడు. ఆ అసురుడు నపుంసకుడు. అతడిది వజ్రశరీరం. మేఘంలా గర్జిస్తూ ముల్లోకాలనీ భయోత్పాతానికి గురిచేసాడు. లోకాలన్నీ దహించేంత భయంకరస్వరూపంతో వెలగొందుతున్నాడు. ఒకనాడు అతడికి చిత్రకర్మ అనేవాడు మహాదేవుడి శతరుద్రీయాన్ని పఠించమని తద్వారా శివానుగ్రహం కలుగుతుందని ప్రబోధించాడు. ఆయన చెప్పిన విధంగా భండాసురుడు తదేక దీక్షతో శతరుద్రీయాన్ని పఠించటం ప్రారంభించాడు. ఇలా ఎన్నోవేల సంవత్సరాలు గడిచిపోయాయి. శివుడు బండాసురుడికి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు.

స్వామీ! మహేశ్వరా! నా శత్రువు నాకు ఎదురుపడగానే అతడి బలంలో సగబలం నాకు రావాలి. శత్రువులు ప్రయోగించే ఎలాంటి అస్త్రాల వల్లా నాకు బాధ కలుగకూడదు. అని వరం కోరుకున్నాడు తథాస్తు అని వరాన్ని అనుగ్రహించి శివుడు అంతర్ధానమయ్యాడు.

## భండాసురుడి సోదరులు

భండుడితోపాటే ఆ భస్మనుంచి విశుక్రుడు, విషంగుడు అనే మరో ఇద్దరు మహాసురులు పుట్టుకొచ్చారు. వీరంతా మహాభయంకరులు, మహాబలవంతులు. భండాసురుడు శివుడి ద్వారా వరాలు పొందాడన్న విషయం తెలియగానే ఎక్కడెక్కడో వున్న దానవులు, దైత్యులు, రాక్షసులు అతనిదగ్గరకి వచ్చారు. భండాసురుణ్ణి తమ రాజుగా ఎన్నుకున్నారు. మహేంద్ర పర్వతం సమీపంలో వున్న 'శూన్యకం' అనే పట్టణాన్ని తన రాజధానిగా చేసుకున్నాడు. భండాసురుడికి సమ్మోహిని, కుముదిని, చిత్రాంగి, సుందరి అనే నలుగురు భార్యలున్నారు.

ఒకనాడు భండుడు అతడి సోదరులైన విశుక్రుడు, విషంగుడు కలిసి దుర్మార్గపు ఆలోచనచేసారు. భండుడు తన సోదరులతో – విశుక్రవిషంగులారా! దేవతలు మనకు ప్రధానశత్రువులు. ఎన్నో కుటిలోపాయాలతో మన అసురుల్ని ఎంతోమందిని హతం చేసారు. మనం ముల్లోకాలనూ ధ్వంసంచేయాలి. మనం దేవతలందర్నీ బలహీనుల్ని చేయాలి. నేను స్వర్గలోకానికి వెళ్ళి వారిని నాశనం చేస్తాను. మీరిద్దరూ ఒకరు భూలోకానికి, మరొకరు రసాతలానికి వెళ్ళి అక్కడి వారందర్నీ నాశనం చేయండి.

సోదరులారా! మనం ఈ రూపాలతో వెళ్ళకూడదు. వాయురూపంలో వెళ్ళి వారి శరీరాల్లోకి ప్రవేశించి లోపలున్న రసాలన్నిటినీ ఇంకింపచేద్దాం. వారిలో వున్న పురుషశక్తికి కారణమైన వీర్యాన్ని శోషింపచేద్దాం. దానితో వారు బలహీనులైపోతారు వారి తేజస్సంతా హీనమైపోతుంది. వెంటనే మనం ఈ కార్యం సాధించాలి. ముల్లోకాల్నీ వశంచేసుకోవాలి త్వరగా బయలుదేరండి అన్నాడు.

**భండాసురుడి దండయాత్ర :** భండాసురుడు ముందుగా స్వర్గలోకం మీదకి తన సైన్యాన్ని తీసుకుని దండయాత్రకు బయలుదేరాడు. అయితే అతడు అదృశ్యరూపంతో వెళ్ళటంతో ఎవరికీ అతడు కనిపించలేదు. అక్కడ స్వర్గలోకంలో ముందుగానే అపశకునాలు గోచరించాయి. దేవతలందరిలో ఏదో తెలియని విషాదం క్రమ్ముకుంది. భండాసురుడు ఒక్కసారిగా సకల సైన్యాలతో సహా అదృశ్యరూపంలో వచ్చి దేవతలందరి శరీరాల్లో సైన్యాలతో సహా ప్రవేశించాడు. లోపలికి వెళ్ళిన వెంటనే సైన్యాలతో సహాప్రవేశించాడు. లోపలికి వెళ్ళిన వెంటనే వారి శరీరాల్లో ఉన్న సమస్తరసాల్ని వీర్యంతో సహా శోషింపచేసాడు. దానితో ఒక్కసారిగా దేవతల ముఖాలన్నీ కళావిహీనమై పోయాయి. వాళ్ళలో ఉత్సాహం ఆనందం, సంతోషం అన్నీ నశించాయి.

భండాసురుడి ఆవేశంతో వాళ్ళంతా ఎలాంటి శృంగారభావాలనూ పొందకుండా నపుంసకులైపోయారు. దానితో ఎవరూ తమ భార్యలనూ, అప్సరసలనూ కనీసం తాకనైనా తాకటం లేదు. ఆవిధంగా భండుడి ప్రభావంతో దేవతలందరిలో నిస్సత్తువ, నిర్లిప్తత ఆవహించాయి. ఎవరూ భోగాలను అనుభవించటం లేదు. నడిచే శవాల్లాగా తయారయ్యారు. అక్కడేవున్న భండుడి సైన్యం దేవతా స్త్రీలలోకి ప్రవేశించి వారిని కూడా శృంగారం పట్ల విముఖుల్ని చేసారు. ఒక్కసారిగా దేవతాస్త్రీలలో కూడా అందం తగ్గిపోసాగింది. వారిముఖాలు కూడా కాంతిహీనమై వాడిపోయాయి. వారిలో ఎవరికీ కామసుఖం అనుభవించాలనే కాంక్షలేదు. మద్యాన్ని స్వీకరించినా వారికి మత్తు ఎక్కటంలేదు. భండుడి సైన్యప్రభావంతో దేవతాస్త్రీ సుందరమైన వక్షోజాలు శుష్కించి అందవిహీనమైపోయాయి.

ఇలా రసక్షయం అన్నది కేవలం స్వర్గంలోని దేవతలకి వారి భార్యలకే కాదు నందనోద్యానవనంలో వున్న వృక్షాలలో కూడా జరిగింది. ఎప్పుడూ పూలతో, ఫలలాతో కళకళలాడే పుష్పఫలవృక్షాలన్నీ రసాన్ని కోల్పోయి కళావిహీనమై ఎండిపోయాయి. ఈవిధంగా స్వర్గంలోవున్న అన్నిటినీ భండుడు నాశనం చేసాడు. వారంతా ప్రస్తుతం 'ఉన్నా లేనట్టే' అన్నట్టుగా వున్నారు.

**విశుక్రుడి దండయాత్ర :** విశుక్రుడు సైన్యసమేతంగా భూలోకాన్ని నాశనం చేయటానికి బయలుదేరాడు. అతడు కూడా వాయురూపంతో భూలోకంలోని మానవులందరి శరీరాల్లోకి ప్రవేశించాడు. వెంటనే మానవుల శరీరాలన్నీ శుష్కించిపోయాయి. వారి లోపలున్న రసాలు వీర్యం ఇంకిపోయింది. అందరిలో శృంగారవాంఛ నశించింది. సంతాన హీనులైపోయారు. విశుక్రుడు ఆ విధంగా పురుషుల్లో శుక్లాన్ని త్రాగేయగా, విశుక్రుడి సైన్యం స్త్రీలోవున్న శోణితాన్ని త్రాగేసారు. ఇలా వారి ప్రభావంతో శుక్ల శోణితాలు నశించాయి. దాంతో స్త్రీ పురుషులు పరస్పర ఆకర్షణ శక్తిని కోల్పోయారు. స్త్రీలకు సంతానం కలగకపోవటంతో సృష్టి స్తంభించిపోయింది. వారి ఇళ్ళన్నీ వెలవెలబోతున్నాయి.

విశుక్రుడు కేవలం మానవులనేకాదు భూమిమీదవున్న సకలజీవాల్లో, పక్షులు, వృక్షాలు, లతలు, తీగలు వీటన్నిటిలో వున్న రసాల్ని మొత్తం క్షీణింపచేసాడు. దానితో సమస్త జీవజాలం నీరసించిపోయింది. పచ్చగా కళకళలాడే చెట్లన్నీ ఎండిపోయాయి. భూలోకమంతా కళావిహీనమైపోయింది. సముద్రాలు, నదులు కూడా ఎండిపోయాయి. ఏ పదార్థం రుచిగాలేదు. పుంసత్వాన్ని కోల్పోవటంతో ఎవరూ యుద్ధాలు చేయటంలేదు. పంటలు పండటం లేదు. కేవలం రాళ్ళు ఇసకే మిగిలాయి. ఇలా భూమండలాన్నంతా విశుక్రుడు సర్వనాశనం చేసేసాడు.

**విషంగుడి దండయాత్ర :** భండాసురుడి రెండో సోదరుడు విషంగుడు. అన్న ఆజ్ఞతో సైన్యసమేతంగా రసాతలంలోకి దండయాత్రకు బయలుదేరాడు. వెళ్ళిన వెంటనే అక్కడవున్న నాగజాతివారిని నాశనం చేసాడు. పాతాళలోకంలో నివసించే నాగులు, సిద్ధులు 'బలి' వంటి ఉన్నతమైన రాక్షసులు, వీరందరిలోకి అదృశ్యంగా ప్రవేశించి, వారిలోని వీర్యశక్తిని ఎండగట్టాడు. దానితో ఎవరూ ఒకిరికొకరు ఎలాంటి సంబంధం లేనట్టు ప్రవర్తించారు. ఒకర్నొకరు కలహించుకున్నారు. అలా విషంగుడి ప్రభావంతో రసాతల వాసులుకూడా వీర్యాన్ని కోల్పోయి నిస్సారంగా మిగిలిపోయారు.

ఈ విధంగా భండుడు అతడి సోదరులు ముల్లోకవాసుల్ని నానారకాల బాధలకి గురిచేసారు. వీర్యంవల్లనే జీవుల్లో కాంతి ప్రకాశిస్తుంది. దానివల్లనే ఉత్సాహం, విద్య, ధర్మం, ప్రీతి మొదలైనవి. భండుడు జీవుల్లో వీర్యాన్నే కాకుండా లోకంలో వున్న శాస్త్రాలు, కావ్యాలు నాట్య, గీతాలు అలాగే లక్ష్మీప్రదమైన వస్తువులు ఇంకా ఎన్నిటినో నాశనం చేసాడు.

భండుడి ప్రభావంతో చెట్లలో రసం కోల్పోవటంతో ఆ కట్టెలు ఎంత కాల్చినా మండటంలేదు. భండుడి ప్రభావం ఎంతగా వ్యాపించిందంటే పౌర్ణమితిథిలో కూడా చంద్రుడు పూర్తిగా ప్రకాశించటంలేదు. అలాగే తారలు కూడా తమ కాంతిని కోల్పోయాయి. సాక్షాత్తు పార్వతీ దేవికూడా అలంకారాలు అన్నీ వదిలేసి వైరాగ్యంతో తపస్సు చేయటం ప్రారంభించి.

## దేవతలంతా విష్ణువుని శరణుకోరుట

హయగ్రీవుడు అగస్త్యుడికి భండాసురుడి జననం, అతడు చేసిన దుష్కృత్యాల గురించి చెప్పిన తరువాత దేవతలంతా అతడి బాధలు పడలేక విష్ణువును శరణువేడటానికి వెళ్ళటం వంటి విషయాలను ఇలా చెప్పటం ప్రారంభించాడు.

బ్రహ్మ, ఇంద్రాదిదేవతలు, ప్రజాపతులు మానవులు, మహర్షులు, దిక్పాలకులు, గుహుకులు, సిద్ధులు, ప్రహ్లాదుడు వంటి దానవులు ఇలా భండాసురుడి చేత పీడించబడ్డవారందరూ కలిసి ఏంచేయాలో తోచక సరాసరి మహావిష్ణువు దగ్గరకి బయలుదేరారు సలహా అడగటం కోసం. అయితే మహావిష్ణువు కూడా భండాసురుడి ప్రభావానికి లోనైన వాడే. ఆయన కూడా లక్ష్మీదేవి మీద విముఖతతో ఒంటరిగా సుషుప్తి అవస్థలో నిద్రిస్తున్నాడు. దేవతలంతా ఒక్కసారిగా దివ్యస్తోత్రాలు చేసేసరికి నెమ్మదిగా ఆయన కళ్ళు తెరిచాడు. ఎదురుగా దీనంగా నిర్జీవ దేహాలతో దేవతలు కనిపించారు. వారు వచ్చిన విషయం ఆయనకు దివ్యదృష్టి ద్వారా తెలిసింది. వారితో –

దేవతలారా! ఎందుకు మీరిలా కళాహీనులైపోయారు. మీ శరీరాలన్నీ నిర్జీవంగా కనిపిస్తున్నాయి. మీ పరాక్రమం అంతా ఏమైపోయింది? మీరంతా

నిస్సారంగా తయారయ్యారు. దీనికికారణమేమిటో నేను గ్రహించాను. ఇదంతా ఆ భండాసురుడి ప్రభావం. మనందరం కలిసి బ్రహ్మాండానికి అతీతంగా వుండే మహాశివుడనే మహాపురుషుడున్నాడు. ఆయన్ని వెళ్ళి శరణువేడుకుందాం.

ఆ మహాశివుడు పరాశక్తితో కలిసి నిత్యం చిద్ఘనుడుగా వుంటాడు. అలాంటి మహాపురుషుడి మీద భండుడి ప్రభావం ఏమాత్రం వుండదు. ఆయనకి ఒకరూపం లేదు. ఒక ఆలంబనం లేదు. ఆయన ఎలాంటి వికారాలు పొందడు. ఆయన సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, పరాత్పరుడు ఆయన ఒక్కడే భండాసురుడు వధించబడే ఉపాయాన్ని మనకు చెప్పగలడు. కనుక మనందరం వెళ్ళి ఆయన్ని ప్రార్థిద్ధాం అని అన్నాడు. దేవతలందరూ సంతోషంతో అంగీకరించారు. అందరూ కలిసి శంభుడి దగ్గరకు బయలుదేరాడు.

శంభుడు ఉండేది బ్రహ్మాండానికన్నా చాలా ఎత్తైన ప్రదేశంలో వున్నాడు. ఆయన్ని చేరుకోవాలంటే బ్రహ్మాండం ప్రభాగాన్ని చిల్లుచేసి వెళ్ళాల్సిందే మరో మార్గంలేదు. వెంటనే దేవతలు దిగ్గజాలని పిలిపించారు. అవి అతి కష్టంమీద ఆ బ్రహ్మాండం టెంకిని (పైభాగాన్ని) రంధ్రంచేసాయి. ఎన్నో యోజనాల వెడల్పున్న ఆ బ్రహ్మాండం నుంచి రంధ్రంద్వారా బైటికి వచ్చారు దేవతలు.అలా వచ్చిన వారు సరాసరి ఆకాశ స్వరూపుడైన మహాశంభుడి దగ్గరకు వెళ్ళి ఆయన్ని ఘనంగా ఇలా స్తుతించారు.

## దేవతలు చేసిన మహాశంభుని స్తుతి

అద్వయం నిర్మలం శాంతం మాయాతీతమజం మహః ।
నిరస్తగుణసంసర్గం మహాశంభుముపాస్మహే ॥ 1

దేవానామపిచావేద్య మధ్యేయం యోగినామపి ।
అనధ్యేయం చ వేదజ్ఞైః మహాశంభు ముపాస్మహే ॥ 2

న, స, న్నాఽఽస, న్న సదస, న్నద్వయం, నా ఽ ద్వయం తథా ।
యస్యతేజః ప్రకాశం తం మహాశంభు ముపాస్మహే ॥ 3

వేద్యం విత్తిశ్చ వేత్తా చ త్రిపుటీయం విసృత్వరీ ।
స్పృశంతి క్వాపి యన్నైత త్స్వయమేవ ముపాస్మహే ॥ 4

ధర్మాఽధర్మై స్తద్విపాకైః సుఖదుఃఖైశ్చ యత్పదం ।
అనాఘ్రాతం తమీశానం మహాశంభు ముపాస్మమే ॥ 5

సౌరాణాం భాస్కరాకారం బ్రహ్మ చ బ్రహ్మవాదినాం ।
సౌగతానాం చ విజ్ఞానం మహాశంభు ముపాస్మహే ॥ 6

లోకాయతిక ముఖ్యానాం స్వభావమయ విగ్రహం ।
క్షణికానాం క్షణాకారం మహాశంభు ముపాస్మహే ॥ 7

శూన్యం మాధ్యమికానాం చ సాంఖ్యానాం పురుషాత్మకం ।
పాతం జలానాం శాబ్దం చ మహాశంభు ముపాస్మహే ॥ 8

కారుణాం విశ్వకర్మానాం శైవానాం శివరూపిణం ।
విష్ణుం చ పాంచరాత్రాణాం మహాశంభు ముపాస్మహే ॥ 9

అర్ధేశ్వరం నిధివిదాం కామేశం కామసూత్రిణాం ।
వైశ్వానరం చ వైద్యానాం మహాశంభు ముపాస్మహే ॥ 10

విప్రాణా మగ్నినిలయం హృద్స్థం యోగవతామపి ।
ప్రతిమాస్థ మబుద్ధానాం మహాశంభు ముపాస్మహే ॥ 11

సర్వేషా మాదిభూతం చ స్వయమాది వివర్జితం ।
సర్వాంతం చ స్వతోఽనంతం మహాశంభు ముపాస్మహే ॥ 12

త్వ నదృశ్యోఽసి సర్వేషాం నధ్యేయోఽసి మహేశ్వర ।
అస్మజ్జీవాతుసంసిద్ధ్యై చక్షుషాంసః పదం భవ ॥ 13

విపరీత సమాచారైర్దుష్టై ర్భండాది దానవైః ।
బాధితాస్స్మో మహాశంభో ! చక్షుషాంశ పదంభవ ॥ 14

దుర్బలాస్స్మో విభగ్నాస్స్మో నీరసాస్స్మశ్చ శంకర ।
అస్మానుద్ధర కారుణ్యాత్ చక్షుషాంసః పదంభవ ॥ 15

యదినోరక్షతి భవాన్ భక్తానస్మాన్ పరార్దితాన్ ।
తవైవహి యశోహాని శ్చక్షుషాం నః పదంభవ ॥ 16

ఇత్యేవం విష్ణునా ధాత్రా చేంద్రేణచ కృతస్తుతిః ।
ఆవిర్భభూవభగవాన్ పరాశక్త్యా నిషేవితః ॥ 17

ఈ విధంగా దేవతలందరూముక్త కంఠంతో చేసిన స్తుతి ఎంతో సంతోషించిన పరమేశ్వరుడు పరాశక్తితో సహా ప్రత్యక్షమయ్యాడు. కాలమేఘం లాంటి శరీరంలో శూలాన్ని, కపాలాన్ని ధరించి మూడు కళ్ళతో చిరునవ్వులు చిందిస్తూ పరమేశ్వరుడు, చంద్రుడులాంటి తెల్లని కాంతితో అక్షమాల పుస్తకం ధరించి పరాశక్తి వారికి దర్శనమిచ్చారు. దీనంగా తమని ప్రార్ధించిన దేవతలతో ఇలా అన్నారు.

సురులారా! మీరందరూ ఇక్కడికి ఎందుకు వచ్చారో మాకు తెలుసు. భండాసురుడు లోకాలన్నిటినీ నిర్వీర్యం చేసాడని గ్రహించాను. ఈ బ్రహ్మాండానికి మొత్తం మూడురకాల ప్రళయాలు సంభవిస్తాయి. 1.మహాప్రళయం 2.కామప్రళయం 3.అవాంతర ప్రళయం అని ఈ మూడూ నిత్యం సంభవిస్తుంటాయి. ప్రతికల్పంలో ఈ ముడురకాల ప్రళయాలనుంచే ఉద్ధరించే దేవతలు ముగ్గురుంటారు. వారిలో మహాప్రళయంనుంచి నేను (పరమేశ్వరు) అవాంతర ప్రళయం నుంచి రక్షించేవాడు బ్రహ్మ. ఇక కామ ప్రళయం నుంచి రక్షించేది లలితా పరమేశ్వరి, ఆ దేవి ప్రతికల్పంలో ఆవిర్భవిస్తుంది. ఇప్పుడు బ్రహ్మాండంలో సంభవించింది కామప్రళయం. దాని నుంచి మిమ్మల్ని రక్షించగలిగేది ఒక లలితాదేవి మాత్రమే. కనుక మీరంతా ఆమె ఆవిర్భవించటానికి తగిన ప్రయత్నాలు చేయండి" అని ప్రబోధించాడు. అంతావిన్న దేవతలు ప్రభూ! నీవు సర్వజ్ఞుడివి. లలితాదేవి ఆవిర్భవించాలంటే మేమేం చేయాలి. దయచేసి ఆవివరాలు కూడా చెప్పు స్వామీ! అని వేడుకున్నారు.

దేవతరాలా! లలితాదేవి ఉద్భవించటానికి మీరొక మహాయాగాన్ని చేయాలి. ఆ యాగంలో వాయురూపం ధరించి నేను హోతగా వుంటాను. మొత్తం ఎండిపోయిన ఏడోసముద్రం ఆ యాగానికి హోమకుండం. అందులో అగ్నిచిదగ్ని మిగిలిన ఆరుసముద్రాలు అభిఘారాలు. అయిదురకాల సృష్టులు అనగా 1.బ్రహ్మమనసుతో సృష్టించిన దేవతలు మొదలైనవారు 2.మానవులు తదితర ప్రాణకోటి 3.గుడ్లనుంచి పుట్టేపాములు, పక్షులు తదితరాలు 4. చెమట వల్ల పుట్టిన పేలు, నల్లుల వంటివి 5.భూమినుంచి పుట్టిన చెట్లు, చేమలు

ఇవన్నీ పురోడాశాలు. ఆ మహాయాగంలో హోమాగ్ని ప్రజ్వరిల్లుతున్నప్పుడు మిమ్మల్ని మీరు ఆహుతిచ్చుకోండి. ఆ విధంగా మీరు హోమం చేస్తున్నప్పుడు చిదగ్నికుండ సంభూతగా దివ్యమైన చక్రరథాన్ని అధిష్టించి కోట్లాది మెరపుల కాంతితో ప్రకాశిస్తూ జగదేక సౌందర్యవతి అయిన లలితాదేవి ఆవిర్భవిస్తుంది.

హోమకుండం నుంచి పైకి వచ్చిన దేవి తిరిగి సృష్టికొనసాగించాలని భావించి తననుంచి ఒక పురుషుణ్ణి ఆవిర్భవింపచేస్తుంది. ఆయనే కామేశ్వరుడు లలితాదేవి భర్త. వారిద్దరూ కలిసి సృష్టి కొనసాగించటంతో తిరిగి ముల్లోకాలూ కళకళలాడుతాయి. ఆ దేవి వస్తూనే కాముణ్ణి బ్రతికించాలనే సంకల్పంతో చెరుకుగడ విల్లు, అయిదుబాణాలు పాశం, మహాంకుశం, అస్త్రం అనే నాలుగు ఆయుధాల్ని ధరించి భండాసురుణ్ణి సంహరించి తీరుతుంది. కేవలం తన కంటి చూపుతోనే తిరిగి మన్మథుణ్ణి బ్రతికిస్తుంది. ఆ తరువాత హోమకుండంలో ఆహుతైపోయిన మిమ్మల్ని పునర్జీవితుల్ని చేసి మీకు కొత్త శరీరాల్ని ప్రసాదిస్తుంది.

ఈ మహత్తర యాగానికి మీరు సమ్మతిస్తే నేను ముందుకు వస్తాను లేదంటే మీరిలాగే కృశించి పోతారు. అని హెచ్చరించాడు మహాదేవుడు. అందరూ మహాదేవుడిచేత మహాయాగం చేయించాలని సంకల్పించారు. అందుకు సమ్మతించారు. మహాదేవుడు యాగాన్ని చేయటానికి అంగీకరించాడు.

## మహాయాగం ప్రారంభం

ఒక శుభముహూర్తాన మహాదేవుడు పరాశక్తి బ్రహ్మాండంలోకి వచ్చారు. మహాయాగాన్ని చేయటానికి ఉద్యుక్తులయ్యారు. మహాదేవుడు ఆ యాగానికి స్వయంగా 'హోత' కాగా పరాశక్తి ఆయనకు క్రియాశక్తిగా సహకరించింది. మహాదేవుడు పరాశక్తితో కలిసి వాయురూపాన్ని పొందాడు దానితో ముల్లోకాలనీ కంపింపచేసాడు. ఏడో సముద్రాన్ని యజ్ఞకుండంగా చేయటంకోసం దాన్ని పూర్తిగా ఎండిపోయేలా చేసాడు. మహాదేవుడి దివ్యతేజస్సుతో ఆ సముద్రం పూర్తిగా ఎండిపోయి లోతుగా పెద్ద గొయ్యి ఏర్పడింది. ఆ కుండంలోకి తన దివ్యశక్తితో చిదగ్నిని ప్రవేశపెట్టాడు. తరువాత తారకాపుష్పాలతో ఆ యజ్ఞకుండాన్ని పూజించాడు. తన అష్టమూర్తుల్నీ అక్కడికి ఆవాహన చేసాడు.

**అగ్నిపూజ :** ఆ చిదగ్నికుండంలో తన అష్టమూర్తులలోని ఆరుమూర్తుల్ని మధ్యలో మూడు మూర్తుల్ని పక్కన ఉంచి వారిని అర్చించాడు. ఆ తరువాత 1.జాతవేదుడు 2.సప్తజిహ్వుడు 3.హవ్యవాహనుడు 4.అశ్వోదరుడు 5.వైశ్వానరుడు 6.కౌమార తేజుడు 7.విశ్వేదేవుడు 8.భూతి అనే ఎనిమిది అగ్ని మూర్తులను అలాగే 1.సహస్రార్చి 2.స్వస్తిపూర్ణుడు 3.ఉత్తిష్ఠపురుషుడు 4.ధూమవ్యాప్తి 5.సప్తజిహ్వుడు 6.ధనుర్ధరుడు అనే ఆరురకాల అగ్ని మూర్తులను, అదేవిధంగా 1.హిరణ్యుడి 2.కనక 3.రక్త 4.కృష్ణ 5.సుప్రభ 6.అతిరిక్త 7.బహురూప అనే అగ్ని జిహ్వలను పూజించాడు.

**సముద్ర ఆహుతి :** అగ్నిపూజ అయిన తరువాత పుష్కల, ఆవర్తస అనే రెండు మహాకాల మేఘాల్ని దర్వులు గా చేసి హోమం చేయటం ప్రారంభించాడు. మహాదేవుడు సర్పిసముద్రం నుంచి నేయిని తీసుకుని మహామేఘం అనే దర్వితో హోమం చేసాడు. పర్వత మంత పెద్ద పెద్ద ఆజ్యధారలు ఆ చిదగ్ని కుండంలోకి వచ్చిపడటంతో హోమజ్వాలలు వందయోజనాలంత ఎత్తుకి వ్యాపించాయి. అదేవిధంగా ఉద్భిజాలైన చెట్లు చేమల్ని సమిథలుగా చేసి, ఇక్షు (చెఱకు) సముద్రాన్ని మొత్తం తెచ్చి ఆహుతిచ్చాడు. తిరిగి సమిథల్ని ఉప్పు సముద్రాన్ని కలిపి హోమకుండంలో ఆహుతిగా సమర్పించాడు. భయంకరమైన హోమద్రవ్యాల వల్ల అగ్నికుండంలోని జ్వాలలు మహాభీకరమైన శబ్దాల్ని చేస్తూ ఎంతో ఉన్నతంగా ప్రజ్వలిస్తున్నాయి.

తరువాత పాలసముద్రాన్ని మేఘాలనే స్రువంతో తెచ్చి ఆహుతిచ్చాడు. ఆ ఆహుతిపడిన వెంటనే తెల్లని జ్వాలలు ఆకాశమంతా క్రమ్మి పెద్ద పిడుగుపడి పగిలిన స్ఫటిక పర్వతంలా గొప్ప ధ్వని వ్యాపించింది. ఈవిధంగా పరమేశ్వరుడు సప్త సముద్రాల్నీ హోమంచేసిన తరువాత క్రమంగా అన్నిలోకాలనీ ఆహుతివ్వాలని సంకల్పించాడు.

**లోకాల ఆహుతి :** మహాదేవుడు తన దివ్యశక్తితో మొదట పాతాళలోకంలో వున్న ఆదిశేషుడులాంటి మహాసర్పాలన్నిటినీ ఆకర్షించాడు. దానితో పాతాళంలో

వున్న మహాసర్పాలన్నీ సపరివారంగా పైకివచ్చి హోమకుండంలో పడి ఆహుతైపోయాయి. తరువాత అష్టదిగ్గజాల్ని ఆకర్షించి వాటిని కూడా ఆహుతిచ్చాడు. తరువాత భూమండలంమీద ఉన్న సకల జీవరాసుల్నీ ఆకర్షించి వారందరినీ చిదగ్ని కుండంలో సమిధలుగా సమర్పించాడు. ఇలా క్రిందవున్న ఏడులోకాలలోని జీవులందరినీ ఆహుతిచ్చిన తరువాత సప్త ఊర్ధ్వలోకాలలోవున్న వారిని క్రమంగా గ్రహాల్ని, నక్షత్రాల్ని, తేజోరూపదేవతల్ని, ఇంద్రాది దేవతల్ని, యక్షులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు ఆదిత్యులు, అష్టవసువులు, దేవర్షులు సప్తర్షులు, పితృగణాలు తమతమ సమస్త పరివారంతో ఆయుధాలతో సహా స్వచ్ఛందంగా వచ్చి హోమకుండంలో ఆహుతైపోయారు. ఈ విధంగా అరవైఆరుకోట్ల దేవతలు తదితర గణాలన్నీ హోమకుండంలో ఆహుతిగా సమర్పించబడ్డాయి.

ఇంత గొప్పగా మహాయాగం జరుగుతోందని తెలిసికూడా మదోన్మత్తులైన భండాసురాదులు ఏమీప్రతిఘటించకుండా చోద్యం చూస్తున్నారు. ఇక చివరగా మిగిలిన రుద్రుడు, నంది, గణేశుడు, అలాగే బ్రహ్మ, సరస్వతి తదితర సత్యలోకవాసులు, శ్రీమహావిష్ణువు, లక్ష్మీదేవి, విష్వక్సేనుడు ఇతర విష్ణుపరివారం అంతా వచ్చి హోమకుండంలోకి ఆనందంగా ప్రవేశించారు.

ఈ విధంగా మహాదేవుడు అయిదు రకాలుగా జన్మించి సకల దేవజీవ రాసుల్ని చెట్లు, చేమలతోసహా సర్వం చిదగ్నికుండంలో ఆహుతిచ్చాడు. ఇన్ని పదార్థాలు పడటంతో హోమకుండలోని జ్వాలలు బ్రహ్మాండమంతా వ్యాపించాయి. మహాదేవుడు తన వాయురూపాన్ని వదిలేసి నిజరూపాన్ని ధరించాడు. యాగం పూర్తయ్యాక చిదగ్ని కుండానికి నమస్కరించి అందులో నుంచి లలితాపరమేశ్వరిని ఆవిర్భవించమని కోరుతూ ఎనిమిదిరకాల కోరికల్ని భక్తితో పఠించాడు.

## శ్రీ లలితాదేవి అష్టకారికలు

విశ్వరూపిణి సర్వాత్మే విశ్వభూతైక నాయకి ।
లలితా పరమేశాని సంవిద్వహ్నే స్సముద్భవ ॥ 1

ఆనందరూపిణి పరే జగదానందదాయిని ।
లలితాపరమేశాని సంవిద్వహ్నే సముద్భవ॥ 2

జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయరూపే మహజ్ఞానప్రకాశిని ।
లలితాపరమేశాని సంవిద్వహ్నే సముద్భవ ॥ 3

లోకసంహారరసికే కాళికే భద్రకాళికే ।
లలితాపరమేశాని సంవిద్వహ్నే సముద్భవ ॥ 4

లోకసంత్రాణరసికే మంగళే సర్వమంగళే ।
లలితాపరమేశాని సంవిద్వహ్నే సముద్భవ ॥ 5

విశ్వసృష్టి పరాధీనే విశ్వనాథా విశంకటే ।
లలితాపరమేశాని సంవిద్వహ్నే సముద్భవ ॥ 6

సంవిద్వహ్ని హుతాశేష సృష్టి సంపాదితాకృతే ।
లలితాపరమేశాని సంవిద్వహ్నే సముద్భవ ॥ 7

భండాద్యైస్తారకాద్యైశ్చ పీడితానాం సతాంముదే ।
లలితాపరమేశాని సంవిద్వహ్నే సముద్భవ ॥ 8

ఈ విధంగా మహాదేవుడు చేసిన స్తుతికి సంతోషించిన లలితాదేవి ఆ చిదగ్ని కుండం నుంచి ప్రాదుర్భవించింది.

## శ్రీ లలితాదేవి ఆవిర్భావం (మరొక కథనం)

భండాసురుడి వల్ల బాధలు పొందిన దేవతలందరూ అతన్ని ఏవిధంగానూ జయించలేమని తెలుసుకున్నారు. ఆ ఆదిపరాశక్తిని ఆరాధిస్తే తప్ప తమ కష్టాలుపోవని భావించారు. ఒక శుభముహూర్తంలో యోజనం అంత వైశాల్యంలో హోమకుండాన్ని రూపొందించారు. అందులో అగ్నిని స్థాపించారు. ఇంద్రుడు దేవతలతో సురులారా! మనం స్వయంగా మన రక్తమాంసాలను ఆహుతిగా చేసి మహాయాగాన్ని చేద్దాం. దానివల్ల దేవి సంతృప్తి చెంది మనకి దర్శనమిస్తుంది. మన ఆత్మత్యాగం వల్లనే సత్ఫలితాలు లభిస్తాయి. మీరంతా సిద్ధమేనా? అని అడిగాడు. అందరూ సిద్ధమేనని తమ సమ్మతిని తెలియచేసారు.

అప్పుడు ఇంద్రుడు ఒక్కొక్కరి శరీర అవయవాలని తీసుకుని మహాయాగంలో ఆహుతివ్వటం ప్రారంభించాడు. అలా మంత్రపూర్వకంగా దేవతలు తమ చేతుల్ని కాళ్ళని హోమకుండంలో సమర్పించారు. చివరికి తమ పూర్తి శరీరాల్ని సైతం అర్పించటానికి సిద్ధమయ్యారు.

అంతలో హోమకుండం నుంచి ఒక మహాతేజస్సు ఉద్భవించింది. దానిమధ్యలో ఒక చక్రం ఆ చక్రం మధ్యలో దివ్యాలంకార సంశోభిత అయిన మహాదేవి వారికి దర్శనమిచ్చింది. ఉదయసూర్యకాంతితో వెలిగిపోతున్న ఆ దేవి బ్రహ్మ విష్ణు శివాత్మిక, ఆనంద రససాగరంలా వుంది. మందార పువ్వులాటి ఎర్రని శరీరవర్ణంలో, దానిమ్మపూల రంగుచీరను ధరించి, శృంగార రసమయదేవతగా భాసిస్తోంది. ఆ దేవి పాశం, అంకుశం, చెఱకువిల్లు, ఐదుబాణాలు తన నాలుగు చేతుల్లో ధరించి కనిపించింది. అలా మంగళాకార రూపిణిగా దర్శనమిచ్చిన లలితాదేవిని చూసి దేవతలంతా భక్తితో నమస్కరించారు. శరీరాంగాలు కోల్పోయిన వారందరికీ తిరిగి వారి వారి అవయవాలు వచ్చి చేరాయి. సంపూర్ణమైన అంగసౌష్ఠవంతో వారంతా వజ్రదేహులయ్యారు. తమ ఆర్తిని గుర్తించి ప్రత్యక్షమైన లలితా పరాభట్టారికని ఇలా స్తుతించారు.

## శ్రీ లలితాదేవి స్తవం

జయదేవి జగన్మాతర్జయ దేవి పరాత్పరే ।
జయకల్యాణనిలయే జయకామకలాత్మికే ॥ 1

జయకారి చ వామాక్షి జయ కామాక్షి సుందరి ।
జయాభిలసురారాధ్యే జయ కామేశి మానదే ॥ 2

జయ బ్రహ్మమయే దేవి బ్రహ్మాత్మకరసాత్మికే ।
జయ నారాయణి పరే నందితా శేష విష్టపే ॥ 3

జయ శ్రీ కంఠదయితే జయ శ్రీ లలితేఽంబికే ।
జయ శ్రీ విజయే దేవి విజయశ్రీ సమృద్ధిదే ॥ 4

జాతస్య జాయమానస్య ఇష్టాపూర్తస్య హేతవే ।
నమస్తస్యై త్రిజగతాం పాలయిత్ర్యై పరాత్పరే ॥ 5

కలా ముహూర్త కాష్ఠాఽహర్మాసర్తు శరదాత్మనే ।
నమః సహస్రశీర్షాయై సహస్రముఖలోచనే ॥ 6

నమః సహస్ర హస్తాబ్జ పాదపంకజశోభితే ॥
అణోరణుతరే దేవి! మహతోఽపి మహీయసి ॥ 7

పరాత్పరతరే మాతస్తేజస్తేజీయసామపి ।
అతలం తు భవేత్పాదౌ వితలం జానునీ తవ ॥ 8

రసాతలం కటీదేశః కుక్షిస్తే ధరణీ భవేత్ ।
హృదయం తు భువర్లోకః స్వస్తే ముఖముదాహృతమ్ ॥ 9

దృశశ్చంద్రార్కదహనా దిశస్తే బాహవోఽంబికే ।
మరుతస్తు తవోచ్ఛ్వాసా వాచస్తే శ్రుతయోఽఖిలాః ॥ 10

క్రీడా తే లోకరచనా సఖా తే చిన్మయః శివః ।
ఆహారస్తే సదానందో వాసస్తే హృదయే సతామ్ ॥ 11

దృశ్యాదృశ్యస్వరూపాణి రూపాణి భువనాని తే ।
శిరోరుహా ఘనాస్తే తు తారకాః కుసుమాని తే ॥ 12

ధర్మాద్యా బాహవస్తే స్యు రధర్మాద్యాయుధాని తే ।
యమాశ్చ నియమాశ్చైవ కరపాదరుహాస్తథా ॥ 13

స్తనౌ స్వాహాస్వధాకారౌ లోకోజ్జీవనకారకౌ ।
ప్రాణాయామస్తు తే నాసా రసనా తే సరస్వతీ ॥ 14

ప్రత్యాహారస్త్వింద్రియాణి ధ్యానం తే ధీస్తు సత్తమా ।
మనస్తే ధారణాశక్తిర్హృదయం తే సమాధికః ॥ 15

మహీరుహాస్తేంగరుహాః ప్రభాతం వసనం తవ ।
భూతం భవ్యం భవిష్యచ్చ నిత్యం చ తవ విగ్రహః ॥ 16

యజ్ఞరూపా జగద్ధాత్రీ విశ్వరూపా చ పావనీ ।
అదౌయా తు దయాభూతా ససర్జ నిఖిలాః ప్రజాః ॥ 17

హృదయస్థాపి లోకానామదృశ్యా మోహనాత్మికా ।
నామరూప విభాగం చ యా కరోతి స్వలీలయా ॥ 18

తాన్యధిష్ఠాయ తిష్ఠంతీ తేష్వసక్తార్థకామదా ।
నమస్తస్యై మహాదేవ్యై సర్వశక్త్యై నమో నమః ॥ 19
యదాజ్ఞయా ప్రవర్తంతే వహ్నిసూర్యేందుమారుతాః ।
పృథి వ్యాదీని భూతాని తస్యై దేవ్యై నమోనమః ॥ 20
యాససర్జాది ధాతారం సర్గాదావాది భూరిదమ్ ।
దధార స్వయమేవైకా తస్యైదేవ్యై నమోనమః ॥ 21
యథా యాధృతా తు ధరణీ యమాకాశమమేయయా ।
యస్యాముదేతి సవితా తస్యైదేవ్యై నమోనమః ॥ 22
యత్రోదేతి జగత్కృత్స్నం యత్ర తిష్ఠతి నిర్భరమ్ ।
యత్రాంతమేతి కాలే తు తస్యైదేవ్యై నమోనమః ॥ 23
నమో నమస్తే రజసే భవాయై నమోనమః సాత్త్వికసంస్థితాయై ।
నమోనమస్తే తమసే హరాయై నమో నమో నిర్గుణతః శివాయై ॥ 24
నమో నమస్తే జగదేకమాత్రే నమోనమస్తే జగదేకపిత్రే ।
నమోనమస్తేఽఖిల రూపతంత్రే నమోనమస్తేఽఖిలయంత్రరూపే ॥ 25
నమోనమో లోకగురుప్రధానే నమోనమస్తేఽఖిలవాగ్విభూత్యై ।
నమోస్తు లక్ష్మై జగదేతుష్టై నమోనమః శాంభవి సర్వశక్త్యై॥ 26
అనాదిమధ్యాంత మపాం చ భౌతికం హ్యవాఙ్మనోగమ్యమతర్క్య వైభవమ్।
అరూపమద్వంద్వమదృష్టి గోచరం ప్రభావమగ్ర్యం కథమంబ వర్ణయే ॥ 27
ప్రసీద విశ్వేశ్వరి విశ్వవందితే ప్రసీద విద్యేశ్వరి వేదరూపిణి ।
ప్రసీద మాయామయి మంత్రవిగ్రహే ప్రసీద సర్వేశ్వరి సర్వరూపిణి ॥ 28

*(శ్లో॥1-28, అధ్యా-13, ఉ.భా.)*

ఈ విధంగా దేవతలందరూ లలితా దేవిని స్తుతించి శరణువేడుకున్నారు. వారి ప్రార్థనవిన్న దేవి "దేవతలారా ఏం వరంకావాలో కోరుకోండి' అని పలికింది. అప్పుడు ఇంద్రుడు రెండు చేతులూ ఎత్తి నమస్కరించి అమ్మా! జగన్మాతా! లలితాపరమేశ్వరీ! వేమంతా భండాసురుడి వల్ల ఎన్నో బాధలు పడుతున్నాం.

తల్లీ! దయచేసి అతన్ని వధించి మాకు తిరిగి సుఖసంతోషాల్ని ప్రసాదించు అని ప్రాధేయపడ్డాడు. అందుకు దేవ! దేవేంద్రా భయపడకు. అతి త్వరలోనే భండుణ్ణి వధించి మీ అందరికీ ఆనందాన్ని చేకూరుస్తాను. మీరుచేసిన ఈ దివ్య స్తుతి నాకెంతో ఆనందాన్ని కలిగించింది. ఇదే స్తుతిని మానవులు కూడా చేస్తే నేను వారిని కూడా మీలాగానే అనుగ్రహిస్తాను.

"ఈ లలితాస్తవరాజంతో నన్ను స్తుతించిన వారు కీర్తి ప్రతిష్ఠలతో విద్యావైభవంతో వెలుగొందుతారు. ఎలాంటి రోగాలు లేకుండా దీర్ఘకాలం జీవిస్తారు. పుత్రులతో మిత్రులతో, అనుకూలవతి అయిన భార్యతో ఆనందకరమైన జీవితాన్ని అనుభవిస్తారు అని పలికింది. దేవిమాటలు విని వారంతా ఎంతో సంతోషించారు.

**శ్రీలలితాదేవిని దేవతలు దర్శించుట :** ఇంద్రాది దేవతలు చేసిన మహాయాగంలో లలితాదేవి ఆవిర్భవించిందన్న విషయం అక్కడలేని బ్రహ్మాది దేవతలందరికీ తెలిసింది శరవేగంతో వారంతా ఆ దివ్య శక్తిని దర్శించాలని బయలుదేరివచ్చారు. హంసవాహనం మీద బ్రహ్మదేవుడు, గరుత్మంతుణ్ణి ఎక్కి నారాయణుడు, వృషభవాహనం మీద శివుడు వచ్చారు. అదే విధంగా నారదమహర్షి, సప్తర్షులు, అప్సరగణాలు, విశ్వావసువు తదితర గంధర్వులు, యక్షగణాలు తదితర సకలదేవతలూ విచ్చేసి లలితాపరమేశ్వరిని దర్శించారు.

బ్రహ్మదేవుడు వెంటనే దేవశిల్పి విశ్వకర్మని పిలిపించి అద్భుతమైన నగరాన్ని నిర్మించమని ఆదేశించాడు. తన దివ్యశక్తితో కొద్ది క్షణాల్లోనే అపురూపమైన నగరాన్ని నిర్మించాడు విశ్వకర్మ. అప్పుడే సకల మంత్రాలకూ అధీశ్వరి అయిన దుర్గాదేవి, విద్యాధిదేవత అయిన శ్యామల, బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణీ, చాముండా అనే సప్తమాతృకలు, అణిమ మహిమా, గరిమా, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం అనే అష్టసిద్ధులు వచ్చి లలితాపరమేశ్వరికి నమస్కరించాయి. వీరితో కోట్లకొద్దీ యోగినీ గణాలు కూడా దేవిని దర్శించాయి.

వీరితో పాటు భైరవులు, క్షేత్రపాలకులు, మహాశాస్త్రా, గణపతిగణాలు, స్కంధుడు, వటుక భైరవుడు వీరభద్రుడు తదితరులు కూడా లలితాదేవిని దర్శించి నమస్కరించారు.

ఇక విశ్వకర్మదేవి కోసం నిర్మించిన నగరం ఎంతో రమ్యంగా వుంది. ఉన్నతమైన బురుజులతో, తోరణాలతో ప్రకాశిస్తోంది. అక్కడ రాజవీధులు చాలా విశాలంగా వున్నాయి. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యాది వర్ణాల ప్రజలు, దాసదాసీ జనాలు అందమైన ఇళ్ళు ఉన్నాయి. ఆ నగరం నవరత్నమయమైన దివ్యప్రాకారాలతో నెలకొల్పబడి వుంది. ఆ ప్రాకారాల మధ్యలో దివ్యమైన చింతామణి, గృహం ఆ గృహంలో అద్భుతమైన సింహాసనం ఏర్పాటు చేయబడింది.

**కామేశ్వరుడి ఆవిర్భావం :**

ఉదయించిన సూర్యుడిలా ప్రకాశిస్తున్న ఆ దివ్యనగరాన్ని చూసి బ్రహ్మ ఇలా ఆలోచించాడు. "ఈ దివ్యమైన సింహాసనాన్ని అధిష్ఠించాలంటే స్త్రీకిగానీ, పురుషుడికిగానీ వివాహమై వుండాలి. రాజ్యాధికారాన్ని పొందాలంటే మహాపురుష లక్షణాలతో అనుకూలమైన స్త్రీని కలిగివున్న వాడికే అర్హత వుంటుంది. ఈ లలితాదేవి ఉత్తమ స్త్రీ లక్షణాలతో శృంగారసాధిదేవతలా వుంది. ఈమెకి సరైనవరుడు శంకరుడు తప్ప మరెవ్వరూ లేరు. మరి జటలతో కపాలాన్ని ధరించి భయంకరంగా కనిపించే శంకరుణ్ణి వివాహం ఎలా చేసుకుంటుంది? అని అనుకున్నాడు. అంతలోనే కోటిమన్మథుల సౌందర్యంతో దివ్యమైన వస్త్రాల్ని, ఆభరణాల్ని ధరించి నవయువకుడిలా శివుడు బ్రహ్మదేవుడి ముందు ఆవిర్భవించాడు. జగన్మోహనాకారంతో తన ముందు నిలిచిన శంకరుణ్ణి చూసి బ్రహ్మ ఎంతో ఆనందించాడు. వెంటనే ఆయన్ని కౌగిలించుకుని 'కామేశ్వరుడు' అని పేరు పెట్టాడు. ఇక అతడే లలితాపరాభట్టారికకు తగిన వరుడని నిర్ణయించాడు.

జగన్మోహినిగా దివ్య సౌందర్యంతో అలరారుతున్న లలితాత్రిపుర సుందరిని కామేశ్వరుడు చూసాడు. ఆమెకూడా నవయవ్వనంతో షోడశవర్ణ ప్రపూర్ణుడైన కామేశ్వరుణ్ణి దర్శించింది. ఇద్దరి కళ్ళు కళ్ళూ కలుసుకున్నాయి.

ఒకర్నొకరు ఇష్టపడ్డారు. అది గమనించిన బ్రహ్మ దేవితో "ఓదేవీ! ఇక్కడున్న దేవతలు, ఋషులు, సిద్ధులు, మునులు అందరూ నిన్ను భర్తతో సహా చూడాలనుకుంటున్నారు. నీకు ఇష్టమైన ప్రియుడు ఎవరు? ఆ ధన్యపురుషుడు ఎక్కడున్నాడు. లోక సంరక్షణ కోసం నీవు వివాహం చేసుకుని విశ్వకర్మ నిర్మించిన దివ్యనగరానికి రాణివికా. అక్కడున్న మహా సింహాసనాన్ని అధిష్టించి సర్వ సుమంగళిగా నీ భర్తతోసహా నిన్ను ఆ సింహాసనం మీద కూర్చుంటే చూడలని మాకోకోరిక" అని అన్నాడు.

బ్రహ్మ మాటలు విన్న లలితాదేవి చిరునవ్వులు చిందిస్తూ వారందరితో "దేవతలారా! నేను ఎప్పుడూ స్వతంత్రురాలినే. స్వేచ్ఛగా విహరిస్తారు. అయితే మీ అందరి కోరికనూ మన్నించి మీకోసం నాకు యోగ్యుడైన పురుషుణ్ణి వరిస్తాను అని చెప్పింది. వెంటనే తనచేతిలో ఒక దివ్యహారాన్ని ఎత్తి ఆకాశంలోకి విసిరేసింది. దివ్యకాంతులు వెదజల్లుతున్న ఆహారం పైనుంచి సరాసరి వచ్చి కామేశ్వరుడి కంఠాన్ని అలంకరించింది. ఆ దృశ్యాన్ని చూసి బ్రహ్మవిష్ణు తదితర దేవతలంతా ఎంతో సంతోషించారు. ఆకాశంనుంచి పూలవాన కురిసింది.

**శ్రీలలితా-కామేశ్వరుల వివాహం :**

దేవి విసిరిన హారం కామేశ్వరుడి మెడలో పడటంతో బ్రహ్మదేవుడు సంతోషించి మహావిష్ణువుతో ఓ శ్రీహరీ! మనం వీరిద్దరికీ వివాహం జరిపించాలి. మంగళకరమైన రూపంతోవున్న లలితాదేవికి నీవు సోదరుడులాటివాడివి. కనుక నీవు లలితాదేవిని కామేశ్వరుడికిచ్చి వివాహం జరిపించు. అందుకు అంగీకరించిన విష్ణువు విధి విధానంగా లలితాదేవిని కామేశ్వరుడికిచ్చి ఘనంగా వివాహం జరిపించాడు.

శ్రీలలితాశంకరుల వివాహం సందర్భంగా శ్రీమహావిష్ణువు సకల శుభప్రదమైన చెఱకు విల్లును ఎప్పటికీ వాడని పుష్పాయుధాన్ని (బాణాలను) దేవికి కానుకగా ఇచ్చాడు. ఆ వెంటనే వరుణుడు నాగపాశాన్ని, విశ్వకర్మ అంకుశాన్ని, అగ్నిదేవుడు కిరీటాన్ని, సూర్యచంద్రులు చెవికమ్మలను, సముద్రుడు నవరత్నాలని, ఇంద్రుడు అక్షయమైన మధుపాత్రని, కుబేరుడు చింతామణి మయమైన దివ్యమాలని, గంగాయమునలు తెల్లని వింజామరలను ఇచ్చారు.

వీరితో పాటు అష్టవసువులు ఏకాదశరుద్రులు, ద్వాదశ ఆదిత్యులు. అశ్వినీదేవతలు, ఇంద్రాది దిక్పాలకులు, మరుత్తులు, సాధ్యులు, గంధర్వులు, ప్రమథ గణాధిపతులు తమ తమ ఆయుధాలను దేవికి సమర్పించారు. అలాగే దివ్యమైన రథాన్ని గుర్రాల్ని, ఏనుగుల్ని, ఒంటెల్ని కూడా ఆమెకి కానుకగా ఇచ్చారు. తరువాత అందరూ కలిసి కామేశ్వరీ (లలితా) కామేశ్వరులకు మంగళకరంగా అభిషేకం చేసారు.

అభిషేకం పూర్తయిన తరువాత బ్రహ్మదేవుడు ఊర్ధ్వలోకాలన్నిటిలో యథేచ్ఛగా సంచరించగలిగే దివ్యవిమానాన్ని దేవికి బహూకరించాడు. ఆ పుణ్యదంపతులిద్దరూ విమానాన్ని అధిరోహించి కొంతసేపు విహరించి వచ్చారు. తరువాత కామేశ్వరీ కామేశ్వరులు జంటగా నూతనమందిరంలోకి ప్రవేశించి అక్కడున్న మహాసింహాసనాన్ని అలంకరించారు. దేవి నివసించటంతో ఆ మహానగరం దివ్య కాంతితో ఎంతో వైభవంగా శోభిచింది. సకలదేవతలు యోగినీ గణాలు, ఋషులు, మునులు ఆ నగరంలో నివసించాలని నిశ్చయించుకున్నారు. నిత్యం వారంతా లలితాకామేశ్వరులను సేవిస్తూ కాలంగడుపుతున్నారు. ఒకనాడు నారదుడు దేవి దగ్గరకు వెళ్ళి అమ్మా! లోకపావనీ! అందర్నీ రక్షించగలిగే దానివినీవే తల్లీ! భండాసురుడి అకృత్యాలు నానాటికీ మితి మీరిపోయినాయి. నీ ఒక్కదానివే వాడిని సంహరించగలవు. దయచేసి అతన్ని వధించి లోకాలన్నిటికీ మేలు చేయి అని కోరాడు.

## శ్రీ లలితాదేవి యుద్ధానికి బయలుదేరటం

నారదుడి విన్నపాన్ని విన్న లలితాదేవికి కర్తవ్యం గుర్తుకు వచ్చింది. తన అవతార పరమార్థం భండాసురుణ్ణి సంహరించటమే కనుక ఇక ఆలస్యం చేయకూడదు అని నిర్ణయించుకుంది. వెంటనే యుద్ధానికి సర్వసైన్యాన్ని సన్నద్ధం చేసింది. దిక్కులు పిక్కటిల్లేలా యుద్ధభేరీలు మ్రోగాయి. వివిధరకాల యుద్ధవాద్యాల ఘోషణలతో లోకాలన్నీ మారుమ్రోగాయి. లలితాదేవి అంకుశం నుంచి సంపత్కరీ అన్న దేవి ఆవిర్భవించింది. ఆ దేవి కోటి ఏనుగులతో, గుర్రాలతో, రథాలతో కూడి లేత సూర్యుడి కాంతితో ప్రకాశిస్తూ బయలుదేరింది.

తరువాత లలితాదేవి పాశాయుధం నుంచి 'శ్రీ' అనే మహాశక్తి ఆవిర్భవించి అపారమైన అశ్వసైన్యాన్ని తీసుకుని యుద్ధరంగానికి వెళ్ళింది. తరువాత అపారమైన సైన్యాన్ని వెంటబెట్టుకుని 'దండనాథుడు బయలుదేరాడు. అతన్ని ఎన్నోరకాల దేవీ శక్తులు తమ తమ ఆయుధాల్ని ధరించి అనుసరించాయి. వారితోపాటు భైరవ భైరవీగణాలు కూడా వారితో చేరాయి. వీరి వెనకాలే వారాహీ దేవి కదిలింది. ఆమెతో పాటు వందల వేల సంఖ్యలో భయంకరమైన కోరలు కలిగిన వారాహీ గణాలు అనుసరించాయి. ఆ వారాహి సైన్యం వేలాది దున్నపోతుల్ని అధిరోహించి వెళుతుంటే లోకాలన్నీ భయభ్రాంతులయ్యాయి. మహావారాహీ ఎంతో ప్రభావవంతమైనది. ఆ దేవిని దర్శించటానికి దేవతలంతా విమానాలలో వచ్చి ఆమె ముందుకి రాలేక పైనుంచే చూసి నమస్కరించాను.

## వారాహీదేవి ద్వాదశనామాలు

పంచమీదండనాథాచ సంకేతా సమయేశ్వరీ ।
తథాసమయ సంకేతా వారాహీ పోత్రిణీతథా ॥

వార్తాళీచ మహాసేనాప్యాజ్ఞా చక్రేశ్వరీ తథా ।
అరిఘ్నీ చేతి సంప్రోక్తం నామద్వాదశకం మునే ॥

నామద్వాదశకాభిఖ్య వజ్రపంజర మధ్యగః ।
సంకటే దుఃఖ మాప్నోతి నకదాచన మానవః ॥

*(శ్లో॥ 18-20, అధ్యా-17 ఉ.భా)*

వారాహీదేవికి 1.పంచమీ 2. దండనాథా 3. సంకేతా 4.సమయేశ్వరీ 5.సమయసంకేతా 6.వారాహీ 7.పోత్రిణీ 8.వార్తాళీ 9.మహాసేనా 10.ఆజ్ఞా 11.చక్రేశ్వరీ 12.అరిఘ్నీ అనే పన్నెండు నామాలున్నాయి. ఈ నామాలతో దేవిని స్తుతిస్తే ఆమె ఎంతో ఆనందిస్తుంది. ఆ నామాల్ని శ్రద్ధగా పఠించినవాడు మహాఘోరమైన కష్టాల నుంచి కూడా అవలీలగా బైటపడతాడు.

**మంత్రనాథ శ్యామలాదేవి :** వారాహీగణం తరువాత మంత్రనాథ శ్యామలాదేవి గణాలు అట్టహాసంగా యుద్ధరంగానికి బయలుదేరాయి. వారంతా శ్యామలవర్ణంతో

వీణావాద్యాలు వాయించుకుంటూ, కొందరు నాట్యాలు చేస్తూ, మయూర, హంస వాహనాలు ఎక్కి బయలుదేరారు. మంత్రనాయిక అయిన శ్యామలాదేవి దివ్యమైన రథాన్ని అధిరోహించి తన గణాలతో ముందుకు నడుస్తోంది. శ్యామలవర్ణంతో శోభిస్తున్న ఆ దేవిని ఆకాశం నుంచి దర్శించిన దేవతలు పదహారు నామాలతో ఇలా స్తుతించారు.

## శ్యామలాదేవి షోడశ (16) నామాలు

సంగీతయోగినీ శ్యామా శ్యామలా మంత్ర నాయకా ।
మంత్రిణీసచివేశీ చప్రధానేశీ శుకప్రియా ॥ 1

వీణావతీ వైణికీచ ముద్రిణీ ప్రియక ప్రియః ।
నీపప్రియా కదంబేశీ కదంబవనవాసినీ ॥ 2

సదామదాచనామాని షోడశైతాని కుంభజ ।
ఏతైర్యః సచివేశానీం సకృత్ స్తౌతి శరీరవాన్ ।
తస్యత్రైలోక్య మఖిలం హస్తే అష్టత్యశంసయమ్ ॥ 3

*(శ్లో॥ 33-35, అధ్యా 17 ఉ.భా)*

1.సంగీతయోగినీ 2.శ్యామ 3.శ్యామల 4.మంత్రనాయికా 5.మంత్రిణీ 6.సచివేశీ 7.ప్రధానేశీ 8.శుకప్రియా 9.వీణావతీ 10.వైణికీ 11.ముద్రిణీ 12.ప్రియకప్రియా 13.నీపప్రియా 14.కదంబేణీ 15.కదంబవాసినీ 16.సదామదా - ఈ పదహారు పేర్లతో మంత్రనాయిక శ్రీ శ్యామలాదేవిని స్తుతించిన మానవుడు ముల్లోకాలనీ తన అదుపులో ఉంచుకోగలడు.

మహాశక్తి సంపన్నురాలైన దండనాయకి శ్యామలాదేవి చూపు ఎక్కడ పడితే అక్కడ శత్రుసైన్యమంతా నశించిపోతారు. అలాంటి శ్యామలాదేవి వెయ్యి అక్షౌహిణీల సైన్యంతో ముందుకు సాగుతోంది. ముందుగా వారాహీశక్తులు, దండనాథులు, దండనాయకి శ్యామలాదేవి పరివారం ముందు కదలగా లలితాదేవి వారి వెనుక స్వయంగా దివ్యరథాన్ని అధిరోహించి సంగ్రామానికి బయలుదేరింది.

ఆ లలితా దేవి ధరించిన అంకుశం అగ్నిజ్వాలలు వెదజల్లుతోంది. ఆమె పాశం  నాగుపాములాగా భయంకరంగా వుంది. చేతిలో చెఱుకువిల్లుని, అందమైన అయిదుపూల బాణాలను ధరించింది. ఈ విధంగా మన్మథ స్వరూపిణిగా వేయి సూర్యులకన్నా అధికమైన కాంతితో ప్రకాశిస్తోంది. పరిచారికలు వింజామరలు వీస్తుండగా, దేవతాస్త్రీలు మధురమైన గీతాలతో ఆమెని స్తుతిస్తుండగా, ఆమె ముందుకు కదిలింది. ఆ దేవి ప్రభావాన్ని చూసి ఆనందించిన దేవతలు భక్తిగా ఆమెకి నమస్కరించారు మరుద్గణాలు లలితాదేవిని పంచవింశతి (25) నామాలతో ఇలా స్తోత్రం చేసారు.

## లలితాదేవి షోడశ నామాలు

సింహాసనా శ్రీలలితా మహారాజ్ఞీ పరాంకుశా ।
చాపినీ త్రిపురాచైవ మహా త్రిపుర సుందరీ ॥ 1

సుందరీ చక్రనాథాచ సామ్రాజ్ఞీ చక్రిణీతథా ।
చక్రేశ్వరీ మహాదేవీ కామేశ్వరీ పరమేశ్వరీ ॥ 2

కామరాజ ప్రియా కామకోటిగా చక్రవర్తినీ ।
మహావిద్యా శివానంగవల్లభా సర్వపాటలా ॥ 3

కులనాథామ్నాయనాథా సర్వామ్నాయ నివాసినీ ।
శృంగార నాయికా చేతి పంచవింశతి నామభిః ॥ 4

స్తువంతియే మహా భాగాం లలితాం పరమేశ్వరీం ।
తే ప్రాప్నుమతి సౌభాగ్య మష్టాసిద్ధీర్మహద్యశః ॥ 5

*(శ్లో॥14-18 అధ్యా 18, ఉ.భా)*

1.సింహాసనా 2.శ్రీలలితా 3.మహారాజ్ఞీ 4.పరాంకుశా 5.చాపినీ 6.త్రిపురా 7.మహాత్రిపుర సుందరి 8, సుందరీ 9.చక్రనాథా 10.సామ్రాజ్ఞీ 11.చక్రిణీ 12.చక్రేశ్వరీ 13.మహాదేవీ 14.కామేశీ 15.పరమేశ్వరీ 16.కామరాజ ప్రియా 17.కామకోటిగా 18. చక్రవర్తినీ 19.మహావిద్యా 20.శివా 21.అనంగ వల్లభా 22.సర్వపాటలా 23.కులనాథా

24.ఆమ్నాయనాథా 25.సర్వామ్నాయనివాసినీ (శృంగారనాయికా) అనే 25(26) నామాలతో శ్రీలలితా దేవిని స్తుతించేవారు. సకల సౌభాగ్యాలను, అష్టసిద్ధుల్ని, గొప్పకీర్తి ప్రతిష్ఠల్ని పొందుతారు.

ఈ విధంగా సకలదేవతలూ తనని స్తుతిస్తుండగా మహాపరివారంతో లలితాదేవి సమరోత్సాహంతో ముందుకు కదిలింది.

## చక్రరాజ రథపర్వాన్ని ఆశ్రయించిన దేవతలు

మహాత్రిపురసుందరీ దేవి గేయచక్ర రథాన్ని ఆశ్రయించి ఎందరో దేవతలు, యోగినీశక్తులు యుద్ధరంగానికి బయలుదేరారు. ఈ గేయ చక్రరథం అనే శ్రీచక్రరాజ రథంలో మొత్తం తొమ్మిది ప్రధానమైన చక్రాలు (ఆవరణలు) ఉంటాయి. ఒక్కొక్క చక్రంలో ఒక్కో విధమైన దేవీ శక్తులుంటారు.

### 1. త్రైలోక్య మోహనచక్రం (భూపురం)

హయగ్రీవుడు అగస్త్యుడితో ఇలా చెబుతున్నాడు. అగస్త్యా! లలితాదేవి చక్రరథంలోని తొమ్మిదో పర్వాన్ని ఆశ్రయించుకున్న దేవతలు మొత్తం పదిమంది. 1.అణిమా 2.మహిమా 3.లఘిమా 4.గరిమా 5.ఈశితా 6.వశితా 7.ప్రాప్తిసిద్ధి 8.ప్రాకామ్యా 9.భుక్తిసిద్ధి 10.సర్వకామాసిద్ధి – ఈ పదిమంది సిద్ధిదేవతలు నాలుగు బాహువులతో, జపాకుసుమంలాగా ఎర్రని రంగుతో చింతామణి, కపాలం, త్రిశూలం, సిద్ధికజ్జలం అనేవి ధరించి వుంటారు. వారిని యోగులు నిత్యం సేవిస్తుంటారు. ఈ పర్వంపైభాగంలో 1.బ్రాహ్మీ 2.మాహేశ్వరీ 3.కౌమారీ 4.వైష్ణవీ 5.వారాహీ 6.మాహేంద్రీ 7.చాముండా 8. మహాలక్ష్మీ అనే అష్ట మాతృకలున్నారు. వీరు ద్విభుజాలతో కపాలం, ఎర్రని పద్మం ధరించి వుంటారు. వీరికి పైభాగంలో మొత్తం పదిమంది ముద్రా దేవతలుంటారు. వారెవరంటే 1.సర్వసంక్షోభిణీ 2.సర్వవిద్రావిణీ 3.సర్వాకర్షిణీ 4.సర్వవశంకరీ 5.సర్వోన్మాదినీ 6.సర్వమహాంకుశీ 7.సర్వఖేచరీ 8.సర్వబీజా 9.సర్వయోని 10.సర్వత్రిఖండికా అని. ఈ ముద్రాదేవతలు కూడా భండాసుర సంహారం కోసం ఆ చక్రంలో వేచివున్నారు.

## 2. సర్వాశా పరిపూరక చక్రం (16 దళాల పద్మం)

అగస్త్యా లలితాదేవికి చెందిన చక్ర రాజ రథంలోవున్న సర్వాశీపరిపూరక చక్రంలో ఎనిమిదోపర్వాన్ని ఆశ్రయించుకుని పదహారుమంది సప్తయోగినీ గణాలున్నాయి. 1.కామాకర్షిణీ 2.బుద్ధ్యాకర్షిణీ 3.అహంకారాకర్షిణీ 4.శబ్దాకర్షిణీ 5.స్పర్శాకర్షిణీ 6.రూపాకర్షిణీ 7.రసాకర్షిణీ 8.గంధాకర్షిణీ 9.చిత్తాకర్షిణీ 10.ధైర్యాకర్షిణీ 11.స్మృత్యాకర్షిణీ 12.నామాకర్షిణీ 13.బీజాకర్షిణీ 14.ఆత్మాకర్షిణీ 15.అమృతాకర్షిణీ 16.శరీరాకర్షిణీ అని ఈ పదహారు గుప్తయోగినులు పగడపు చెట్టులా వుంటారు. ఎప్పుడూ ఆనందంగా నవ్వుతూనే ఉంటారు. వీరు నాలుగు భుజాలతో, మూడు కళ్ళతో, ధనుర్బాణాలు, చర్మ ఖడ్గాలు ధరించి దివ్యతేజస్సుతో ప్రకాశిస్తుంటారు.

## 3. సర్వసంక్షోభణ చక్రం (అష్టదళపద్మం)

జ్వలద్దీపం అనే ఈ సర్వసంక్షోభణ చక్రంలో ఏడో పర్వాన్ని ఆశ్రయించుకుని ఎనిమిదిమంది "గుప్తతర శక్తులున్నాయి అవి 1.అనంగకుసుమా 2.అనంగవేఖలా 3.అనంగమదనా 4.అనంగమదనాతురా 5.అనంగరేఖా 6.అనంగవేగా 7.అనంగాంకుశా 8.అనంగమాలినీ అని. ఈ ఎనిమిది మందీ జపాకుసుమంలాగా ఎర్రగా ప్రకాశిస్తూ వుంటారు. వీరంతా చెఱకు విల్లుని, పూలబాణాల్ని పద్మాన్ని ధరించి మహాపరాక్రమాన్ని ప్రదర్శిస్తుంటారు. లలితాదేవి ఆజ్ఞకోసం ఎదురుచూస్తూ యుద్ధరంగంలోకి ఎప్పుడు దూకుదామా అని ఉత్సాహంగా వున్నారు.

## 4. సర్వ సౌభాగ్యదాయక చక్రం (ఆవరణ)

అగస్త్యా! చక్రరాజరథంలోని ఆరోపర్వాన్ని ఆశ్రయించుకుని పదిమంది సాంప్రదాయ శక్తులున్నారు. వారెవరంటే 1.సర్వసంక్షోభిణీ 2.సర్వవిద్రావిణీ 3.సర్వసమ్మోహినీ 4.సర్వస్తంభినీ 5.సర్వజృంభిణీ 6.సర్వోన్మాదినీ 7.సర్వార్థసాధనీ 8.సర్వసంపత్తిపూరణీ 9.సర్వమంత్రమయీ 10.సర్వద్వంద్వక్షయంకరీ అనేవారు. ఈ పదిమంది శక్తులూ తీవ్రమైన స్వభావం కలిగినవారు.

అగ్నిధనుస్సు, అగ్నిబాణం, అగ్నిఖడ్గం, అగ్నిచక్రాన్ని ధరించి ప్రళయాగ్ని కాంతితో ప్రకాశిస్తూంటారు. భండాసురుడి మీదకి దూకటానికి సదాసన్నద్ధంగా వుంటారు

## 5. సర్వార్థ సాధక చక్రం (బహిర్దశారం)

చక్రరాజరథంలోని అయిదో పర్వంలో మొత్తం పదిమది కులోత్తీర్ణాది మహాశక్తులున్నారు. 1.సర్వసిద్ధిప్రదా 2.సర్వసంపత్ప్రదా 3.సర్వప్రియంకరీ 4.సర్వమంగళకారిణీ 5.సర్వకామప్రదా 6.సర్వదుఃఖవిమోచినీ 7.సర్వమృత్యు ప్రశమనీ 8.సర్వవిఘ్న నివారిణీ 9.సర్వాంగ సుందరీ 10.సర్వసౌభాగ్యదాయినీ అనే ఈ పదిమంది శక్తులూ స్ఫటికంలాగా తెల్లగా వుంటారు. తమ దివ్యహస్తాలలో గొడ్డలి పాశం, గద, ఘంటామణిని ధరించి యుద్ధరంగలోకి దూకటానికి సంసిద్ధులై వుంటారు.

## 6. సర్వ రక్షాకర చక్రం (అంతర్దశారం)

అగస్త్యా! చక్రరాజరథం నాలుగో పర్వాన్ని ఆశ్రయించుకుని పదిమంది 'నిగర్భయోగినీ' శక్తులున్నారు. వీరెవరంటే 1.సర్వజ్ఞా 2.సర్వశక్తి 3.సర్వైశ్వర్య ప్రదాయినీ, 4.సర్వజ్ఞానమయీ 5.సర్వవ్యాధివినాశినీ 6.సర్వధారస్వరూపా 7.సర్వపాపహరా 8.సర్వానందమయీ 9.సర్వరక్షాస్వరూపిణీ 10.సర్వేప్సిత ఫలప్రదా అనేవారు. వీరు ముత్యాలకాంతిలో వెలుగొందుతుంటారు. వీరందరూ నాలుగు భుజాలతో వజ్రం, శక్తి, తోమరం, చక్రం అనే ఆయుధాల్ని ధరించి భండాసుర వధకోసం ఎదురుచూస్తుంటారు.

## 7. సర్వ రోగహర చక్రం (అష్టారం)

లలితాదేవి అధిరోహించిన చక్రరాజరథంలోని మూడో పర్వంలో వాక్కుకి అధిదేవతలైన ఎనిమిది మంది శక్తులు వుంటారు. 1.వశినీ, 2.కామేశీ 3.మోదినీ, 4.విమలా 5.అరుణా 6.జయినీ 7.సర్వేశీ 8.కౌళినీ అనే ఈ ఎనిమిది మందీ వాగ్దేవతలు. వీరంతా ఎర్రని శరీరకాంతితో మెరిసిపోతూ రెండుచేతుల్లో ధనుర్బాణాల్ని, వీణాపుస్తకాల్ని, శరీరానికి కవచాన్ని ధరించి వుంటారు.

## 8. సర్వసిద్ధిప్రద చక్రం (త్రికోణం)

అగస్త్యా! లలితాదేవి చక్రరాజరథంలో రెండో పర్వం వుంది. దాన్ని ఆశ్రయించుకుని 1.కామేశీ 2.వజ్రేశీ 3.భగమాలినీ అనే ముగ్గురు దేవతలున్నారు. వీరు ఎనిమిది బాహువులతో ధనుర్బాణాలు, పానపాత్ర మాతులుంగం, కత్తి, ఫలకం, నాగపాశం, గంట ధరించి వుంటారు. వీరు ముగ్గురూ లలితాదేవికి అంతరంగికులు. లలితాదేవితో సమానమైన పరాక్రమం కలిగినవారు.

## 9. సర్వానందమయ చక్రం (బిందువు)

చక్రరాజరథంలోని మధ్యలో వున్నదే మహాపీఠం. ఈ పీఠం మీదే దేవి కొలువుంటుంది. ఆమె పీఠం చుట్టూ 1.కామేశీ 2.భగమాలా 3.నిత్యక్లిన్నా 4.భేరుండా 5.వహ్నివాసినీ 6.మహావజ్రేశ్వరీ 7.దూతీ 8.త్వరితా 9.నవమీ 10.కులసుందరీ 11.నిత్యా 12.నీలపతకా 12.విజయా 13.సర్వమంగళా 14.జ్వాలామాలినీ 15.చిత్రా అనే పదిహేనుమంది దివ్యశక్తులున్నారు. వారంతా లలితాదేవితో సమానమైన ఆకారాన్ని శక్తి సామర్థ్యాలనీ కలిగివున్నారు.

## గేయచక్రరథం - దేవతలు

శ్రీలలితాపరమేశ్వరీ దేవికి మంత్రిణి శ్యామలాదేవి. ఆమె అధిరోహించిన రథంపేరు గేయచక్ర రథం. ఈ గేయచక్ర రథంలో మొత్తం ఏడు పర్వాలున్నాయి.

**1.మొదటిపర్వం :** గేయచక్రరథంలోని మొదటి పర్వంలో మంత్రిణి అయిన శ్యామలాదేవి నివసిస్తుంది. సంగీతయోగిని అయిన ఈ శ్యామలాదేవి లలితా త్రిపురసుందరికి అత్యంత ప్రీతిపాత్రమైన ఇష్టసఖి.

**2.రెండో పర్వం :** గేయచక్ర రథంలో రెండో పర్వంలో 1.రతి 2.ప్రీతి 3.మనోజ అనే దేవతలున్నారు. వీరు తమాల వక్షంలాగా శ్యామల వర్ణంతో వుంటారు. చేతుల్లో వీణా ధనస్సు ధరించి యుద్ధానికి సిద్ధంగా వున్నారు.

**3.మూడోపర్వం :** గేయచక్రరథం మూడో పర్వంలో 1.ద్రావిణీ 2.శోషిణీ 3.బంధినీ 4.మోహినీ 5.ఉన్మాదినీ అనే అయిదు మదనబాణ దేవతలు ప్రకాశిస్తుంటారు.

**4.నాలుగోపర్వం :** ఇందులో 1.కామరాజ 2.కందర్ప 3.మన్మథ 4.మకరధ్వజ 5.మనోభవ అనే అయిదుగురు పురుషదేవతలుంటారు. వీరు అన్ని లోకాలనీ మోహింపచేయగలరు.వీరంతా ముత్యాలహారం ధరించి కస్తూరీ తిలకాన్ని దిద్దుకున్నారు. వీరితోపాటు అష్టమాతృకలు అనగా ఆ పర్వం క్రింది భాగంలో లక్ష్మీ, సరస్వతీ, రతి, ప్రీతి, కీర్తి, శాంతి, పుష్టి, తుష్టి అనే శక్తులు కూడా పరివేష్టించివున్నారు.

**5.అయిదో పర్వం :** ఈ పర్వంలో 1.వామా 2.జ్యేష్ఠా 3.రౌద్రీ 4.శాంతి 5.శ్రద్ధా 6.సరస్వతీ 7.క్రియాశక్తి 8.లక్ష్మీ 9.తుష్టి 10.మోహినీ 11.ప్రమథినీ 12.ఆశ్వాసినీ 13.వీచీ 14.విద్యున్మాలినీ 15.సుదానందా 16.నాగబుద్ధికా అనే షోడశ మహాశక్తులుంటారు. వీరంతా కురువింద మణికాంతితో మెరిసి పోతూ వజ్రకవచాన్ని దండం, భుశుండివంటి ఆయుధాల్ని ధరించి వుంటారు.

**6.ఆరోపర్వం :** గేయచక్రరథంలోని ఆరో పర్వంలో 1.అసితాంగ 2.రురు 3.చండ 4.క్రోధ 5.ఉన్మత్త 6.కపాల 7.భీషణ త్రిశూలం, పానపాత్ర ధరించి నీలవర్ణంతో ప్రకాశిస్తున్నారు.

**7.ఏడోపర్వం :** గేయచక్రరథంలోని ఏడో పర్వంలో 1.మాతంగీ 2.సిద్ధలక్ష్మీ 3.మహామాతంగికా 4.మహతీ 5.సిద్ధలక్ష్మీ అని అయిదు మంది దేవతలుంటారు. వీరంతా ధనుర్బాణాలు ధరించి యుద్ధానికి సిద్ధంగా వుంటారు.

ఈ పర్వానికి క్రిందిభాగంలో గణపుడు, క్షేత్రవడు, దుర్గాంబ, వటుకుడు అనే నలుగురూ శస్త్రాస్త్రాలు ధరించి వున్నారు. వారిప్రక్కనే లక్ష్మీ, సరస్వతి, శంఖ పద్మనిధులు వున్నారు. వీరికి క్రిందిభాగంలో ఇంద్రాది దేవతలు, శ్రీమహావిష్ణువు, దిక్పాలకులు వివిధ ఆయుధాలు ధరించి నిలుచున్నారు. మహామంత్రిణి అయిన శ్యామలాదేవి ఆజ్ఞకోసం వీరంతా ఎదురుచూస్తున్నారు.

ఈ విధంగా లలితాదేవి చక్రరాజ రథంలో, మంత్రిణి శ్యామలాదేవి గేయచక్ర రథంలో వివిధ రకాల యోగినీ శక్తులు, వివిధరకాల దేవీ దేవతల నామాలు, వారు ధరించిన ఆయుధాలు చెప్పబడ్డాయి. ఈ దేవతలందరి నామాల్ని స్మరించినవారు సకల పాపాలనుంచీ విముక్తులై యుద్ధాలలో విజయాన్ని పొందుతారు.

## కిరిచక్ర రథం (దేవతలు)

లలితాదేవికి చెందిన కిరిచక్రంలో మొత్తం అయిదు పర్వాలున్నాయి. 'కిరి' అంటే వరాహం. ఈ రథానికి దండనాథురాలు వారాహీదేవి. ఈ కిరిచక్రాన్ని అధిష్ఠించిన వారాహీదేవి లలితా పరమేశ్వరి ఎడమభాగంలో నడుస్తుంది. ఈమె ఎప్పుడూ దండాన్ని ధరించివుంటుంది. ఈ కిరి చక్రం మొదటి పర్వంలో దండ నాయిక వారాహీదేవి నీలమేఘకాంతితో ప్రకాశిస్తూ వివిధరకాల శస్త్రాస్త్రాల్ని ధరించివుంటుంది. ఇక మిగిలిన చక్రాలలో ఎంతోమంది యోగినీ గణాలు, భయంకరమైన శక్తులు, దేవతాగణాలు ఇంద్రాది అష్టదిక్పాలకులు, ద్వాదశఆదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, పిశాచాలు, నారదాది మహర్షులు వుంటారు.

## భండాసుర సంహారం

సకలగణాలతో బయలుదేరిన లలితాదేవి మహోత్సాహంతో యుద్ధరంగంలోకి ప్రవేశించి యుద్ధవాద్యాలు మ్రోగింపచేసింది. భయంకరమైన ఆ యుద్ధభేరి నాదాల్ని విని శూన్యకనగరంలో వున్న భండాసురుడికి, అతడి పరివారానికి గుండెలవిసిపోయాయి. భండాసురుడు తన సోదరులైన విశుక్రవిషంగులతో మంత్రాలోచన చేసాడు. వెంటనే వారి సూచన ప్రకారం లలితాదేవితో యుద్ధం చేయటానికి తన సైన్యాన్నంతా సన్నద్ధం చేసాడు. శూన్యకనగరానికి కట్టుదిట్టమైన భద్రతని కల్పించాడు. భండుడి సైన్యాధ్యక్షుడు ముందుగా దుర్మదుడనే రాక్షసుణ్ణి పది అక్షౌహిణీలసైన్యంతో యుద్ధానికి పంపించాడు.

### కురండ-దుర్మదుల వధ :

దుర్మదుడు తన సైన్యంతో లలితాదేవి సైన్యం మీద దాడిచేసాడు. పోరు ఘోరంగా కొనసాగింది. ఇరుపక్షాలవారూ హోరాహోరీగా పోరాడుతున్నారు. లలితాదేవి సైన్యంలో మహాశక్తి సంపన్నురాలైన సంపత్కరీదేవి యుద్ధరంగంలో వీరవిజృంభణ చేసి దుర్మదుణ్ణి దారుణంగా సంహరించింది.

ఆ దుర్మదుడి సంహారంతో దానవులంతా కకావికలైపోయారు. ఆ విషయం భండుడికి తెలిసింది. వెంటనే కురుండుణ్ణి పంపించాడు. ఇరవై అక్షోహిణీల సైన్యంతో వచ్చిన కురుండుడు కొద్దిసేపు మాత్రమే యుద్ధం చేయగలిగాడు. మహాభయంకరురాలైన అశ్వారూఢాదేవి కురండుణ్ణి అవలీలగా వధించింది.

భండుడికి ఆవేశం వచ్చింది. ఇలా ఒకర్ని పంపితే సరిపోదని భావించి కురంకుడుతోపాటు మరినలుగురు సైన్యాధిపతుల్ని యుద్ధరంగానికి పంపించాడు. వచ్చినవారు వచ్చినట్టే లలితాదేవి పరివారం చేతిలో హతమైపోయారు. తరువాత ఏడుగురు సేనాధిపతుల్ని పంపాడు. వారుకూడా ఊర్ధ్వలోకాలు చేరుకున్నారు.

**భండపుత్రవధ :** ఇందరు మరణించటంతో స్వయంగా యుద్ధరంగంలోకి ప్రవేశించిన విషంగుడు నిత్యాదేవత అయిన కామేశ్వరీదేవి చేతిలో దెబ్బతిని యుద్ధరంగం నుంచి పారిపోయాడు. వెంటనే భండుడు తన పుత్రుల్ని స్వయంగా యుద్ధరంగానికి పంపించాడు. వారంతా మహాభయంకరంగా యుద్ధం చేస్తూ దేవీ సైన్యాన్ని చికాకుపరిచారు. వారిని చూసి చంపాలని ముచ్చటపడింది బాలాదేవి. వెంటనే లలితాదేవి అనుమతికోరింది. ఆమె అనుమతించటంతో వీర విజృంభణ చేసి భండుడి పుత్రులందర్నీ సైన్యంతో సహా సంహరించింది.

**విశుక్రవిషంగవధ :** తనకుమారుల మరణంతో భండాసురుడు ఆగ్రహోదగ్రుడయ్యాడు. విశుక్రుణ్ణి పిలిచి లలితాదేవి సైన్యం ఉన్న ప్రదేశంలో జయానికి విఘ్నం కలిగించే యంత్రాన్ని స్థాపించి రమ్మన్నాడు. అయితే విశుక్రుడు స్థాపించిన యంత్రాన్ని గణపతి భేదించేసాడు. ఇది తెలిసి ఒకేసారి మహాబలవంతులైన విషంగ–విశుక్రులని అపారసైన్యంతో సహా యుద్ధానికి పంపాడు భండాసురుడు. వారిద్దరూ మహామాయావులు, చిత్రవిచిత్రంగా యుద్ధంలో ఎన్నో మాయోపాయాలు ప్రయోగించారు. చివరికి మంత్రిణి శ్యామలాదేవి చేతిలో విశుక్రుడు, దండనాయకి వారాహీ చేతిలో విషంగుడు ఘోరంగా మరణించారు.

# శ్రీ లలితా భండాసుర యుద్ధం

లలితాదేవి పరివారశక్తులచేతిలో తన వారంతాహతమైపోవటంతో, ఇక తాడోపేడో తేల్చుకుందామని స్వయంగా బయలుదేరాడు భండాసురుడు. కుటిలాక్షుడు రెండువేల నూటయాభై అక్షౌహీలసైన్యంతో భండాసురుడి వెంటనడిచాడు. కుటిలాక్షుడుకాక మరోనలభైమందిమహావీరులైన సైన్యాధిపతులు కూడా తమ తమ గణాలతో యుద్ధరంగానికి నడిచారు. అంతటి అపారసైన్యం నడపటానికి భూమండలం సరిపోలేదు. కొందరు ఆకాశమార్గం ద్వారా రణరంగానికి వచ్చారు.

దేవీ సైన్యానికి భండాసురుడి గణాలకీ మధ్యయుద్ధం ప్రారంభమైంది. వారిరువురి మధ్య జరుగుతున్న పోరులో కోట్లాదిమంది అసురసైన్యం హతమయ్యారు. దేవీ భండాసురులు పరస్పరం ఎదురుపడ్డారు. భండాసురుడు లలితాదేవి మీద అంధతామిస్రకం, అంతకాస్త్రం, సర్వాస్త్రస్మృతి నాశనం, మహారోగాస్త్రం, ఆయుర్నాశాస్త్రం వంటి దివ్యాస్త్రాల్ని ప్రయోగించాడు. లలితాదేవి వాటన్నిటినీ అవలీలగా ఛేదించింది. ఒక్కసారిగా భండాసురుడి మీద పట్టరానంత ఆగ్రహం కలిగి భయంకరంగా వికటాట్టహాసం చేసింది. ఆ అట్టహాసం నుంచి మహాశక్తి స్వరూపిణి అయిన దుర్గాదేవి ఆవిర్భవించింది. సకల దేవతలూ ఆమెకి తమ తమ ఆయుధాల్నిచ్చారు. ఇలా దేవతలందరి ఆయుధాలు ధరించిన దుర్గాదేవి సింహవాహనాన్ని ఎక్కి భండుడి సైన్యాన్ని చీల్చి చెండాడటం ప్రారంభించింది.

**భండాసుర వధ :** భండాసురుడు తిరిగి లలితాదేవి మీద మూకాస్త్రాన్ని, హిరణ్యాక్షమహాస్త్రాన్ని, బలీంద్రాస్త్రాన్ని, తీవ్రమైన శక్తి గల 'కలి' అస్త్రాన్ని ప్రయోగించాడు. లలితాదేవి తన చేతివేళ్ళకున్న గోళ్ళనుంచి నారాయణాది వివిధదేవతల్ని మహాశక్తుల్ని, సృష్టించి భండుడి అస్త్రాలనుంచి ఆవిర్భవించిన మహాసురుల్ని సంహరింపచేసింది. ఈవిధంగా వారిమధ్య ఘోరంగా యుద్ధం కొనసాగుతోంది.

చివరికి అన్ని అస్త్రాలూ విఫలమవటంతో భండాసురుడు ఒంటరిగా నిలబడిపోయాడు. అదే సమయంలో లలితాదేవి, కోటిసూర్యులకాంతులు వెదజల్లే మహాకామేశ్వరాస్త్రాన్ని ప్రయోగించి భండాసురుణ్ణి వధించింది.

భండాసురవధతో ఒక్కసారిగా దేవీ సైన్యంలో హర్షాతి రేకాలు ప్రారంభమయ్యాయి. సకల దేవతలూ నింగి నుంచి పూలవాన కురిపించారు. దేవగంధర్వ స్త్రీలందరూ దేవికి మంగళహారతులిచ్చారు. అప్సరసలు ఆనంద నృత్యాలూ చేసారు. లోకాలన్నీ శాంతించాయి. బ్రహ్మాదిదేవతలు దేవిని మహావైభవంగా ముక్త కంఠంతో ఇలా స్తుతించారు.

## బ్రహ్మాదులు చేసిన శ్రీ లలితాస్తుతి

నమోనమస్తే జగదేకనాథే నమోనమః శ్రీ త్రిపురాభిధానే ।
నమోనమో భండ మహాసురఘ్నే నమో ఽస్తు కామేశ్వరి వామకేశి ॥ 1

చింతామణే చింతాదానదక్షేఽచింత్యే చిరాకారతరంగమాలే ।
చిత్రాంబరే చిత్రజగత్ప్రసూతే చిత్రాఖ్యనిత్యే సుఖదే నమస్తే ॥ 2

మోక్షప్రదే ముగ్ధశశాంకచూడే ముగ్ధస్మితే మోహన భేదదక్షే ।
ముద్రేశ్వరీ చర్చిత రాజతంత్రే ముద్రాప్రియే దేవి నమోనమస్తే ॥ 3

క్రూరాంతకధ్వంసిని కోమలాంగే కోపేషు కాళీం తనుమాదధానే ।
క్రోడాననే పాలితసైన్య చక్రే క్రోడీకృతాశేషభయే నమస్తే ॥ 4

షడంగదేవీ పరివార కృష్ణే షడంగయుక్త శ్రుతి వాక్యమృగ్యే ।
షట్చక్రసంస్థే చ షడూర్మియక్తే షడ్భావరూపే లలితే నమస్తే ॥ 5

కామే శివే ముఖ్య నమస్త నిత్యే కాంతాసనాంతే కమలాయతాక్షి ।
కామప్రదే కామిని కామశంభోః కామ్యే కలానామధిపే నమస్తే ॥ 6

దివ్యౌషధాద్యే నగరౌఘరూపే దివ్యే దినాధీశసహస్రకాంతే ।
దేదీప్యమానే దయయా సనాథే దేవాది (ది) దేవప్రమదే నమస్తే ॥ 7

సదాణిమాద్యష్టకసేవనీయే సదాశివాత్మోజ్జ్వల మంచవాసే ।
సభ్యే సదేకాలయపాదపూజ్యే సావిత్రి లోకస్య నమోనమస్తే ॥ 8

బ్రాహ్మీముఖైరాత్మ గణైర్నిషేవ్యే బ్రహ్మప్రియే బ్రాహ్మణ బంధభేత్రి ।
బ్రహ్మామృతస్రోతసి రాజహంసి బ్రహ్మేశ్వరి శ్రీ లలితే నమస్తే ॥ 9

సంక్షోభిణీ ముఖ్యసమస్తముద్రా సంసేవితే సంసరణ ప్రహంత్రి ।
సంసార లీలాకృతి సారసాక్షి సదా నమస్తే లలితే ఉధినాథే ॥ 10

నిత్యే కలాషోడశకేన నామాకర్షిణ్యధీశి ప్రమథేన సేవ్యే ।
నిత్యే నిరాతం కదయా ప్రపంచే నీలాలకశ్రేణి నమోనమస్తే ॥ 11

అనంగ పుష్పాదిభిరున్నదాభిరసంగదేవీ భిరజస్రసేవ్యే ।
అభవ్యహంత్ర్యక్షర రాశిరూపే హతారి వర్గే లలితే నమస్తే ॥ 12

సంక్షోభిణీ ముఖ్య చతుర్దశార్చిర్మాలావృతోదార మహా ప్రదీప్తే ।
ఆత్మానమాబిభ్రతి విభ్రమాద్యైశుభ్రాశ్రయే శుభ్రపదే నమస్తే ॥ 13

సశర్వ సిద్ధాదికశక్తి వంద్యే సర్వజ్ఞ విజ్ఞాతపదార విందే ।
సర్వాధికే సర్వగతే నమస్తే సిద్ధిప్రదే శ్రీ లలితా నమస్తే ॥ 14

సర్వజ్ఞ జాత ప్రథమాభిరన్యదేవీ భిరప్యాశ్రిత చక్రభూతే ।
సర్వామరాకాంక్షితపూరయిత్రి సర్వస్వ లోకస్య సవిత్రి పాహి ॥ 15

వందే వశిన్యాదికవాగ్విభూతే వర్ధిష్ణు చక్రద్యుతి వాహవాహే ।
బలాహక శ్యామకచే వచోఉబ్ధే వరప్రదే సుందరి పాహి విశ్వమ్ ॥ 16

బాణాది దివ్యాయుధ సార్వభౌమే భండాసురానీక వనాంతదావే ।
అత్యుగ్రతేజో జ్జ్వలితాంబురాశే ప్రసేవ్యమానే పరితో నమస్తే ॥ 17

కామేశి వజ్రేశి భగేశ్యరూపే కన్యే కలే కాలవిలోపదక్షే ।
కథావశేషీకృత దైత్యసైన్యే కామేశయాం (కాం) తే కమలే నమస్తే ॥ 18

బిందుస్థితే బిందుకలైకరూపే బింద్వాత్మికే బృంహిత చిత్ప్రకాశే ।
బృహత్కుచాంభోజ విలోలహారే బృహత్ప్రభావే లలితే నమస్తే ॥ 19

కామేశ్వరోత్సంగ సదానివాసే కాలాత్మికే దేవి కృతానుకంపే ।
కల్పావసానోత్థిత కాళీరూపే కామప్రదే కల్పలతే నమస్తే ॥ 20

సవారుణే సాంద్రసుధాంశు శీతే సారంగశావాక్షి సరోజవక్త్రే ।
సారస్య సారస్య సదైక భూమే నమస్తే విద్యేశ్వరి సంనతిస్తే ॥ 21

*(శ్లో॥11-30, అధ్యా-30, ఉ.భా.)*

పరమపవిత్రమైన లలితోపాఖ్యానాన్ని పఠించినవారికి అష్టసిద్ధులూ కలుగుతాయి. విపత్తులు తొలగిపోతాయి. భక్తిముక్తి రెండూ లభిస్తాయి. భోగభాగ్యాలతో వారు తులతూగుతారు. పుణ్యదినాల్లో ఈ చరిత్రని పఠిస్తే సకలశుభాలుకలుగుతాయి.

## బ్రహ్మాండ పురాణ ఫలశ్రుతి

కృష్ణద్వైపాయనేనోక్తం పురాణం బ్రహ్మావాదినా ।
ధన్యయశస్య మాయుష్యం పుణ్యంవేదైశ్చ సమ్మితమ్ ॥

ఎవరైతే కృష్ణద్వైపాయనుడి చేత చెప్పబడ్డ ఈ బ్రహ్మాండ పురాణాన్ని వింటారో లేక పఠిస్తారో వారికి ధనధాన్యభోగాలు ఆయుర్దాయం కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి. సకల పాపాలనుంచి విముక్తులై స్వర్గలోకాన్ని చేరతారు.

## స్వస్తి

**సర్వేజనాః సుఖినోభవన్తు**



